మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రై మాసపత్రిక

జులై- సెప్టెంబర్ 2013



ఈ

## జయకేతనం

కావాలి

చట్టసభలకు **దిక్సూచి**



# పల్లె తీర్పులో సగం

చైతన్య మానవి

సంపాదకీయం...

రాష్ట్ర వ్యాప్తంగా మూడు అంచెల్లో జరిగిన పంచాయితీ ఎన్నికలలో సగం స్థానాల్లో స్త్రీలు జయ కేతనం ఎగురవేశారు. భారత రాజ్యాంగం స్త్రీ, పురుష సమానత్వానికి ప్రాతిపదిక వేసినా ఈనాటికీ స్త్రీలు సామాజిక, ఆర్థిక, రాజకీయాలన్నింటా వివక్షకు గురవుతున్నారు. అలుపెరగని మహిళా ఉద్యమాల ఫలితంగా 73వ రాజ్యాంగ సవరణ ప్రకారం 1/3వంతు రిజర్వేషన్లు స్థానిక సంస్థలలో సాధించుకున్నాం. దీని ఫలితంగా దేశంలో 10లక్షలమంది మహిళలు అధికారపగ్గాలు చేపట్టి మహిళలకు పాలనా సామర్థ్యం లేదనే వాగుడుగాళ్ళ నోరు మూయించి పాలనలో తమ సామర్థ్యం చాటుకున్నారు.

ఫలితంగా 2009 సం॥లో స్థానిక సంస్థలలో రిజర్వేషన్లు 33 శాతం నుండి 50శాతానికి పెరిగింది. రాష్ట్రంలో ప్రస్తుతం జరిగిన ఎన్నికలలో సుమారు 11వేల మంది సర్పంచులు, 1,08,000మంది వార్డు సభ్యులుగా మహిళలు పాలనా పగ్గాలు చేజిక్కించుకున్నారు. శతాబ్దాల పురుషాధిక్యత స్త్రీలను వంటింటికే పరిమితం చేసినా కాలగమనంలో గణనీయంగా వచ్చిన మార్పులు కుటుంబ నిర్వహణలోనే గాక విద్య, ఉద్యోగ, ఉపాధి, పాలనా రంగాలలో తమదంటూ ప్రత్యేకతను అద్వితీయంగా నిర్వహిస్తున్నారు. అయితే ఈనాటికీ కొనసాగుతున్న పితృస్వామ్య వ్యవస్థలో ఉన్న పురుషాహంకారంతో “పదవి మాత్రమే నీది-పెత్తనం మాది” అనే ధోరణులతో మహిళలను స్వతంత్రంగా పనిచేయనీయకుండా ఆటంకాలు పెడుతున్నారు. ఇంటిని చక్కదిద్దే మనకు పంచాయితీ నిర్వహణ కష్టమైన పనికాదు. మన స్వతంత్రతను, వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలి. పెద్ద సంఖ్యలో ఎన్నికైన మహిళలకు ప్రభుత్వం పంచాయితీ విధానాలు, కర్తవ్యాలపై శిక్షణ తరగతులు నిర్వహించి వారి సామర్థ్యాన్ని అభివృద్ధి చేయాలి.

ఆరున్నర దశాబ్ధాల స్వతంత్ర భారతంలో అత్యధిక శాతం గ్రామాలు అభివృద్ధికి ఆమడదూరంలో వున్నాయి. వేలగ్రామాల్లో పారిశుధ్యం, తాగునీరు, మరుగుదొడ్లు, విద్యుత్ వంటి మౌలిక సదుపాయాలు లేవు. గిరిజన తండాలు, దళిత వాడలు మురికి కూపాలుగా మారాయి. 73,74 రాజ్యాంగ సవరణ ద్వారా 29 అధికారాలు పంచాయితీలకు బదలాయిస్తామన్న నిర్ణయం అమలు కాలేదు. విద్య, వైద్యం, వ్యవసాయం, మంచినీరు, విద్యుత్, గృహనిర్మాణం, ప్రజాపంపిణీ, రోడ్లనిర్మాణం స్థానిక సంస్థల అధ్వర్యంలో జరగాలి. కానీ స్థానిక సంస్థలు నిధులు, విధులు లేక ఆర్థిక సంక్షోభంతో కొట్టుమిట్టాడుతున్నాయి. మరో వైపు ప్రభుత్వం ఆదాయం కోసం గ్రామాల్లో బెల్టు షాపుల ద్వారా మద్యాన్ని ఏరులైపారిస్తోంది. దీని ఫలితంగా గ్రామసీమలలో వైషమ్యాలు పెరిగి శాంతి భద్రతల పరిస్థితి దిగజారుతోంది. మహిళలపై, బాలికలపై హింస పెరిగింది.

ఎన్నికైన స్త్రీలు ఆడవాళ్ళ సమస్యలపై ఎక్కువ దృష్టి పెట్టినా అది అందరికీ ఉపయోగపడే విధంగా మలచగలగాలి. తాగునీటి కోసం మైళ్ళ దూరం నడిచి గంటలకొద్ది కాలం వెచ్చించి నలిగిపోయేది స్త్రీలే. చీకట్లో తప్ప ‘బహిర్భూమి’కి వెళ్ళ లేక రోగాల పాలవుతుంది స్త్రీలే. ఇటువంటి కష్టాలు పల్లెటూళ్ళలో కోకొల్లలు. వాటిని అర్థం చేసుకుని, ప్రాధాన్యతనిచ్చి స్త్రీల చాకిరి తగ్గించాల్సింది స్త్రీలే. సర్పంచ్‌లు, సభ్యులు కలిసికట్టుగా పనిచేస్తేనే ఊరు బాగుపడుతుంది. ఊరిపనులు తొందరగా జరుగుతాయి. స్వార్థంతో ఎవరు వ్యవహరించినా ఊరు నష్టపోతుంది. ఊరు బాగుచేసేందుకే ప్రజలు అధికారమిచ్చారు తప్ప చెడగొట్టడానికి కాదని అందరూ గుర్తుంచుకోవాలి. గెలిచిన వారు తమ గొంతును గట్టిగా వినిపించాలి, ప్రజల బతుకు బరువును తగ్గించగలగాలి. పంచాయితీలకు సంక్రమించాల్సిన అధికారాలు, ఆర్థిక వనరులు దక్కినప్పుడే స్వపరిపాలన, సుపరిపాలన సాధ్యమవుతుంది. •




సూక్తి

"మతములన్నియు మాసిపోవును,జ్ఞాన మొక్కటే నిలిచి పోవును"

- గురజాడ




## అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం రాష్ట్ర కమిటీ

చిరునామా:

బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్: 2,1-8-1,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 27605845.
e-mail chaitanyamanavi@gmail.com

సంపాదకులు

**టి.జ్యోతి**

సంపాదక వర్గం

మల్లు స్వరాజ్యం

అల్లూరి మన్మోహిని

ఎస్. పుణ్యవతి

కె. స్వరూపరాణి

మేనేజర్

**ఎం.సుధ**

విరాళం రూ : 10/-

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్,
హైదరాబాద్ - 500 044.


## ఈ సంచికలో...

వ్యాసం

# మహిళా ఉద్యమం - వివిధ వర్గ స్త్రీల కార్యరంగ మవ్వాలి




- నంబూరి పరిపూర్ణ

మానవ సమాజ ప్రారంభ దశలో - స్త్రీ పురుషుల మధ్య ఏ వ్యత్యాసాలు,ఎక్కువ తక్కువలన్నవి లేనే లేవు. లింగపరంగా ఇరువురూ సమాన ప్రతిపత్తినీ, సాధికారతనూ కలిగివుండేవారు. అయితే - స్త్రీలు మానవ పునరుత్పత్తికి మూలకర్తలన్న గుర్తింపుతో - సమాజం వారికి విశిష్ట స్థానం ఇచ్చింది. తత్ఫలితమే మాతృస్వామిక వ్యవస్థ ఏర్పడడం, అది సుదీర్ఘకాలం వర్ధిల్లడం!.

సమాజ పరిణామక్రమంలో పురుష ప్రాధాన్యమున్న భూస్వామ్య వ్యవస్థ రూపుదాల్చింది. వ్యవసాయం జీవన వృత్తి అవ్వడం, గణజీవితం పోయి కుటుంబజీవితం స్థిరపడి, స్త్రీ-పురుషుడి భార్య అవ్వడం, ఆమె భర్తగా పురుషుడు ఆమెపై సర్వహక్కులూ దఖలు పరుచుకోవడం జరిగింది. ఆ తరువాత స్త్రీ -బిడ్డల్ని కనిపెంచుతూ, ఇంటిపనులు, భర్తకు సేవలు చెయ్యడం వరకు మాత్రమే ఆమె కార్యపరిధి కుదింపబడింది. కుటుంబ సమస్త ఆస్తులమీద-భర్తకే గాని-తనకెలాంటి హక్కులూ లేని వెట్టి బానిస అయ్యింది. చివరకు భర్తమీద, తన సంతానం మీద కూడా హక్కనేది లేనిదిగా ఆమె స్థానం దిగజార్చబడింది.

అలా మాతృస్వామిక వ్యవస్థ అణచబడి, అణగారి శూన్యంలో కలిసి పోయింది.

నాటి నుండి నేటివరకు -సమాజం స్త్రీకి తనదైన జీవితాన్ని అనుమతించలేదు. దారుణ వివక్షకు గురిచేస్తూ వస్తోంది. సంఘజీవితంలో ప్రధానమైన వివాహవ్యవస్థ-పాతివ్రత్యం అనే ఒక స్థిర ధర్మాన్ని స్త్రీకి నిర్దేశించగా-పురుషుడికెలాంటి ధర్మ నిబద్ధతలేదు. మనుధర్మ శాస్త్రం పూర్తిగా పక్షపాతంతో పురుషుడికి విశృంఖల నీతి సూత్రాల్ని -స్త్రీలకు శృంఖల బద్ధ నైతిక ధర్మాల్నీ ఆదేశించింది. పురుషుడు వ్యసనాలపుట్ట గావచ్చు. దీర్ఘరోగి, కాముక కిరాతకుడు గావచ్చు. భార్యకు అతడు పతిదేవుడు, ప్రత్యక్షదైవం! భార్య అతని వల్ల ఎంత ఎక్కువ బాధలను అనుభవిస్తే, అంత సులభంగా హాయిగా ఆమెకు స్వర్గప్రవేశం లభిస్తుంది.

ఈ విధమైన ఎన్నెన్నో సూక్తులు, తరతరాలుగా స్త్రీ జనాల మెదళ్లను వశపరుచుని బందబార్చాయి. పైలోక సుఖాల పట్ల భ్రమలు కల్పించి అవే ప్రధానమనుకునేలా చేశాయి.

మరోవక్క పురుషుడు -తనకు కలిగించబడిన ప్రత్యేక ప్రాధాన్యతను, తన ప్రత్యేక నీతిసూత్రాల వత్తాసుతో - కుటుంబస్థాయిలోను, సాంఘిక స్థాయిలోను-ఉన్నత స్థానంలో నిలబడ్డాడు. పరిమితుల్లేని జీవన శైలితో, అదుపులేని లైంగిక స్వేచ్ఛను పొందాడు. బహుభార్యలను, భార్యేతర సంబంధాలను తన జన్మహక్కుగా భావించి, ఉపయోగించుకోసాగాడు.

పెళ్లిమీద పెళ్లి, ఉంపుడుగత్తెలు, భోగలాలసత తీర్చుకునేందుకు వేశ్యావాడలు అన్నీ తనకు సంఘం దఖలు పరిచిన సర్వం సహాధికారాలు.

'హైందవం'లోని ప్రతిదేవుడూ యిద్దరు ముగ్గురు భార్యల్ని కలిగి వుండగా, వారి భక్తజనాలకు బహుభార్యలుండడం తప్పెలా అవుతుంది ?

మరో ముఖ్యసంగతి, మగప్రాణుల శృతిమించిన కామక్రీడలకు బలి అవుతున్న స్త్రీజనాలకు సంబంధించింది. దేవుడి పేరుమీద -దేవదాసీల్ని, మాతల్ని, జోగినుల్ని ఏర్పాటుచేసి, వారిని "ఊరుమ్మడి సెక్సుయంత్రాలుగా వాడుకునే ఆచారం - ప్రాచీనం నుంచీ కొనసాగిస్తోంది పురుషసంఘం. ఈ 'భోగినులకు' భర్తలుండరు. బిడ్డలకు తండ్రులుండరు. బిచ్చమెత్తో, తిరిగి ఒళ్లమ్ముకునో తల్లులు బిడ్డల్ని పోషించుకుంటూ వుంటారు.

ఈ వేశ్యా వ్యవస్థలు -వెనుకబడిన ప్రాంతాల్లో -యిప్పటికీ కొనసాగుతున్నాయి.

వ్యవస్థీకృత రూపంలోకాక పోయినా, ఈ మాదిరి సెక్సు దోపిడీకి - గ్రామీణ బడుగు వర్గ స్త్రీలు నిత్యం బలి అవుతుండడం ఒక కాదనలేని వాస్తవం - ఆధిక్యకుల, వర్గపు స్త్రీల స్థితికన్నా, వీరిది అనేక రెట్లు- అధ్వాన్నపుస్థితి. అసలే సామాజికంగా - అతి దిగువస్థాయిస్థితి! పుట్టుకతోనే కులహీనతను, దారిద్ర్యాన్ని, అజ్ఞానాన్నీ వెంటదీసుకొస్తారు. మామూలుగా అంటరాని వారు, కొన్ని ప్రాంతాల్లో చూడరానివారు కూడా . "ఆ... ఇంకా ఎక్కడుంది అంటరాని తనం ?అదెప్పుడో అంతరించింది" అని చాలమంది అనడం వింటూ ఉంటాం. కానీ -గ్రామాల్లో పనిచేసే దళిత ఉద్యోగులు, సంఘకార్యకర్తలు - యిలాంటి 'ఎగరవేతల్ని' -ఒప్పుకోరు. వాస్తవ స్థితిగతులు వారికి తెలుసు. ఇప్పటికీ కొనసాగుతున్న ఒక్క విషయం గమనిస్తే చాలు

నాటినుండి నేటివరకు -సమాజం స్త్రీకి తనదైన జీవితాన్ని అనుమతించలేదు. దారుణ వివక్షకు గురిచేస్తూ వస్తోంది. సంఘజీవితంలో ప్రధానమైన వివాహవ్యవస్థ-పాతివ్రత్యం అనే ఒక స్థిర ధర్మాన్ని స్త్రీకి నిర్దేశించగా-పురుషుడికెలాంటి ధర్మ నిబద్ధతలేదు. మనుధర్మ శాస్త్రం పూర్తిగా పక్షపాతంతో పురుషుడికి విశృంఖల నీతి సూత్రాల్ని -స్త్రీలకు శృంఖల బద్ధ నైతిక ధర్మాల్నీ ఆదేశించింది.

మన ప్రజాపాలకులు - ప్రజల్లో అత్యధికులైన శ్రామిక, దళిత కుటుంబాలకు ఒనగూర్చుతున్న మేళ్లను గురించి కొంచెం చెప్పుకోవడం అవసరం. గత వందేళ్లుగా ప్రభుత్వం అత్యంత పకడ్బందీగా అమలు చేస్తున్న మద్యం విధానం, మద్యం అమ్మకాలు -నిరుపేద శ్రామిక, దళిత కుటుంబాలను నరకప్రాయం చేస్తున్నాయి. ఇంతకు ముందుకన్నా -రకరకాల మద్యాలు మరింత మరింతగా మగాళ్ల కందుతుండగా - ఆడవాళ్లకు మరిన్ని దెబ్బలు, హింసలు, బోలెడు అప్పులు అందుతున్నాయి.

ఈ సందర్భంగా, ఊరందరికోసం ఉద్దేశించబడ్డ ప్రభుత్వ ఊరబావిని ముట్టుకోడం ఇప్పటికీ అపరాధం గ్రామసీమల్లో.

కులహీనత అవమానాల్ని, అణచివేతల్ని-భర్తతోపాటు అనుభవిస్తున్న దళిత మహిళ-మళ్లీ మగాడి ఆధిక్యతతో తన మగడు సాగించే దౌష్ట్యాన్నీ, హింసనూ-కిమ్మనకుండా భరిస్తుంటుంది. అతడు పై కులాలకు, వర్గాలకు బానిస. ఆ బానిసకు బానిస-అతడి భార్య. మగ ఆధిక్యతకు, స్త్రీల అణచివేతకు మన సమాజంలో వర్గాలతో నిమిత్తంలేదు.

దళిత స్త్రీలు - భర్తతోపాటు భూస్వాముల, మోతుబర్ల ఇళ్లలో పన్లు చేస్తుంటారు. పొలాల్లో పన్లు సరేసరి. అట్టి సమయాల్లో పైకులపు మగాళ్లు-వీళ్లమీద అత్యాచారాలు చెయ్యడం నల్లేరుమీద బండినడకంత సులభం.

ఈ సంగతులలావుంచి, దళిత మహిళల మొగుళ్లు, వారిని పెట్టే రకరకాల హింసల గురించి కొంచెం చూద్దాం.. మగాడితోపాటు పొలం పనులు, కూలి పనులు చేసి సంపాదించుకొస్తుంది భార్య. ప్రతి పైసా ఇంటి అవసరాలకు వాడుతుంది. మగాడి సంపాదన, రోజువారీగా చేరేది కల్లు, సారా దుకాణాలకి. ఆడది తను తెచ్చిన కూలి డబ్బుల్తో ఇంత వండి పిల్లలికీ అతనికీ పెట్టడంతోపాటు, తాగొచ్చిన మగడి తిట్లూ, దెబ్బలూ తింటూ బ్రతుకుతుంటుంది. ప్రతి రాత్రీ, అతను ఏదో ఒక తగవు సృష్టించి -ఇంటిని అల్లకల్లోలపర్చి చివరకు భార్యను చితకబాది నిషా దించుకుంటాడు. భార్యను కొట్టకపోతే నిషా దిగదు.

ఇతర స్త్రీలలో లాగానే -అట్టడుగు కులాల స్త్రీలలోనూ, పాతివ్రత్యపు గొప్పతనపు భ్రమలు జీర్ణించి వుంటాయి. భర్త ఆగడాల్ని, హింసల్ని ఎంత ఎక్కువగా భరిస్తే అంత గొప్ప పాతివ్రత్యం నెరపుతున్నట్టు! దళితుల్లో అత్యధిక శాతం వారు హైందవ మత అనుయాయులు గావడంవల్ల వీరికే ఆ మనుధర్మ సూత్రాలు బాగా వంటబట్టి వుంటాయి.

ఇక మన ప్రజాపాలకులు -ప్రజల్లో అత్యధికులైన శ్రామిక, దళిత కుటుంబాలకు ఒనగూర్చుతున్న మేళ్లను గురించి కొంచెం చెప్పుకోవడం అవసరం. గత వందేళ్లుగా ప్రభుత్వం అత్యంత పకడ్బందీగా అమలు చేస్తున్న మద్యం విధానం, మద్యం అమ్మకాలు -నిరుపేద శ్రామిక, దళిత కుటుంబాలను నరకప్రాయం చేస్తున్నాయి. ఇంతకు ముందుకన్నా -రకరకాల మద్యాలు మరింత మరింతగా మగాళ్ల కందుతుండగా - ఆడవాళ్లకు మరిన్ని దెబ్బలు, హింసలు, బోలెడు అప్పులు అందుతున్నాయి.

కూలి జన సమూహాల తాగుడు రెవెన్యూలతో దొరవారి ఖజానాలు ఒక ప్రక్కన నిండుతోంటే -మరోపక్క ఆ జనాల కొంపలు పూర్తిగా లూటీ అయిపోతూ రోడ్డున పడుతున్నాయి. మద్యం అమ్మకాల టార్గెట్లు ఏటేటా పెంచి వేస్తూ, వాటిని సాధించిన ఎక్సైజ్ అధికార్లకు ప్రమోషనులిచ్చి గౌరవిస్తోంది. సమాజం మొత్తాన్ని తాగుబోతుగా మారుస్తున్న ప్రభుత్వానికి 'ప్రజాసంక్షేమం' "సంక్షేమపథకాలు" - అంటూ వల్లించగల అర్హత, నైతికత వున్నదా అసలు ?

దేశమంతటా చెలరేగే దోపిడీలు, హత్యలు, పసిపాపలమీద సైతం అత్యాచారాలు, రోజువారీగా డజన్లకొద్దీ రోడ్డు యాక్సిడెంట్లు -వీటన్నింటికీ మూలకారకులు మీతిమీరిన తాగుబోతులు, తాగుడే అన్న సంగతి పాలకులకు తెలియదా? ఇంత వినాశనంతో, యింత నికృష్టరీతిలో అందుతున్న-ఆదాయంతో ప్రజాసంక్షేమ పథకాలా?!వాటితో ప్రజా బ్రతుకుల్ని ఉద్ధరించడమా! ప్రకటనల్లో, ప్రచారాల్లో ఎంత చాతుర్యం! ఎంత ఆత్మవంచన !!

వాకపల్లి గిరిజన స్త్రీల దుర్ఘటన మీద -వివిధ మహిళాసంస్థలు, నేతలు స్పందించి,ఆందోళన జరిపిన తీరు చాలామెచ్చదగిందో ఐతే నేటివరకూ - "రాక్షసభటులకు" శిక్షలు పడ్డాయా ? బాధిత స్త్రీలకు తగు న్యాయం అందిందా ? మరి అవి అందేంత వరకు -పోరాటం సాగుతూనే వుండాలి గదా. ఫలితాన్ని సాధించి తీరాలి గదా!

ఇదే దయనీయ స్థితి అయేషా ఉదంతానిది కూడా. ఏళ్ళకేళ్లుగా ఆ గొంగళి అక్కడేవుంది. పాలకులు రక్షకభట వర్గాలు చూపిస్తున్న అబద్ధపు ముద్దాయిగాక అసలు నేరస్థుణ్ణి పట్టి శిక్షించే వరకూ పోరాటం జరపకుండా, సాగించకుండా, చల్లబడితే - ఒనకూడే ప్రయోజనమేమిటి ?

అలాగే మహారాష్ట్రలో కైర్లాంజీ దుర్ఘటన అదింకా ఒక పచ్చి జ్ఞాపకమే. ఆగ్రామ ఆధిక్య కుల భూస్వాములు ఓ దళిత కుటుంబం మొత్తాన్ని అతి కర్కశంగా, నీచరీతిలో హత్యగావించారు. తల్లీ కూతుళ్ల బట్టలు వలిచి ఊరంతా ఊరేగించారు. ఇద్దరు కొడుకులతో సహా వారందర్నీ ఊరిజనం సమక్షంలో హత్య చేయగా - ఎలాగో తప్పించుకు పారిపోయిన ముసలి తండ్రి ద్వారా - హత్యాకాండ బయటికి తెలిసింది.

మహిళలపై అత్యాచారాలు, వారి హత్యలకు సంబంధించిన ప్రభావం, సమాజం మీద, ప్రత్యేకించి ఉద్యమ కార్యకర్తలమీద విభిన్న రీతుల్లో, స్థాయిల్లో పడుతున్నమాట నిజం. దుర్ఘటనకు బలి అయిన వర్గపు సాంఘిక, ఆర్థిక స్థాయిని బట్టి, ఆ దుర్ఘటన స్వభావ తీవ్రతల అంచనాలు జరుగుతున్నాయి. అట్టడుగు పేద వర్గాల దుర్ఘటనలు, దురంతాలు స్త్రీ ఉద్యమకారులు ప్రత్యేక శ్రద్ధతో చేపట్టాలి.

మరి స్త్రీ ఉద్యమాలు, పోరాటాలు-సమాజంలోని అన్ని వర్గాల స్త్రీల సమస్యలపైన, హింసలపైన కొనసాగింపబడాలికదా ? బాధితురాలు, బలిపశువు అయిన స్త్రీ -హిందువా, ముస్లిమా, పైవర్గమా, అట్టడుగువర్గమా అన్న ఎలాంటి మీమాంసకు తావులేని-విశాల విస్తృత కదనరంగంలోకి -యావత్తు స్త్రీ జాతిని సమీకరించుదాం.

సంఘటిత స్త్రీ శక్తి ఎంతటిదో చూపుదాం.

చైతన్య స్ఫూర్తి



# మహిళల పోరాటాలకో ఉత్తేజం
# వీణా మజుందార్

- ఇందూ అగ్నిహోత్రి

వీణామజుందార్ ఆలోచనలను క్రోడీకరించి గ్రంధస్థం చేయడం అంటే, మహిళలు స్వాతంత్ర్యం కోసం, మార్పుకోసం చేసిన పోరాటాలను చరిత్ర పుటలలోని కొన్ని ముఖ్యఘట్టాల్లో పొందుపరచడమే. ఈ ప్రక్రియలో, ఆమె జీవితంలోని ముఖ్య ఘట్టాలను వరుసగా వ్రాసుకుంటూ పోతే మన ప్రమేయం లేకుండానే ఆనాటి ఎన్నో ఉమ్మడి మహిళా ఉద్యమాలతోపాటు మారుతున్న భారతదేశంలోని మహిళలు మరింత సమర్ధవంతంగా తమ శక్తిని స్థిరపరుచుకోవడం అవిష్కరించబడుతుంది.

సంపన్న కుటుంబంలో పుట్టడం వలన, ఆనాటి మంచి విశ్వవిద్యాలయాలలో కలకత్తా విశ్వవిద్యాలయం, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం, ఆక్స్‌ఫోర్డ్‌లలో విద్యాభ్యాసం చేయగలిగారు. ఆ అవకాశాలు ఆమెకు ఉన్నతంగా ఆలోచించే శక్తి నిచ్చాయి. అందువలనే స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. 1990లో దక్షిణ ఆసియాను తుడిచిపెట్టేసిన మార్పులకు దూరంగా ఉన్నారు. బలమైన ప్రజాస్వామ్య భారతదేశ నిర్మాణంలో పాలు పంచుకున్నారు. దేశానికి ఎంతగానో ఉపయోగపడ్డారు. పాశ్చాత్య, ఉదారవాద ప్రజాస్వామ్య భావనలు, ప్రజ్ఞపాతవాల సాంప్రదాయం ఆమెను ఉన్నతంగా ఆలోచింపజేసాయి. అందువలన భారతదేశం వచ్చిన వెంటనే ఆనాటి భారత పరిస్థితులను, ఆలోచనా ధోరణిని, సామాజిక స్థితిగతులను విమర్శనాత్మకంగా పరిశీలించి, నవభారత నిర్మాణ లక్ష్యాలను ఏర్పరచగలిగారు. ఆమె అంతర్జాతీయ రాజకీయ శాస్త్రం, చరిత్ర చదువుకుని ఉన్నందువలన ఈ సమాజం మనకనుకూలంగా మార్చుకునేందుకున్న పరిమితులు కూడా ఆమె దృష్టిలో ఉన్నాయి. అయితే ఆమెకున్న పోరాటతత్వం వలన ఆమార్పులను తెచ్చేందుకు, కొత్త శతాబ్దంలో కొత్త సమాజం నిర్మించేందుకే ఆమె సిద్ధపడ్డారు.

భారత ప్రభుత్వం (మానవవనరుల అభివృద్ధిశాఖ మరియు స్త్రీలు, పిల్లల అభివృద్ధిశాఖ) ఆమెకిచ్చిన చివరి పని - మహిళలు, సమానత్వం మరియు పరిపాలన భారత చరిత్రలో ముఖ్యఘట్టాలు. ఇందులో ఆమె భారత ప్రభుత్వం మర్చిపోయిన అనేక ఘట్టాలను పొందు పరిచారు. అధికారిక సమాచారంతోపాటు, ఉద్యమాలనుండి కూడా సమాచారం సేకరించి 10 ఖండాలుగా ఈ వివరాలన్నీ గ్రంధస్థం చేసారు. ఈ మొత్తం విషయసేకరణకి ,గ్రంధస్థం చేసేపనికి ఆమే ప్రధాన ఎడిటర్‌గా బాధ్యత నిర్వహించారు.

2006సంులో ప్రభుత్వం వీణామజుందార్‌ను సామాజిక శాస్త్ర జాతీయ ప్రొఫెసర్‌గా నియమించినపుడు, తనను ఒక సామాజిక శాస్త్రవేత్తగా గుర్తించినందుకు ఎంతగానో సంతోషించారు. ఈ పదవి వల్లే ఆమె ముందు ముందు అధ్యయనాలు మరింత ఆసక్తిగా కొనసాగించారు. అయితే ఆమెను మహిళా అధ్యయనవేత్తగా మాత్రమే ముద్రవేయడమంటే ఆమెకున్న అపార తెలివితేటలను, సమర్థతను తక్కువగా అంచనా వేయడమేకాక కుదించడమే అవుతుంది. ఆమె చివరి క్షణం వరకు ప్రక్కదోవ పడుతున్న విద్యావిధానాలు, లక్ష్యాల గురించి ఆమె ఆందోళన పడుతుండేవారు. కాగా వైవిధ్య భరితమయిన ఆలోచనలపట్ల, అధ్యయనాల పట్ల ఆసక్తి చూపేవారు.

ఒక సామాజిక శాస్త్రవేత్తగా, విద్యావేత్తగా ఆమె సమాజంలోని మార్పులను గమనించి అందుకు మూలాలను అధ్యయనం చేయడమేకాక ఆ మార్పులు సమాజాభివృద్ధికి తోడ్పడేందుకు చేసుకోవలసిన జోక్యాలను కూడా సూచించేవారు. 1974సంు వీణామజుందార్ ఆధ్వర్యంలో భారతదేశంలో, స్త్రీ పరిస్థితిపై అధ్యయనం చేసి "సమానత్వం వైపు" అనే ఓ రిపోర్టు తయారుచేసి ఇచ్చింది. ఇందులో ఎన్నో వాస్తవాలు, గణాంకాలు, అనుభవాలు పొందుపరచబడి ఉన్నాయి. అంతేకాదు అందులో ఆమె, సమాజ ఉన్నతిపైనే స్త్రీల ఉన్నతి కూడా ఆధారపడి ఉంటుందని స్పష్టంగా చెప్పారు. సమాజ ఉన్నతికి ప్రభుత్వం అనుసరిస్తున్న విధి విధానాల ఆధారంగానే అందులో అంతర్భాగమయిన స్త్రీ పరిస్థితి, స్థితికూడా ఉంటుందని చెప్పారు.

వ్యవస్థాగత మార్పులను అణగారిన

భారతదేశం వచ్చిన వెంటనే ఆనాటి భారత పరిస్థితులను, ఆలోచనా ధోరణిని, సామాజిక స్థితిగతులను విమర్శనాత్మకంగా పరిశీలించి, నవభారత నిర్మాణ లక్ష్యాలను ఏర్పరచగలిగారు. ఆమె అంతర్జాతీయ రాజకీయ శాస్త్రం, చరిత్ర చదువుకుని ఉన్నందువలన, ఈ సమాజం మనకనుకూలంగా మార్చుకునేందుకున్న పరిమితులు కూడా ఆమె దృష్టిలో ఉన్నాయి. అయితే ఆమెకున్న పోరాటతత్వం వలన ఆమార్పులను తెచ్చేందుకు, కొత్త శతాబ్దంలో కొత్త సమాజం నిర్మించేందుకే ఆమె సిద్ధపడ్డారు.




మహిళలు ప్రశ్నించగలరని, విమర్శించగలరని, నిర్ణయాలు చేయగలరని ఆమెకు ఎంతో విశ్వాసం ఉండేది. ఎందుకంటే అసమానతలో అణగారిన జీవితాలు మార్చుకోవాలన్న తపన వారికెక్కువగా ఉంటుంది. భారతీయులలో, ముఖ్యంగా స్త్రీలలో ఉన్న సామాజిక వెనుకబాటుతనం, ఆర్థిక అసమానతలు రూపుమాపాలన్న దృఢసంకల్పాన్ని, ప్రతి సమావేశంలోనూ ముందువరుసలో కూర్చున్న ముఖ్యులందరికీ గుర్తుచేసేందుకే ఆమె ప్రతి సమావేశాన్ని 'మన ప్రజలు' అంటూ ప్రారంభించేవారు.

ప్రభుత్వం వేసిన అనేక కమిటీలలో ఆమె సభ్యురాలు. కమిటీలలో సభ్యత్వం ఆమోదించేముందు, ఆమోదించినందు వలన ఆమెకు స్వయంగా కలిగే ప్రయోజనాల కన్నా ఆమె ఊరూరా తిరిగి రూపొందించిన (కమిటీ ఆన్ దిస్టాటస్ ఆఫ్ వుమన్ ఇన్ ఇండియా) (సి.ఎస్.డబ్ల్యూ.ఐ) ఎజెండా ముందుకు తీసుకెళ్ళేందుకు తోడ్పడుతుందా లేదా అనే చూసేవారు. భారత ప్రజలు తమ భవిష్యత్తును, గమ్యాన్ని తామే రూపొందించుకుంటారన్న ప్రగాఢ నమ్మకం ఉండడంవలననే ఆమె అనేక అంతర్జాతీయ సభలలో ఎంతో విశ్వాసంతో ప్రసంగించ గలిగేవారు.

వీణామజుందార్ పాత్ర గురించి, నమ్మకాల గురించి లేదా ఆమె భాగస్వామ్యం గురించి అనేక సందర్భాలలో చెప్పుకోవచ్చు. అయితే ఈ అసాధారణ వ్యక్తిత్వం గల మహిళ, ఈ దేశంలోని మహిళలను ఎలా అర్థం చేసుకున్నారో తెలుసుకునే ప్రయత్నం చేయడమే మనం ఆమెకు అర్పించే అసలయిన నివాళి. బంకురాలోని వ్యవసాయ పనులు చేసుకునే మహిళలుగాని, బెంగాల్‌లోని మిద్నపూర్‌లో గిరిజన మహిళలు గాని సంఘటితమయి తమ జీవన భృతిని సంపాదించుకునే మార్గాలను అన్వేషించడంలో ఆమె వారికి సహకరించారు. అంతే కాక రాష్ట్ర ప్రభుత్వంకూడా వారి కృషికి తోడ్పడేటట్టు చేసారు. ప్రకృతి సహజ సంపద తరతరాలుగా ఆ ప్రాంతంలో నివసించే ప్రజలకే చెందుతుందని, ఆ ప్రజల అభివృద్ధికి మాత్రమే వాటిని ఉపయోగించేందుకు రాష్ట్ర ప్రభుత్వాలు కృషి చేయాలని నొక్కి చెప్పారు. బంకురా గిరిజనులు వారి జీవన భృతి కోసం ఒకచోటినుండి వేరొక చోటికి తిరుగుతూ ఉండవలసి వచ్చేది. అందువలన వారనేక ఇబ్బందులు పడవలసి వచ్చేది. అటువంటి వారికి స్థిరంగా ఉండి, కలిసికట్టుగా అభివృద్ధి చేసుకునే అవకాశం కల్పించారు వీణామజుందార్. గిరిజనులు తమను తాము గౌరవ ప్రదంగా బతికేందుకు ఎలా అభివృద్ధి చేసుకున్నారో అనే దానికి ఉదాహరణగా అంతర్జాతీయ కార్మిక సంస్థలో (ఐ.ఎల్.ఓ) బంకురా ఉదంతం కథగా చెప్పబడింది.

1988సం॥లో నేషనల్ పర్‌స్పెక్టివ్ ప్లాన్‌లో, 1994 లో జాతీయ జానాభా విధానం, జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ అవలంబిస్తున్న విధానాలను క్షుణంగా పరిశీలించి, ఎప్పటికప్పుడు తగిన విమర్శలు చేసి వాటిని ప్రజలకనుకూలంగా తీర్చిదిద్దేందుకు కృషి చేసారు. జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ గూర్చి ప్రధాని మన్‌మోహన్ గారికి ఓ బహిరంగ లేఖకూడా వ్రాసారు.

అంతర్జాతీయ సంస్థలలో కూడా వీణామజుందార్ ఈ విధంగానే జోక్యం చేసుకునేవారు. 1975 లో మెక్సికోలో జరిగిన మొట్టమొదటి ప్రపంచ మహిళల యునైటెడ్ నేషన్స్ మహాసభ దగ్గరినుండి 1995 లో కోఫెన్ హెగన్‌లో జరిగిన ప్రపంచ సోషలిస్టు అభివృద్ధి సభ మధ్యకాలంలో ప్రపంచంలోను, యునైటెడ్ నేషన్స్‌లోనూ జరుగుతున్న మార్పులను ఆమె గమనించారు. ఈ మార్పులకు వ్యతిరేకంగానే ఆమె బీజింగ్‌లో జరిగిన మహాసభకు అధికారిక ప్రతినిధి బృందంలో పాలుపంచుకునేందుకు ఇష్టపడలేదు. ఆమె ఓ స్వాతంత్ర పోరాట బిడ్డ. అందువలననే సామ్రాజ్యవాద వ్యతిరేకత తగ్గుతున్న అంతర్జాతీయ సమావేశాలకు ఆమె దూరమవుతూ వచ్చారు. పోనుపోను అంతర్జాతీయ సంస్థలో మహిళా హక్కులకోసం జరపవలసిన చర్చలు తగ్గు ముఖం పట్టాయి. అందుకే ఆమె వాటిలో పాలుపంచుకునేందుకు ఆసక్తి చూపడం తగ్గించారు.

1970 నుండి 1980 మధ్య అలీన ఉద్యమం బలంగా ఉన్న రోజుల్లో ఐక్యరాజ్యసమితి చొరవతో జరిగిన అంతర్జాతీయ సదస్సులలో మహిళలు భాగస్వాములు అయ్యేందుకు అవకాశాలెక్కువగా ఉండేవి. వీణా మజుందార్ ఆ సదస్సులలో మన వాణి వినిపించేవారు. ప్రచ్ఛన్న యుద్ధానంతర కాలంలో మారిన ప్రాముఖ్యతలను, ఆమె ఒక వామపక్ష ఉద్యమకారిణి కానప్పటికీ స్పష్టంగా గమనించారు.

ఆమె ఓ స్వాతంత్ర పోరాట బిడ్డ. అందువలననే సామ్రాజ్యవాద వ్యతిరేకత తగ్గుతున్న అంతర్జాతీయ సమావేశాలకు ఆమె దూరమవుతూ వచ్చారు. పోనుపోను అంతర్జాతీయ సంస్థలో మహిళా హక్కులకోసం జరపవలసిన చర్చలు తగ్గు ముఖం పట్టాయి. అందుకే ఆమె వాటిలో పాలుపంచుకునేందుకు ఆసక్తి చూపడం తగ్గించారు.

**కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రూపొందించిన అనేక విధి విధానాల రూపకల్పనలో ఆమె, జోక్యం చేసుకునేవారు. అందుకోసం ఏడుగురు అక్కచెల్లెళ్ళుగా పిలవబడే ఒక ఏడు జాతీయ మహిళాసంఘాల ఉమ్మడి వేదికను ఉపయోగించుకునేవారు. రాజకీయ బేధాల కతీతంగా మహిళల అభ్యున్నతే ధ్యేయంగా ఈవేదిక పని చేసేది. ఇదే వేదిక 1980లలో 1990 లలో ఛాందసవాద సవాళ్లను ఎదిరించేందుకు కూడా ఉపయోగపడింది.**

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రూపొందించిన అనేక విధి విధానాల రూపకల్పనలో ఆమె జోక్యం చేసుకునేవారు. అందుకోసం ఏడుగురు అక్కచెల్లెళ్ళుగా పిలవబడే ఒక ఏడు జాతీయ మహిళాసంఘాల ఉమ్మడి వేదికను ఉపయోగించుకునేవారు. రాజకీయ బేధాల కతీతంగా మహిళల అభ్యున్నతే ధ్యేయంగా ఈవేదిక పని చేసేది. ఇదే వేదిక 1980లలో 1990 లలో ఛాందసవాద సవాళ్లను ఎదిరించేందుకు కూడా ఉపయోగపడింది.

వీణామజుందార్ జోక్యంతోనే (సెంటర్ ఫర్ వుమెన్ డెవలప్‌మెంట్ స్టడీస్) సి.డబ్ల్యూ.డి.ఎస్ మహిళాభ్యుదయ అధ్యయనకేంద్రం అవతరించిందనేందుకు ఎటువంటి సందేహం లేదు. ఇది ప్రణాళికలు రూపొందించేటప్పుడు మహిళలపై కేంద్రీకరించవలసిన అవసరాన్ని గుర్తించేందుకు ఉపయోగపడుతుంది. దీని ఫలితం మనకళ్ళముందే ఉంది. ఆరవ పంచవర్ష ప్రణాళిక రూపకల్పనలో ఏకంగా ఒక అధ్యాయం మహిళల కోసం కేటాయించడం జరిగింది. అప్పటి నుండి ఈ అధ్యయనం ఒక ప్రముఖ స్థానాన్ని సంతరించుకుంది.

ఆ తరువాత 1982 జులైలో అఖిలభారత ప్రజాతంత్ర మహిళాసంఘం, సి.డబ్ల్యూ.డి.ఎస్.తో కలిసి ఎమ్నియోసెనెటిసిస్ (లింగనిర్ధారణ పరీక్ష)పై అవగాహనకు ఒక సమావేశం ఏర్పాటుచేసాయి. ఈ పరీక్ష వల్ల స్త్రీ, పురుష లింగనిష్పత్తి తగ్గుతున్నదని 1974లోనే సి.ఎస్.డబ్ల్యూ.ఐ చెప్పిన విషయం నిర్ధారించబడింది. వీణా మజుందార్ వరకట్న వ్యతిరేక చైతన్యవేదికను ఏర్పాటుచేసి ఐద్వాతో చర్చించిన తరువాత ఒక అధికారిక పత్రం రూపొందించారు. దీనినే 1982 నుండి 1984 వరకు విస్తృతంగా ప్రచారం చేసాం. అందువలనే వరకట్న చట్టానికి ఎంతో అవసరమయిన ఒక సవరణ కూడా తేగలిగాం.

1983లో నామ్ ఏడవ మహాసభ ఢిల్లీలో జరిగింది. ఆవేదిక కూడా మహిళల ఉన్నతికి ఉపయోగపడాలన్న ఉద్దేశ్యంతో వీణామజుందార్ రాష్ట్రాది నేతలున్న ఆవేదికపై, మహిళల డిమాండ్స్‌పై ఒక పత్రం ప్రవేశ పెట్టారు. సి.ఎస్.డబ్ల్యూ.ఐ ముఖ్య డిమాండ్లలో ఒకటి మహిళా కమీషన్ ఏర్పాటు అయితే మహిళా సంఘాలతో సంప్రదించకుండా ఆ కమీషన్ హోదా తగ్గించారు. స్థాయిని కూడా తగ్గించారు. ఒక కమీషనర్‌ను నియమించాలని నిర్ణయించారు. ఇందుకామె తీవ్ర అభ్యంతరం వ్యక్తం చేసారు. అలాగే అందరినీ ఒప్పించాలన్న నెపంతో స్త్రీల రిజర్వేషన్ బిల్లును ఎప్పటికప్పుడు దాటవేయడాన్ని ఎగతాళి చేసారు. మహిళలకు సంబంధించిన వాస్తవ పరిస్థితులు తెలుసుకునేందుకు ప్రభుత్వం వేసే ప్రతి ముఖ్యమైన అడుగుకు ముందుగా మహిళా సంఘాలను సంప్రదించవలసిందేనని నొక్కి చెప్పారు. సంప్రదించడం అంటే వాయిదా వేసేందుకు ఒక సాధనంకాదు. ప్రచారం అసలే కాదు. వాస్తవాలు తెలుసుకునే మార్గం మాత్రమే.

వీణామజుందార్ జాతీయ అంతర్జాతీయ మహిళా సదస్సులలో స్త్రీల తరుపున స్త్రీల హక్కుల గురించి ఎంత సులువుగా వాదించగలిగేవారో, అభివృద్ధి చెందిన దేశాలు తమ ఎజెండాను అభివృద్ధి చెందుతున్న దేశాలపై రుద్దకుండా ఎలా కాపాడేవారో, అంతే సులభంగా ఆమె మారుమూల పల్లెల్లోని గృహిణులతోనూ మాట్లాడగలిగేవారు. అలాగే ఆమెకు పెద్దపెద్ద అధికారులతో పరిచయాలుండేవి. స్నేహితులుండేవారు. కానీ వారి విధానాలను అవసరమయినపుడు నిర్మొహమాటంగా విమర్శించడానికి ఆమె ఎప్పుడూ వెనుకాడేవారు కాదు. ఆమె నిష్కపటం, ఉత్సాహం ఆమెకు ఎంతో శక్తినిచ్చేవి. పట్టణాలలో, నగరాలలో సభలకు వెళ్ళినపుడు అక్కడకు వచ్చిన యువ విద్యావేత్తలతో పొద్దుపోయేవరకు రకరకాల విషయాలపై చర్చించేవారు. వారితో పరిచయాలు పెంచుకునేవారు. వారి సమస్యలు, అవి వ్యక్తిగతమయినా, వృత్తిపరమైనవైనా పంచుకునేవారు. సలహాలు, సూచనలు ఇచ్చేవారు. ఆంగ్లంలోను, బెంగాలీలోను కవితలు చెప్పి సభికులను ఆకట్టుకునేవారు. సంస్కృత శ్లోకాలు చెప్పి ఆశ్చర్యపరిచేవారు.

ఈ గుణాలే వీణామజుందార్‌ను ఒక్క దక్షిణ ఆసియాలోనే కాక అన్ని దేశాలలోని ప్రజలకు దగ్గర చేసాయి. గౌరవాన్ని సంపాదించిపెట్టాయి. దేశ ఎల్లలుగాని, సిద్ధాంత బేధాలుగాని హద్దులుగా నిలవలేదు. ఆమె అందరితోనూ మమేకమయ్యేవారు. గిరిగీసుకుని ఎప్పుడూ ఓ చట్రంలో ఉండేవారు కాదు. చట్టం విషయంలో ఆమె గట్టిగా నొక్కి చెప్పడానికి కారణం ఆమె చిరకాల మిత్రుడు లోహితాసర్కార్. భారత దేశంలోనే కాదు ప్రపంచదేశాలన్నింటా ఆమె జోక్యం చేసుకునేది ప్రజల సమస్యలపైనే.

వీణామజుందార్‌తోపాటే మహిళా ఉద్యమ సంఘాలకు, దూరదృష్టితో మహిళలందరి జీవితాలలో మార్పు కోసం కృషి చేస్తున్న వారి శకానికి మధ్య బంధానికి తెరపడింది.

జీవిత చరమాంకంలో సైద్ధాంతిక సమస్యలపై వైవిధ్య భరితమయిన కోణాలనుంచి జరిగే వాదనలను ఆమె గమనిస్తూ ఉండేవారు. ఒక రాజకీయ శాస్త్ర విద్యార్థిగా హంగూ, ఆర్భాటాలు, అట్టహాసాలు లేని నిజమయిన ఉద్యమాల ప్రాధాన్యత ఆమెకు తెలుసు. సామాజిక స్పృహతో కూడిన జ్ఞాన సముపార్జన అయినందువలననే, ఆమె అలుపెరుగని నిరంతర శ్రమ కోర్వగలిగారు. ఇదే ఆమె దగ్గరకు ఎందరినో ఆకర్షించేది- ఆమె నమ్రతతో "నాదేముంది కేవలం ఉత్సాహపరచడం తప్ప నేను చేసిందేంలేదని చెప్పినా!"

(అనువాదం : కె. ఉషారాణి)

వ్యాసం

# గురజాడ ఆధునికతకు మనం ఎంత దూరంలో వున్నాం?

## (సెప్టెంబర్ 21 గురజాడ జయంతి సందర్భంగా)

- డాక్టర్ నళిని

గురజాడ అనగానే విజయనగరం గుర్తుకు వస్తుంది. బొంకుల దిబ్బ, గంట స్తంభం, సంగీత కళాశాల, మహారాజ కళాశాల కళ్ళలో మెదలుతాయి. కళల పుట్టిల్లుగా పేరెన్నికగన్న ఉత్తరాంధ్ర నగరం మనసున మెదులుతుంది. 'కన్యాశుల్కం' నాటకంలో ప్రతి అక్షరాన్ని కంఠస్తం చేసి వల్లెవేసే ప్రతిధ్వనుల్లాంటి సహచరులు గుర్తుకు వస్తారు. మీసంతో, తలపాగాతో, చెవిపోగులతో ఆ వీధుల్లో ఠీవిగా తిరిగిన గురజాడ కనిపిస్తాడు. అయితే, ఆయన ఆ ఒక్క నగరానికే కట్టుబడిపోయాడా అంటే లేదు. ఆయన ఆంధ్ర దేశమంతటా ప్రజాస్వామికవాదాన్ని వినిపించాడు. స్వాతంత్ర్యం గురించి కలలుగని, విద్యాచైతన్యాల కోసం కృషి చేసి, జానపద గేయ సముదాయానికి ప్రాచుర్యాన్ని కల్పించి, విద్యాబోధనలో నాగరిక శాస్త్రీయపద్ధతులను ప్రవేశపెట్టి, యాథార్థ జీవితం నుంచి సేకరించిన ఇతివృత్తాలతో రచనలు చేసి తెలుగువారందరికీ ఆరాధ్యుడయ్యాడు. మొదటి తెలుగు సాంఘికనాటక రచనతో, వ్యంగ్యహాస్య ధోరణిలో సమాజంలోని రుగ్మతలన్నిటినీ బయల్పరచి ఉన్నత శిఖరాలను చేరుకున్నారు.

ఈనాటికీ మనం మన గురజాడని ప్రేమగా గుర్తు చేసుకుంటున్నామంటేనే ఆధునికకాలంలో కూడా ఆయన అవసరం ఎంత వుందో అర్థమవుతుంది.

**"నలుగురు కూచుని నవ్వే వేళల**
**నాపేరొకతరి తలవండి**
**మీమీ కన్నబిడ్డల నొకతెకు**
**ప్రేమతో నా పేరివ్వండి..."**

అంటూ అర్థించే పుత్తడి బొమ్మ పూర్ణమ్మ ఎప్పటికీ మన హృదయాలను కలవరపెడుతూనే వుంటుంది. చిన్న పిల్లలపై జరిగే శారీరక మానసిక అత్యాచారాలన్నీ రూపుమాసి వారి రంగుల కల నిజమయే వరకు గురజాడ మనల్ని మేల్కొల్పుతూనే



వుంటాడు.

**"బూరుగు చెట్టు**
**చిలకలతోను ఏమని పలికింది?**
**ఎండిన దూదై**
**పకపక నవ్వింది!"**

అంటూ 'మిణుగురులు'లో శాస్త్రీయవిద్యవైపు దృష్టిసారించమని ఆయన మనల్ని హెచ్చరిస్తూనే వుంటాడు.

"డేగ పిట్టను పట్టివిడుచున?
కన్నె యింటికి మరలి నడుచున ?"

అంటూ రాజుకి చిక్కిన కన్యకని చూసి భయపడినా, ఆయన ఆమెలోని తెగువని కోరతాడు. స్త్రీ జాతి విముక్తిని కాంక్షిస్తాడు గురజాడ.

**"పట్టపగలే నట్టి వీధిని**
**పట్టబోరే జారచోరులు**
**పట్టదలచితి వింక నీవొక**
**పట్టమేలే రాజువట!**
**కండకావరమెక్కి నీవీ**
**దుండగము తలపెట్టినందుకు."**

అంటూ కన్యక రాజుని ధిక్కరించి, అతనికి చిక్కకుండా మంటల్లోకి దూకి మనకి ఆరని చిచ్చు మిగులుస్తుంది. అది పరిష్కారం కాదు సుమా అని హెచ్చరిస్తుంది ఈ కావ్యం. ఈనాటి మహిళా విముక్తి పోరాటాలు అందుకే స్త్రీ స్వేచ్ఛని పోరాడి సాధించే హక్కుగా అభివర్ణిస్తాయి.

చిన్న చిన్న పదాలతో చకచక పాగిపోయే 'పూర్ణమ్మ' , 'కన్యక'లు రెండు దృశ్యకావ్యాలు. ఆయన స్త్రీ జన పక్షపాతానికి ప్రతిబింబాలు. సామాజిక దురాచారాలపై ఆయన ఎక్కుపెట్టిన రెండు పదునైన బాణాలు!

మరోవైపు, సంస్కరణోద్యమానికి గురజాడ సరికొత్త రంగుల్ని, హంగుల్ని చేకూర్చాడు. పీడిత స్త్రీల పక్షాన నిలిచాడు. బూటకపు సంస్కరణవాదుల పీచమణిచాడు. "ఆధునిక స్త్రీలే చరిత్రని పునర్నిర్మిస్తారని" ఆయన గాఢంగా నమ్మాడు. వేశ్యావృత్తిని రూపుమాపడం వివేకవంతమైన వేశ్యలవల్లనే సాధ్యమని ఆయన నమ్మకం. ఎందుకంటే, ఆ వృత్తిలోని హీనత వారికి అర్థమైనట్టుగా ఇతరులకు అర్థంకాదు. అందుకే, ఆయన తనకి ఎదురైన అటువంటి వేశ్యల ఛాయలతో మధురవాణిని, మంజువాణిని సృష్టించాడు. గిరీశం నయవంచనని దుయ్యబట్టాడు. సౌజన్యరావు పరిమితుల్నీ స్పష్టీకరించాడు.

ప్రతిభ, సాహసం, ప్రయోగాల మేళవింపుతో గురజాడ నవ్యతకు దారులు వేశాడు. 1890-1920 మధ్య ముప్పయ్యేళ్ళకాలానికి గురజాడ రథసారథి వంటివాడు. కళా పునరుజ్జీవనంలో ఆయనది ప్రధాన పాత్ర. 17, 18 శతాబ్దాల సాహిత్యం అనుకరణల మూసగా సాగేది. 19వ శతాబ్దంలోనే సామాన్య మానవుడు కథానాయకుడుగా మొదటిసారిగా తెరకెక్కాడు. అప్పటి వరకు వేమన, త్యాగయ్య వంటి మహనీయుల పాత్ర కూడా ఈ కాలంలో ఎంతోవుంది. నవల, నాటకం, పత్రికా రచన విరివిగా మొదలైన అప్పటి సమయంలోనే 'కన్యాశుల్కం' మొట్టమొదటి ఆధునిక నాటకంగా ఒక్క ఊపు ఊపింది. కందుకూరి, చిలకమర్తి, గిడుగు వంటివారి కృషి భాష మీద ప్రభావం చూపుతోంది. సామాజిక రుగ్మతల

మీద వ్యతిరేకత రాజుకుంటోంది.

ఆ కాలంలో గురజాడ ఆధిక్యతకు కారణాలను శ్రీశ్రీ ఇలా సూచించారు. - సామాజిక పరిణామానికి విప్లవపంథాలో వేగం సాధించటం, ఆ పరిణామం పురోగమనదిశలోనే సాగడం, జీవద్భాషకు సాహిత్య గౌరవం కల్పించడం, గొప్పదైన నాటకంలో జీవితాన్ని ఫోటోగ్రాఫ్ తీయడమే కాక ఎక్స్‌రే తీసి సార్థకమైన విశేషాలు చిత్రించడం, సార్వజనీనతను సాధించేలా నాటక, కథ, గేయ రూపాలలో ఉత్తమ సాహిత్యాన్ని వెలయించడం! అందుకే, "బాగా చెబితేనే చాలదు, ఏమి చెప్పాడనేది కూడా కావలసిందే" అంటాడు శ్రీశ్రీ.

లోపభూయిష్టమైపోతున్న 'ప్రజాస్వామికాన్ని' చూసి గురజాడ బాధపడ్డాడు. "పాటకపు జనుల స్థితి గతులను చక్కవరచి, వారిని అభివృద్ధికి తేవడం ప్రజాస్వామికపు లక్షణం" అని ఆయన భావించాడు. అందుకే, తర్వాతి కాలంలో ఆయన్ని కమ్యూనిస్టుగా పరిగణించేవారు. ఆయన రచనలన్నింటిలో ఈ సామాన్య మానవులు వరుచుకుని వుంటారు. అడుగడుగునా వారి కష్టాల కడగండ్లు మనకి అగుపిస్తాయి.

మరో వైపు స్వాతంత్ర్య పోరాటం పుంజుకుంటోంది. 'వందేమాతరం' గేయానికి విరుగుడుగా గురజాడ 'దేశభక్తి' గేయాన్ని రాశాడు. దేశమంటే కేవలం కొండలు కోనలు కాదని, మనుషులని, వారి బాగుని కోరేదే నిజమైన ప్రజాస్వామికమని కుండ బద్దలు కొట్టినట్టు చెప్పాడు. కాంగ్రెసులోని మితవాదులను ఎద్దేవా చేస్తూ కూడా ఒక గేయం రాశాడు. 'దేశభక్తి' గేయం యు.ఎన్.ఓ.కి జాతీయగీతంగా ఉండవలసినంత ఉన్నతమయిందని శ్రీశ్రీ కితాబునిచ్చాడు.

మారుతున్న కాలానికి అనుగుణంగా గురజాడ వ్యావహారిక భాషోద్యమానికి చేయూతనిచ్చాడు. గిడుగు రామ్మూర్తితో కలిసి కృషి చేశాడు. ఆయన ఈ ఉద్యమానికి రెండు లక్ష్యాలను ఏర్పరచుకున్నాడు.

సామాన్య మానవుడికి భాషని అందుబాటులోకి తేవడం ఒక లక్ష్యమైతే, సాహిత్యాన్ని రోజువారీ జీవితానికి ప్రతిబింబంగా మార్చడం ఆయన రెండవ లక్ష్యం. తెలుగు తియ్యదనాన్ని అందరికీ అందిస్తూ, జానపదగేయాల వాసనలని ఆస్వాదిస్తూ, దురాచారాల వల్ల బతుకు బుగ్గవుతున్న అమాయకుల పక్షాన నిలుస్తూ సాహిత్యాన్ని పరుగెత్తించాడు. "నాది ప్రజల ఉద్యమం, దానిని ఎవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోను. దాని శక్తి అపారం. అవకాశాలు అనంతం" అంటూ తన లక్ష్యం కోసం దృఢంగా నిలబడ్డాడు.

**"ఆకులందున అణగిమణగీ**
**కవిత కోవిల పలకవలెనోయి**
**పలుకులను విని దేశమందభి**
**మానములు మొలకెత్తవలెనోయ్!"**

తెలుగుభాషలోని అందాలను ఆవిష్కరించిన గురజాడ, "పనిగట్టుకుని వ్యాకరణ సూత్రాలను తెంపుతూ వ్యవహారిక రూపాలను నింపుతూ, కావ్య భాషా విషయంలో ఆయన చేసిన సాహసం నేటి విప్లవవాదులకు కూడా మింగుడు పడని పెద్ద ముద్ద అయింది," అన్నారు కె.వి.ఆర్.

గురజాడ ఆలోచనా ధోరణి, ఆయన తత్వం, ఆయన ప్రాపంచిక దృక్పథం, ఆయన భాష, ఆయన సందేశం, ఆయన లక్ష్యం - ఇవన్నీ కలిసి పరాకాష్టగా 'కన్యాశుల్కం' వెలసింది! అందులో నాటకీయత వుంది. కళాపోషణవుంది. అందమైన భాష ఉంది. సందేశం ఉంది. అది ఉద్బోధలా కాక హృదయాన్ని తాకుతుంది. మహిళల స్థితిగతుల చిత్రణవుంది. కుటుంబ చట్రంలో ఇరుక్కుపోయి హింసపడే బుచ్చమ్మ తల్లి వుంది. మూఢాచారాలకు బలైపోయిన బుచ్చమ్మ వుంది. మళ్ళీ అదే దిశగా బలిపీఠం ఎక్కబోతున్న ఆమె చెల్లి వుంది. ఈ చట్రం నుంచి బయటపడే ప్రయత్నంలో గయ్యాళితనం అలవడిన మీనాక్షి వుంది. గౌరవప్రదంగా కాపురం చేసుకోవాలనే ఆమె కల వుంది. ఇలాంటి వారి పట్ల ఆర్ద్రత వున్న మధురవాణి ఉంది.

తన వృత్తి హీనతని గుర్తెరిగి, సంఘంపై ప్రతిఘటన జెండాని ఎత్తిన ఆమె సాహసంవుంది. గిరీశాన్ని, రామప్పంతుల్ని, లుబ్ధావధానుల్ని ఆటపట్టిస్తూ, కరటకశాస్త్రి ప్రయత్నాలకి తోడ్పడుతూ, చివరికి సౌజన్యారావుని ప్రశ్నిస్తూ, ఆ నాటకానికి జీవం పోస్తుంది మధురవాణి. 'చెడనివారిని చెడగొట్టకుమీ' అనే తల్లి మాటలను గౌరవిస్తూ, చెడినవారిని బయటపెడుతుంది. వేశ్యావృత్తికి స్థంభాలుగా నిలిచిన రాజ్యాన్ని, కుహనా సంస్కర్తలను, మేకతోలు కప్పుకున్న జారులను ముద్దాయిలుగా నిలబెట్టి జాడింపచేస్తుంది. బాల్య వివాహాలు, వితంతు వివాహాలు, వేశ్యావృత్తి, సంస్కరణలు వంటి ఎన్నో పార్శ్వాలను నాటకీయంగా తడిమే అద్భుత సృష్టి 'కన్యాశుల్కం', అందులో కథానాయకుడు గురజాడ వారే! వల్లంపాటి చెప్పినట్టు, ఆయన గిరీశాన్ని సృష్టించలేదు, గుర్తించాడు!

"గిరీశం, రామప్పంతులు, లుబ్ధావధాన్లు మొదలైనవారు నవ్వు పుట్టించేటట్లు మాట్లాడే ట్రాజిక్ హీరోలు. వారిది శిథిలీకృతమవుతున్న ఒకానొక సాంఘిక వ్యవస్థ యొక్క కరాళ నృత్యం, 'కన్యాశుల్కం' బీభత్స ప్రధానమైన విషాదాంత నాటకం". అన్నాడు శ్రీశ్రీ. గురజాడ హాస్యాన్ని కోమలాయుధంగా వాడాడని ఆయన అన్నాడు. అలానే, "ఏ కవి యొక్క ఆవిర్భావం వల్ల ఈ ప్రపంచం ఇంకో అడుగు ముందుకు వేసిందో ఆ కవే మహాకవి."అన్నాడు శ్రీశ్రీ.

గురజాడ రచనల్లో మతసామరస్యం కనిపిస్తుంది. కులాతీత ధోరణి కనిపిస్తుంది. "మంచియున్నది మాల అయితే మాలనేనవుతా !" అని ఆయన స్వయంగా చెప్పుకున్నారు. బరంపురంలో అన్ని వర్గాల కులాల ప్రజలతో సహపంక్తి భోజనం చేశాడు. ఇక భాషోద్యమం పట్ల ఆయన నిబద్ధత ఆయన చివరి ఉత్తరాలలో కనిపిస్తుంది. "రామ్మూర్తి, మన భాషా సంస్కరణ పోరాటాన్ని తుదకంటా కొనసాగించు!" అని గిడుగుని ఉత్తేజపరుస్తూ గురజాడ అంతుపట్టని అనారోగ్యంతో కన్ను మూశాడు.

అయితే "ఈ యుగం నాది!" అని శ్రీశ్రీ గర్వంగా చెప్పుకున్నట్టే, గురజాడ కూడా తన కావ్యాల గురించి సగర్వంగా ప్రకటించుకున్నాడు. "భావించటం నామువ్చట. ఆలోచన నా బలం," అన్నాడు. "తెలుగులో నవ్యరీతులకు నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే. నా కావ్యకళ నవీనం, కావ్య ఇతివృత్తాలు భారతీయం. కవితలో నేను ఉత్తమ ప్రయోజనాలను ఉపలక్షించాను. జీవితాన్ని నూత్న దృక్పథంతో దర్శించి కథా, కవితా రూపంలో దాని తత్వాన్ని అన్వయించటానికి ప్రయత్నించాను. నాకు కళల పట్ల, జీవితం పట్ల కొన్ని ఆదర్శాలు వున్నాయి. వాటిని సంస్కృతీశూన్యులు సంస్కృతీ పరులు మాత్రం అర్థం చేసుకుని హర్షించగలరు. కావ్యకథా

సంవిధాన, హాస్యధోరణులను గమనించి అంతటితో సంతృప్తిపడతారు".

ఆయన హాస్యం కోసం హాస్యాన్ని సృష్టించలేదు. చార్లీచాప్లిన్ లాగా సామాజిక ప్రయోజనం కలిగిన వ్యంగ్య హాస్యం ఆయనది. 'గ్రేట్ డిక్టేటర్' సినిమా చూసి నవ్వుకుని కీలకమైన ఆఖరి ఉపన్యాసాన్ని చూడకుండా వెళ్ళిపోవడం ఎంత మూర్ఖత్వమో, 'కన్యాశుల్కం'లో గిరీశాన్ని హీరోగా భావించి అతని డైలాగులని వల్లెవేస్తూ నవ్వుకుంటూ బయటపడి, గురజాడ హృదయాన్ని విస్మరించడం అంతే పాపం. లోకాన్ని అర్థం చేసుకోవడానికి, లోకుల్ని దగ్గరకి తీయడానికి, భవిష్యత్తు మీద ఆశను పెంచుకోవడానికి గురజాడకి హాస్యం ఒక దారి అయింది. సాధనం అయింది. బాధలను తుడిచివేసే లేపనమయింది.

సామాజిక దురాగతాలను బట్టబయలు చేస్తూ, ఉన్నత నైతిక భావాలను వ్యాప్తి చేయడాన్ని మించిన లక్ష్యం, ప్రయోజనం సాహిత్యానికి వేరొకటి లేదని ఆయన నమ్మాడు. అందుకే "మానవ సమాజం పట్ల నాకొక మహత్తరమైన బాధ్యత వుంది," అని గురజాడ ప్రకటించుకున్నాడు. "రోగికి డాక్టరు శస్త్ర చికిత్స చేసినట్టు సమాజంలోగల రుగ్మతలను కత్తి తీసుకుని దేనికది విడదీసి అన్ని భాగాలను పరీక్షించి చూడు," అని తన యువ మిత్రుడికి సలహా ఇచ్చాడు. ప్రపంచంలో మంచి గెలిచి, చెడు వీగిపోతుందనే భావాన్ని కలిగించాలని చాటాడు. వర్తమానం కంటే భవిష్యత్తు పైనే ఆయన గురి, పరిశీలన, విమర్శల జోడింపుగా ఆయన రచనలు సాగాయి. సమాజంలోని వైరుధ్యాలే ఆయన పరిశోధనాంశాలు. మతం-హేతువాదం, దాంపత్యం-వేశ్యావృత్తి, ఛాందసం-అనాచారం, పురుషాధిక్యత-స్త్రీల అణచివేత, పల్లెవాసుల స్వచ్ఛత-నాగరీకుల కుతంత్రం, ఆచారపరత్వం సంస్కారోద్యమం వీటన్నింటిపై ఆయన రచనల్లో చేసే కామెంట్ గిలిగింతలుగా, మొట్టికాయలుగా కనిపిస్తాయి. అందుకే ఆయన "ప్రతి మాట, ప్రతి ఊత, ప్రతి దీర్ఘస్వరము ఒక చరిత్ర - ఒక ధ్వనితో తొణికిసలాడుచుండును." అని నిడదవోలు వెంకటరావుగారు ప్రశంసించారు.

ఈ నేపథ్యంలో, మనం గురజాడ ఆధునికతకు ఎంత దూరంలో వున్నామని ప్రశ్నించుకుంటే చాలా దూరంలో వున్నామని చెప్పుకోక తప్పదు. సామన్య ప్రజల దృష్టికి

**సమాజంలోని వైరుధ్యాలే ఆయన పరిశోధనాంశాలు, మతం - హేతువాదం, దాంపత్యం -వేశ్యావృత్తి, ఛాందసం - అనలాచారం, పురుషాధిక్యత - స్త్రీల అణచివేత, పల్లెవాసుల స్వచ్ఛత -నాగరీకుల కుతంత్రం, ఆచారపరత్వం - సంస్కారోద్యమం - వీటన్నింటిపై ఆయన రచనల్లో చేసే కామెంట్ గిలిగింతలుగా, మొట్టికాయలుగా కనిపిస్తాయి. అందుకే ఆయన "ప్రతిమాట, ప్రతి ఊత,ప్రతి దీర్ఘస్వరము ఒక చరిత్ర - ఒక ధ్వనితో తొణికిసలాడుచుండును." అని నిడదవోలు వెంకటరావుగారు ప్రశంసించారు.**

అందని విషయాలను ముందుగానే పసిగట్టడం మేధావుల లక్షణం. భవిష్యత్తు స్పష్టంగా వీక్షించడం మహనీయుల లక్షణం. సమకాలీన సమాజ పోకడలను విశ్లేషించుకుంటూ వారు ముందు చూపుతో వ్యవహరిస్తారు. సమకాలికుల కంటే ఒక అడుగు ముందు వుంటారు. అలా భవిష్యత్తుకి ఉపయోగపడే ఆయుధాలను గురజాడ మనకి అందించినా గాని మనం వాటిని ఇంకా సద్వినియోగం చేసుకోలేకపోతున్నాం.

వ్యవహారిక భాష పేరుతో తలతిక్క భాషా ప్రయోగాలు ఈనాటి పత్రికల్లో, దృశ్యశ్రవణ మాధ్యమాల్లో పంటికింద రాళ్ళలాగా చాలానే తగులుతుంటాయి. అతిగా సామాన్యీకరించడం నేటి ఫ్యాషన్ అయిపోయింది. అలా కూడా భాష భ్రష్టు పట్టిపోతోంది. టి.వి.సృష్టిస్తున్న ఆడ విలన్ పాత్ర సంస్కారి మధురవాణి వంటి పాత్రలకు మచ్చలుగా మిగులుతున్నాయి. ఆనాడు బుచ్చమ్మ తల మీద ఎంగిలి విస్తరిని ఎత్తి వేసిన అగ్నిహోత్రావధాన్లు అసహ్యం కలిగిస్తే, ఈనాడు వరకట్న హత్యలు, యాసిడ్ దాడులు, సామూహిక మానభంగాలు, గృహహింసలు, శిశుహత్యలు జుగుప్స కలిగిస్తున్నాయి. ఇక మత సామరస్యం, కులనిర్మూలన దరిదాపుల్లో లేవు. అబ్దుల్ కలామ్, ఖాన్‌లు అమెరికా వారుచేసే అవమానానికి గురవుతున్నారు. మన వీధులన్నీ జేగురు రంగుతో ఎప్పుడూ లేని విధంగా హనుమాన్ జయంతులు జరుపుకుంటాయి. యజ్ఞాలు, యాగాలు పట్టణాల్లో సైతం నెలల తరబడి సాగుతాయి. నటిస్తూ మధ్యలోనే దొరికిపోయిన గిరీశాలు ఈనాడు వేదికలెక్కి చప్పట్లు కొట్టించుకుంటున్నారు. శాస్త్రీయవిద్య స్థానే కార్పోరేట్ విద్య రాజ్యమేలుతోంది.

మరి గురజాడ ఆశించిన 'మానవత' ఏది? "మాయమై పోతున్నడమ్మో,మనిషన్నవాడు" అని అందెశ్రీ ఎందుకు ఆక్రోశించాలి? గురజాడ కోరుకున్న ప్రజాస్వామ్యమేది ? మూకీకి భిన్నంగా పలికే ప్రతిఘటనా పలుకులు శిక్షార్హమవుతున్నాయి. కలంపై నిఘా, ఆలోచనలపై నిఘా, కనపడని సంకెళ్ళు,జైలు గోడలు.

అయితే, ఇలాంటి గడ్డురోజుల్లో గురజాడ వంటి వారిని పదే పదే తలచుకోవడం మనకి ధైర్యాన్ని, ఆత్మస్థైర్యాన్ని ఇస్తుంది. భవిత పట్ల ఆశని కల్పిస్తుంది. గురజాడ వంటి రచయితల నిబద్ధత, ప్రజాస్వామిక వాదం, మానవత, ఆధునికత, మనుషుల పట్ల ప్రేమ, భవిష్యత్తుపై ఆశ, సమాజం మంచికి మారాలనే తపన మనల్ని వెన్ను తట్టి లేపుతాయి. ఈ పరిస్థితుల్ని ఎదిరించ సాహసించి, మార్పుకోసం పాటుపడమంటూ మనకి బలాన్ని చేకూరుస్తాయి. మన దిశని నిర్దేశిస్తాయి.

**"వెనుక చూసిన కార్యమేమోయి**
**మంచి గతమున కొంచెమేనోయి**
**మందగించక ముందు అడుగేయి**
**వెనుక పడితే వెనకెనోయి".**
**"దేశాభిమానం నాకు కద్దని**
**వొట్టి గొప్పలు చెప్పుకోకోయి**
**పూని ఏదైనాను ఒక మేల్**
**కూర్చి జనులకు చూపవోయ్".**

ఇలాంటి గురజాడ ఆధునికతను చేరుకోవాలంటే అందరం కలిసి ఇంకా కృషి చేయవలసే వుంది.

"ఏ కవికైనా సరే అతని చుట్టూ ఒక సమాజం, ఆ చారిత్రక పరిణామ గమనంలో కవి యొక్క సాహిత్య స్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతిశీలి, ప్రతిభాశాలీ అయితే ఆ గమనాన్ని అతను మరింత వేగవంతం చేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవ పంథాలో వేగం సాధించిన మహాకవిగా గురజాడ అప్పారావుకి నేను నమస్కరిస్తున్నాను". అన్న శ్రీశ్రీలాగా ఆ మహనీయుడిని మనమూ సంస్మరిద్దాం, నమస్కరిద్దాం!

**('మహోదయం' పేరుతో గురజాడ తత్వాన్ని మన ముందు ఆవిష్కరించిన కె.వి.రమణారెడ్డిగారికి కృతజ్ఞతలతో)**

**(ప్రజా సాహితి సౌజన్యంతో...)**

పరిశోధన

# స్తనవిచ్ఛేదన - తెరవెనుక వాస్తవాలు



- డా. కె.భారతీసాగర్

ఇటీవలి కాలంలో మహిళందరినీ బాగా కలవరపాటుకి గురి చేసిన ఒక సంచలన వార్త యాంజెలీనా జోలీ అనే హాలీవుడ్ నటి చేయించుకున్న ద్విస్తనవిచ్ఛేదన. (డబుల్ మాస్టెక్టమి - శస్త్రచికిత్సద్వారా స్థనాలని తొలగించడం). ప్రపంచ వ్యాప్తంగా ఈ విషయం చాలా ఆసక్తిని రేపింది. ఆమె తనకు రెండు సార్లు స్తనవిచ్ఛేదన జరిగింది అని చేసిన ప్రకటనతో ప్రపంచ మహిళలందరూ తమకేమైన ఆ వ్యాధి ఉందా? వచ్చే అవకాశం ఉందా? ఉంటే దానిని ఎలా తెలుసుకోవాలి ? ఏ చికిత్స చేయించుకోవాలి ? ఇలాంటి ప్రశ్నలతో సతమతమయ్యారు. ఈ ప్రకటన వెలువడిన తరువాత మీడియాలో అయితే ఈ విషయంపై ఎడతెగని చర్చలు కొనసాగాయి. జోలీ ఆశించింది కూడా అదే. అదంటే ఏమిటో ఈ ఆర్టికల్ చదివాక మనకు అర్థమవుతుంది.

అసలు స్తన విచ్ఛేదన ఎందుకు చేయాలి? చేయటం అనివార్యమని ఎలా నిర్ణయించాలి ? ఈ ప్రశ్నకి మనకు వెంటనే స్ఫురించే సమాధానం రొమ్ము కాన్సర్లో స్తనవిచ్ఛేదనం చేయాలి అని. కానీ ఇది మనదేశంలో ఎంతమందికి వస్తోంది. ఈ జన్యు పరీక్షలు ఎవరెవరికి అవసరం? ఈ వ్యాధి రాకుండా నివారణగా ఏం చేయాలి? అనే అంశాలను గురించి ఇక్కడ మనం చర్చించుకోవాలి. అంతేకాదు యాంజెలీనా ప్రకటన వెనుక ఉన్న కార్పోరేట్ అర్థశాస్త్రం సంగతులేమిటో కూఢా మనం తెలుసుకోవలసిన ఆవశ్యకత ఉంది.

ఇండియాలో రొమ్ముకాన్సర్ ఈ మధ్యకాలంలో అధికసంఖ్యలో నమోదవుతూ ఉంది. ఇది స్త్రీలను పీడించే కాన్సర్లలో రెండవస్థానంలో ఉంది. అయితే ఈ వ్యాధి వచ్చినవారందరికీ జన్యుపరమైన ముప్పు ఉండి వచ్చినది కాదు, వేరే వేరే కారణాలవలన వచ్చినది. వాస్తవంగా, అమ్మమ్మకీ, అమ్మకీ, అక్కకీ లేదా తండ్రికీ, తాతకీ గానీ రొమ్ము కాన్సర్ వచ్చి ఉంటే, అటువంటి వాళ్లకు మాత్రమే జన్యుపరివర్తనాల వలన రొమ్ము కాన్సర్ వస్తుంది. అదికూడా అంటే ఇలాంటి కుటుంబ చరిత్ర ఉన్న స్త్రీలలో కూడా రొమ్ము కాన్సర్ వచ్చే ప్రమాదం కేవలం రెండు లేదా మూడు శాతం మాత్రమే. బి.ఆర్.సి.ఎ.!, బి.ఆర్.సి.ఎ2, టిపి53 మరియు పి10 జన్యువులలో పరివర్తనలుంటే అది రొమ్ము కాన్సర్ వ్యాధి రావటానికి అధిక రిస్క్ కారకం. కాకపోతే, ఈ జన్యు పరివర్తనలు చాలా అరుదైనవి. చాలా చాలా తక్కువ సంఖ్య కేసులలో ఇవి కారణాలుగా ఉంటున్నాయి. (ప్రపంచ ఆరోగ్య సంస్థ నివేదిక).

ఒక స్త్రీ అధిక సమయం ఈస్ట్రోజన్ హార్మోన్‌కి ఎక్స్‌పోజ్ అవుతూ ఉంటే ఈ వ్యాధి అధికంగా వస్తుంది. అంటే రజస్వల తొందరగా కావటం. మెనోపాజ్ ఆలస్యంగా రావడం. లేటు వయసులో మొదటి ప్రసవం కావడం లాంటివి. ఇవే కాకుండా అధికకాలం సంతానోత్పత్తి నిరోధక బిళ్లలు కానీ,హార్మోన్ రీప్లేస్మెంట్ చికిత్స తీసుకోవడం కూడా కారణాలు (IARC, 2008, Lacey et al., 2009).

రొమ్ము కాన్సర్ రాకుండా నివారించడానికి ఉపయోగపడేవి. శిశువులకు ఎక్కువకాలం స్తన్యం ఇవ్వటం, ఆరోగ్యకరమైన ఆహారం తీసుకోవడం (ముఖ్యంగా పాశ్చాత్య ఆహార శైలిని అనుసరించకపోవడం). శారీరకంగా చురుకుగా ఉండేలా చూసుకోవడం, మద్యం తీసుకోకపోవడం మొదలయినవి. నిత్య జీవితంలో వీటిని పాటించడంవలన రొమ్ము కాన్సర్ కారకాలని (జన్యుపరవర్తనాలు కలిగి ఉన్నా కూడా) మార్చవచ్చు.

రొమ్ము కాన్సర్ కుటుంబచరిత్ర ఉండి, బి.ఆర్.సి.ఎ1/బి.ఆర్.సి.ఎ2 మరియు టిపి53 జన్యువులలో పరివర్తనలుంటే మాత్రం వాళ్ళకి రొమ్ముకాన్సర్ వ్యాధి వచ్చే అవకాశం చాలా ఎక్కువగా, అంటే 50-85 శాతం ఉంటుంది. అందుకే తమ వంశంలో కాన్సర్ వ్యాధి వచ్చిన చరిత్ర ఉండే వాళ్ళకే రొమ్ము కాన్సర్ ముప్పు ఉంటుంది. వాళ్ళకే బి.ఆర్.సి.ఎ1/బి.ఆర్.సి.ఎ2 మరియు పి53 జన్యుపరీక్షలు నిర్వర్తించాలి. అందరికీ ఈ పరీక్షలు చెయ్యాల్సిన అవసరం లేదు. యాంజెలీనా కేసులో ఆమెకు తల్లివైపు నుంచి బలమైన కాన్సర్ నేపథ్యం ఉండటం వలన ఈ పరీక్షలు వైద్యులు చేయించారు. ఈ పరీక్షల్లో ఆమెకి కాన్సర్ ముప్పు 87శాతం ఉన్నట్లుగా తేలింది. అయితే ముప్పు ఉన్నంతమాత్రాన ఖచ్చితంగా కాన్సర్ వచ్చి తీరాలనే రూల్ ఏమీ లేదు. కాకపోతే వచ్చే అవకాశం ఎక్కువగా ఉంటుంది. ఈ రిస్కు కూడా వాళ్ళ కుటుంబంలో ఎంతమందికి ఈ వ్యాధి వచ్చింది అనే దానిని బట్టి వాళ్ళు ఏ స్థాయి రిస్కులో ఉన్నారన్నది నిర్ణయిస్తారు.

యునైటెడ్ కింగ్ డమ్ లోని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ అండ్ క్లినికల్ ఎక్స్‌లెన్స్ (NICE)అనే సంస్థవారు ఈ రిస్క్‌ని నిర్ణయించటానికి కొన్ని మార్గదర్శకాలను జారీ చేశారు. వాటి ప్రకారం మూడు రిస్క్ గ్రూపులుగా వర్గీకరించారు. వీటి ద్వారా రిస్క్ సాధారణ స్థాయిలో ఉందా, ఓ మోస్తరు స్థాయిలో ఉందా లేదా అధిక రిస్క్ ఉందా తెలుస్తుంది. ఈ క్రింది వాటిలో ఏదైనా ఒక్క అంశానికి సంబంధించి కుటుంబ చరిత్ర ఉంటే, సాధారణ జనాలకన్నా, వారికి అధికంగా రిస్క్ ఉన్నట్టుగా భావించాలి.

1. తల్లికి లేదా అక్కకి 40సంవత్సరాలకన్నా చిన్న వయసులో రొమ్ముకాన్సర్ నిర్ధారించబడి ఉంటే

2. తమ వంశస్తులలో దగ్గరి రక్త సంబంధీకులు ఇద్దరికి రొమ్ముకాన్సర్ వచ్చి ఉంటే

స్తన విచ్ఛేదన ఎందుకు చేయాలి? చేయటం అనివార్యమని ఎలా నిర్ణయించాలి ? ఈ ప్రశ్నకి మనకు వెంటనే స్ఫురించే సమాధానం రొమ్ము కాన్సర్లో స్తనవిచ్ఛేదనం చేయాలి అని. కానీ ఇది మనదేశంలో ఎంతమందికి వస్తోంది. ఈ జన్యు పరీక్షలు ఎవరెవరికి అవసరం, ఈ వ్యాధి రాకుండా నివారణగా ఏం చేయాలి అనే అంశాలను గురించి ఇక్కడ మనం చర్చించుకోవాలి. అంతేకాదు యాంజెలీనా ప్రకటన వెనుక ఉన్న కార్పోరేట్ అర్థశాస్త్రం సంగతులేమిటో కూడా మనం తెలుసుకోవలసిన ఆవశ్యకత ఉంది.

-వాళ్ళలో కనీసం ఒకరు తల్లికానీ, సోదరి కానీ లేదా కూతురు కానీ అయి ఉంటే

3. ముగ్గురు రక్తసంబంధీకులకు ఏ వయసు లోనైనా గానీ కాన్సర్ వచ్చి ఉంటే

4. తండ్రికి కానీ, సోదరుడికి కానీ ఏ వయసు లోనైనా గానీ కాన్సర్ వచ్చి ఉంటే

5. తల్లికి లేదా సోదరికి రెండు రొమ్ముల్లో కాన్సర్ వచ్చి ఉంటే అదీ మొదటిగా కాన్సర్ 50 సంవత్సరాలకన్నా ముందే నిర్ధారించబడి ఉంటే

6. దగ్గరి సంబంధీకులు ఎవరికైనా అండాశయ కాన్సర్‌కానీ, రొమ్ము కాన్సర్ కానీ వచ్చిఉంటే వారిలో ఒకరు తల్లి, లేదా సోదరీ లేదా కూతురు అయి ఉంటే

(తమ వంశం వారంటే తల్లి లేదా తండ్రి వైపు బంధువులు, అలాగే దగ్గరి బంధువులు అంటే తల్లి. తండ్రి సోదరుడు లేదా సోదరి, సంతానం, తాత, అవ్వ, మేనమామ, మేనత్త, మేనల్లుడు, మేనకోడలు మొదలగువారు)

**సాధారణ రిస్క్** (Average risk) కుటుంబంలో ఎవరికైనా ఒకరికి రొమ్ము కాన్సర్ 40 సం॥రాల వయస్సు తరువాత వచ్చి ఉంటే, వీరు సాధారణ ప్రజల లాగానే భావించవచ్చు. అంటే సాధారణ ప్రజలకి ఎంత ముప్పు ఉంటుందో వీరికి అంతేశాతం ముప్పు ఉంటుంది.

**ఓమోస్తరు ముప్పు** (Moderate risk) కుటుంబంలోగానీ, రక్తసంబంధీకుల్లోగానీ, వయసు పైబడిన తర్వాత వచ్చి ఉంటే, వీరికి ఓ మోస్తరు ముప్పు ఉంటుంది.

**అధిక ముప్పు** (High risk) దగ్గరి రక్త సంబంధీకుల్లో అంటే అమ్మ, అమ్మమ్మ లేదా అక్క వీరిలో చిన్న వయసులోనే కాన్సర్ వచ్చి ఉంటే వీరికి కాన్సర్ వచ్చే ముప్పు అధికంగా ఉంటుంది.

ఇదంతా చదివితే ఏమనిపిస్తోంది మనకు ?యాంజెలీనాకి వంశ చరిత్ర ఉంది. పైగా జన్యువులలో కూడా పరివర్తనాలు ఉన్నాయి. రిస్కు 87 శాతం ఉంది కనుక ఆమె స్తన విచ్ఛేదన చేయించుకుంది అని. ఈ విషయాన్ని పక్కన పెట్టి క్రింద పేర్కొనే వాస్తవాలను ఒకసారి తెలుసుకుందాం.

1. మనిషి శరీరంలో ఉన్న జన్యువుల పైన పేటెంట్లు అమెరికాలో కొన్ని కంపెనీలకు దారాదత్తం చేయబడింది. ఎవరికైనా అంటే ఒక కంపెనీకి పేటెంట్ చేయబడిన జన్యువుల మీద పరిశోధనలు వేరే ఎవరైనా కొనసాగిస్తే, ఆ పరిశోధన ఫలాలు కూడా పేటెంటు ఇవ్వబడిన కంపెనీకే చెందుతాయి.

**రొమ్ము కాన్సర్ రాకుండా నివారించడానికి ఉపయోగపడేవి. శిశువులకు ఎక్కువకాలం స్తన్యం ఇవ్వటం, ఆరోగ్యకరమైన ఆహారం తీసుకోవడం (ముఖ్యంగా పాశ్చాత్య ఆహార శైలిని అనుసరించకపోవడం). శారీరకంగా చురుకుగా ఉండేలా చూసుకోవడం, మద్యం తీసుకోకపోవడం మొదలయినవి. నిత్య జీవితంలో వీటిని పాటించడంవలన రొమ్ము కాన్సర్ కారకాలని (జన్యుపరవర్తనాలు కలిగి ఉన్నా కూడా) మార్చవచ్చు.**

2. రొమ్ము కాన్సరు రిస్కును తెలియచేసే బి.ఆర్.సి.ఎ1.బి.ఆర్.సి.ఎ2 జన్యువుల అనుక్రమం (సీక్వెన్సింగ్) పైన పేటెంట్ మైరియాడ్ జెనెటిక్ కంపెనీకి ఇవ్వబడినాయి.

3. ఈ రెండు జన్యు పరీక్షలు చేయటానికి మైరియాడ్ జెనెటిక్ కంపెనీ ఒక్కొక్కరి దగ్గరినుంచి 3000-4000 డాలర్ల డబ్బును తీసుకుంటుంది.

4. అయితే అమెరికన్ పౌరహక్కుల సంఘం. పబ్లిక్ పేటెంట్ ఫౌండేషన్, మైరియాడ్ జెనెటిక్ కంపెనీపై న్యూయార్క్ కోర్టులో దావా వేశాయి. ఈ బి.ఆర్.సి.ఎ1.బి.ఆర్.సి.ఎ2 రెండు మానవ జన్యువులపై మైరియాడ్ జెనెటిక్ కంపెనీకి పేటెంట్ హక్కులు ఇవ్వకూడదని, అది రాజ్యాంగ విరుద్ధమని దావా వేశాయి. ఈ దావాపై విచారించడానికి నవంబరు 2012 లో అమెరికా సుప్రీంకోర్టు అంగీకరించింది. ఈ కేసు గురించిన తీర్పు ఇప్పుడు రానున్నది.

5. ఇప్పుడు కాని సుప్రీంకోర్టు మైరియాడ్ జెనెటిక్ కంపెనీకి వ్యతిరేకంగా తీర్పు ఇస్తే, రాత్రికి రాత్రే రొమ్ము కాన్సర్ జెనెటిక్ పరీక్షల మీద నడిచే మల్టీబిలియన్ డాలర్ పరిశ్రమ పడిపోతుంది. ఈ తీర్పు వలన కేవలం మైరియాడ్ జెనెటిక్ కంపెనీకే కాదు. ఏ ఏ కంపెనీలు అయితే మనిషి జన్యువుల మీద వ్యాపారం చేస్తున్నాయో, గుత్తాధిపత్యం వహిస్తున్నాయో వాటికి చాలా నష్టం జరుగుతుంది. ఇంకా వాటికి భవిష్యత్తులో రాబోయే ట్రిలియన్ డాలర్ల లాభం కూడా పోతుంది.

6. ఇక జోలీ చెప్పిన 87శాతం రిస్కు గురించి చూస్తే, బి,ఆర్.సి.ఎ.జన్యుపరివర్తనాలు ఉన్న 1200 మందిలో ఒకరికి ఈ వ్యాధి వచ్చే అవకాశం ఉంది. ఈ విషయం అమెరికన్ నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ శాస్త్రవేత్తలు చేసిన ప్రయోగాలలో రుజువైంది.

పై వాస్తవాలన్నీ గమనించాక యాంజెలీనాకి ఏమి కావాలో మనకి అర్థమయ్యింది కదా! అదే, ప్రతి మహిళా జోలీ ప్రకటన చదివి వెంటనే జన్యు పరీక్షలకి పరిగెత్తడం (జోలీ ప్రకటన తర్వాత మైరియాడ్ జెనెటిక్ కంపెనీ షేర్ విలువ 52 వారాల గరిష్ట స్థాయికి వెళ్ళిందండోయ్. ఈ విషయాన్ని మార్కెట్ వాచ్.. కామ్ నిర్ధారించింది) జోలీ చేసిన ప్రకటన జెనెటిక్ పేటెంటింగ్ కార్పోరేట్ కంపెనీలకే కట్టబెట్టాలనే దిశగా చేసే కార్పోరేట్ ఎజెండాని ముందుకు తేవడానికి, దానికి అనుగుణంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడానికి ప్రయత్న పూర్వకంగా ప్రజలలో భయాందోళనలు కలుగ చేసే విధంగా, పరిష్కారాన్ని వారి మనసుకి హత్తుకునే విధంగా ఎంపిక చేసుకున్న పదాలతో (ఉదా : ధైర్యమైన నిర్ణయం, మాకుటుంబానికి మంచి జరుగుతుంది. నేను బ్రాడ్ పిట్ (జోలీ భర్త) ఇంకా దగ్గరవుతాం అనే నమ్మకం లాంటివి) కూర్చి తయారుచేయబడింది.

ఇంకా ఈ విషయంలో మనం తెలుసుకోవలసింది ఏమిటంటే, ఒకవేళ బి.ఆర్.సి.ఎ.జన్యువులలో పరివర్తనాలున్నా కూడా స్తనవిచ్ఛేదన (మాస్టెక్టమీ) మొదటి చాయిస్ కాదు. బి.ఆర్.సి.ఎ.టెస్టు పాజిటివ్ వచ్చినా కూడా భయపడవలసిన పనిలేదు. ప్రతిసంవత్సరం మామోగ్రఫీ లాంటి కాన్సర్ డిటెక్టింగ్ పరీక్షలు చేయించుకుంటూ ఉంటే సరిపోతుంది. ఈ టెస్టు పాజిటివ్ వచ్చిన వాళ్ళు కాన్సర్‌ను నివారించగలిగే జీవనవిధానాలను, ఆహారాన్ని (పసుపు, అశ్వగంధ వంటివి) తీసుకుంటూ ఉంటే జన్యు పరివర్తనలు కూడా సాధారణ స్థాయికి వచ్చే అవకాశాలుంటాయి.

-0-

**సుప్రీంకోర్టు మైరియాడ్ జెనెటిక్ కంపెనీకి వ్యతిరేకంగా తీర్పు ఇస్తే, రాత్రికి రాత్రే రొమ్ము కాన్సర్ జెనెటిక్ పరీక్షల మీద నడిచే మల్టీబిలియన్ డాలర్ పరిశ్రమ పడిపోతుంది. ఈ తీర్పు వలన కేవలం మైరియాడ్ జెనెటిక్ కంపెనీకే కాదు. ఏ ఏ కంపెనీలు అయితే మనిషి జన్యువుల మీద వ్యాపారం చేస్తున్నాయో, గుత్తాధిపత్యం వహిస్తున్నాయో వాటికి చాలా నష్టం జరుగుతుంది. ఇంకా వాటికి భవిష్యత్తులో రాబోయే ట్రిలియన్ డాలర్ల లాభం కూడా పోతుంది.**

పుస్తక పరిచయం

# మహిళా చైతన్యంపై మాట్లాడుదాం రండి....!

- యు. వాసుకి

గత సంచిక తరువాయి...

స్త్రీ బానిసత్వం ఎంతో కాలంగా ఉన్నదనేది వాస్తవం. అయితే మానవ జాతి ఆవిర్భావం నుంచే ఇలా ఉందనేది అబద్ధం. మొదట ఆడ, మగ అసమానతలు లేవు. ఒకరికన్నా ఒకరు ఉన్నతులు కారు. నిర్ణయిం పబడిన వైవాహిక సంబంధాలు కూడా ఆ కాలంలో లేవు. ఒక స్త్రీ, ఒక పురుషుడు ఎలాంటి సామాజిక నియమాలూ లేక, నైతిక సూత్రాలు లేక స్వేచ్ఛగా శారీరక సంబంధం ఏర్పరచుకుంటున్న కాలమది. ఈ సమయాన స్త్రీ పురుషుడితో సమానంగా మాత్రమే కాక ఒక మెట్టు పై స్థాయిలో మాత్రమే ఉండేది. గణాలుగా (బృందాలుగా) జీవిస్తున్న మానవ జాతికి స్త్రీయే నాయకత్వం వహించేది. తన సమాజాభివృద్ధికి దోహదం చేసింది. అదే కాదు మానవజాతికి ఉపయోగపడే ఎన్నో ఆవిష్కరణలను కూడా మహిళే గావించింది. మనుషులు గుంపులు, గుంపులుగా అడవుల్లో కొండల్లో అనాగరికులుగా జీవించిన కాలంలో ఇతర గుంపుల నుంచి, క్రూర మృగాల నుంచి తమ గణాలను రక్షించుకునేందుకు అత్యధిక జనాభా అవసరమైన కాలమది. ప్రకృతి వైపరీత్యాలలో, ప్రమాదాలలో, రోగాలలో, క్రూరజంతువుల దాడులలో నశించిపోయే తమ వారి సంఖ్యను భర్తీ చేయాల్సిన అవసరముండేది. ఆ కాలంలో పిల్లలు ఎలా పుడతారో కూడా వారు ఎరుగరు. అయితే స్త్రీలు మాత్రమే పిల్లలకు జన్మనిస్తారనే వాస్తవం చూసి స్త్రీలను మరింతగా గౌరవించే, మర్యాద చేసే సమాజం వారిది. 'స్త్రీ' అంటే సంపద, సౌభాగ్యం, సారవంతం అనే భావాలు విలసిల్లేవి (ఇప్పుడు దీనికి వ్యతిరేకమైన భావమే రాజ్యమేలుతోంది) మహిళ మానవ శక్తిని రూపొందించేదిగా ఉన్నందువల్ల ఆమె స్తుతింపబడింది. తరువాతి కాలంలో పిల్లల పుట్టుకకు పురుషుడు కూడా కారకుడే అనే సత్యం తెలిసిన తరువాత స్త్రీ గౌరవం క్షీణించనారంభించింది.

మానవ జాతి పరిణామ క్రమంలో, ఒక కాలంలో ఉన్న సంపదంతా అందరిదీ అనే పరిస్థితి గతించిపోయింది. వ్యక్తిగత ఆస్తి కొత్తగా అవనిక మీదికొచ్చింది. అప్పుడు ఆస్తి గల ప్రతి ఒక్కడూ నా తరువాత నా ఆస్తినంతా ఎవరు అనుభవిస్తారో అనే ఆందోళన కలిగి, వారు నా కుమారులుగా మాత్రమే ఉండాలనే స్వార్థం మొగ్గ తొడిగింది. అలాగైతే నా కుమారుడి తల్లి నాకొక్కడికి మాత్రమే భార్యగా ఉండాలి ఉండాలనే పరిస్థితి ఏర్పడింది. 'ఒక పురుషుడికి ఒక స్త్రీ' అనే సూత్రం మంచిదేగా అనిపిస్తుంది. అనగా ఒకరికే ఒక భార్య వ్యవస్థ అంతక్రితం వ్యవస్థకన్నా మెరుగైందే అనటంలో అనుమానంలేదు. అయితే ఈ సూత్రం సాంస్కృతిక ప్రగతి అనుకుంటే దీన్ని ఆడ, మగ ఇద్దరికి అన్వయింపచేసుండాలి. అయితే ఇది స్త్రీని మాత్రమే నియంత్రించే ఏర్పాటుగానే ఉంది. సంక్షిప్తంగా వ్యక్తిగత ఆస్తిని సంరక్షించుకునేందుకు అప్పటి సామాజిక వ్యవస్థ కనుగొన్న ఒక ఉపాయమిది.




కానీ స్త్రీని నీవు నాకు మాత్రమే సొంతం అని సంపదను మాత్రం చూపించి అణచి ఉంచేందుకు సాధ్యంకాలేదు. కనుక రకరకాల కట్టుకథలు సృష్టించి మహిళ పురుషునికన్నా తక్కువ స్థాయికి చెందినదే అని మాటిమాటికి నొక్కి చెప్పబడింది. భర్త మాటను జవదాటని మహిళే పతివ్రత, ఉత్తమురాలు అని కీర్తించబడింది. దీనికి తగినట్టు ఆ కాలంలో పొలాలు, భూములు, పశువులు మొదలగునవి పురుషుడి సంపదలుగా వృద్ధి చెందినట్లే ఇళ్ళల్లో స్త్రీల ద్వారా పిల్లలు అధిక సంఖ్యలో పుట్టి పెరగసాగారు. ఇవన్నీ పురుషుడి సంపదలాగే స్త్రీ కూడా అతడి సంపద అయిపోయింది. ఆమెకు పిల్లలు, ఇల్లు, వాకిలి మాత్రమే ఆస్తులుగా నిలిచాయి. ఒక పక్క బాహ్య పరిస్థితులు, మరోపక్క పురుషుడు రూపొందించిన కట్టుకథలు ఆమెను బానిసగా కట్టిపడేశాయి. నేటికీ అవే వేరు వేరు రూపాల్లో మనల్ని ఆవరించి ఉన్నాయి. కనుక స్త్రీ, పురుషులు అసమానత ప్రకృతి సిద్ధమైనదనే వాదన మానవ జాతి చరిత్రను వక్రీకరించటమే.

నేటికీ ఆర్థిక పరంగా ఆస్తుల నుంచి, వనరుల నుంచి మహిళ దూరంగానే ఉంది. వీటన్నింటికీ ఆమె పురుషుడిపైనే ఆధారపడి ఉంది. దీన్ని మనం అతిసహజమైనదిగా అనుకుంటాం. నిజానికి ఆమె సొంత కాళ్ళపై నిలబడి స్వావలంబనగా జీవించగలదైనా మనం పెంపకం ద్వారా, సాంస్కృతిక ఉపాయాల ద్వారా పురుషుడికి అణగి ఉండడమే అందం అని ఆమెకు నూరిపోస్తున్నాం. అయితే ఇది నిన్నా, మొన్నా ప్రారంభం కాలేదు. వందల, వేల సంవత్సరాల పూర్వమే ప్రారంభమై క్రమక్రమంగా ఈ భావన బలపడి ఈనాడు ఒక గట్టి వ్యవస్థగానే మారిపోయింది. ఆడ, మగవారిలో మగవాడే అధికారం చెలాయించేదానికర్హుడు అనే భావం మెదళ్ళలో గూడుకట్టుకుని పోయింది. దీన్ని మొత్తం సమాజం అంగీకరించి సత్యంగా రూపొందిపోయింది. కానీ వాస్తవాలకు ఇది సహజమైందా అని ప్రశ్నిస్తే కాదు అనేదే జవాబు.

స్త్రీ పురుషుడు వారి వారి శరీర నిర్మాణంలో ఒకేలాగా లేరు. తేడాలు తప్పక ఉన్నాయి. తేడాలున్నంత మాత్రాన ఒకరు

మరొకరిని తమకన్నా హీనులుగా భావించాల్సిన అవసరమేముంది. రూపాలలో వ్యత్యాసమున్నంత మాత్రాన జీవన విధానంలో హెచ్చుతగ్గులచేస్తాయా..? రాకూడదు. అయినా వస్తున్నాయి. ఎందుకు..?

**పెంపకం కాదు, రూపొందించబడుతున్న మనం:** వ్యక్తిగత ఆస్తి, సంపద సమాజంలో నెలకొన్న తరువాత బానిసగావించబడిన మహిళ కాల క్రమంలో గృహ కార్యక్రమంలో మాత్రమే తన ప్రతిభను అభివృద్ధి చేసుకోగలిగింది. శ్రామిక స్త్రీలు ఇళ్ళకు వెలుపల పనులకు వెళ్ళినా వారి శ్రమ పురుషుని శ్రమకన్నా తక్కువగా పరిగణింపబడి అతడికన్నా తక్కువ కూలీయే వారికివ్వబడుతోంది. పురుషుడి సంపాదనే ప్రధానమైంది. మహిళ సంపాదన దానికి సాయపడేది మాత్రమే అనే భావన సర్వత్రా వ్యాపింపజేయబడింది. ఎంత ఎత్తుకు ఎగిరినా పిచ్చుక గద్ద కాబోదు అనే ఆలోచనను మహిళ మెదళ్ళలో ఈ సమాజం బాగా కూర్చి ఉంచింది., ఇందుకనుగుణంగా రకరకాల ప్రతిభలు, సామర్థ్యాలు, ఆలోచనలు, గుణగణాలు విభజింపబడ్డాయి. ఇంటినుండి బయటకెళ్ళి తిరిగొచ్చే పురుషులను సాహసవీరులుగా చిత్రించి, ఇళ్ళలో ఉన్న స్త్రీలను సిగ్గు, శరం, లజ్జ, భయం ఉన్నవారిగా ప్రదర్శించటం జరిగింది. ఈ క్రమమంతా నాలుగు దశలుగా మానవ సమాజంలో జరిగినట్లు సామాజిక శాస్త్రజ్ఞులు చెబుతారు...

1. రూపొందించడం, 2. సిద్ధపరచడం,
3. నోటి మాటలు, 4. కార్యాచరణ.

'రూపొందించడం' అనగా ఒక బిడ్డను ఎలా పెంచుతారో తెలుపుతుంది. కొడుకును ఒక విధంగా, కూతురిని ఒక విధంగా మీరు పెంచేటప్పుడు అబ్బాయిలు, అమ్మాయిలు తమ గురించిన సామాజికాభిప్రాయాలను రూపొందించుకుంటారు.

'సిద్ధపరచడం' అనగా ఆడ, మగ బిడ్డల గమనాన్ని కొన్ని వస్తువులపై, కొన్ని విషయాలపై మళ్ళించి వాటి స్వభావాలను అర్థం చేసుకోనివ్వడం. ఉదాహరణకు ఆడపిల్లలకు బొమ్మలు, పిడతలు ఆడుకోవడానికిస్తాం. మగపిల్లలకు తుపాకులు, విమానాలు, రేసుకారులు కొనిచ్చి వాటితో ఆడుకోమని వారిని ప్రోత్సహిస్తాం. ఇలా మనం వివక్షతతో నడుచుకోవడం ద్వారా అబ్బాయిలు, అమ్మాయిలు ప్రత్యేకమైన సామర్థ్యాలు మనోభావాలు పెంపొందించుకోవటం ప్రారంభిస్తారు.

**'స్త్రీ వాదం' అనే అంశాన్ని సమగ్రంగా వివరించడం చాలా కష్టం. సాధారణ క్రమం నుండి కాస్త వెలుపలికొచ్చి స్త్రీకి అనుకూలంగా ఏమి చెప్పినా 'స్త్రీ వాది' అనే ముద్ర వేసేస్తారు.**

'నోటిమాటలు' అంటే కొడుకుతో 'నీవు పెద్దవాడవై ఉద్యోగం చేసి సంపాదించి మీ అమ్మను కాపాడాలి' అనటం కూతురుతో 'నీకు పెళ్ళై వెళ్ళే మెట్టినింటిలో మంచిగా ప్రవర్తించి నీ తల్లి పేరును నిలబెట్టాలి' అని భోదించటం ద్వారా వారి, వారి స్వీయ గుణగణాలు రూపుదాల్చేట్లు చేస్తాం.

'కార్యాచరణ' అనగా చిన్నప్పటి నుంచే ఎవరెవరు ఏఏ పనులు చేయాలనే విషయం అలవరచటం. అంటే తరతరాలుగా వస్తున్న మగతనం, స్త్రీత్వానికి తగిన కార్యాచరణను పిల్లలకు పరిచయం చేయటం. అమ్మాయిలు ఇంటి పనుల్లో తల్లికి సాయపడాలని ఎదురుచూస్తాం. అబ్బాయిలను మాత్రం బయట తిరగటానికి అనుమతిస్తాం. ఈవిధంగా వారివారి హద్దులకు సంబంధించిన మ్యాపు రూపొందించి వారి బుర్రల్లో స్థిరపరుస్తాం.

నిస్పక్షపాతంగా ఆలోచించండి- మగ, ఆడ జన్మలు మన చేతుల్లో లేవు. (అదే సమయంలో ప్రస్తుతం గర్భంలోనే ఆడ, మగగా రూపొందించే ప్రయత్నం ఒక పక్క జరుగుతోంది. దానికిక్కడ సంబంధం లేదు) అయితే పుట్టిన తరువాత ఒక మగవాడు ఎలా నడుచుకోవాలి, ఒక స్త్రీ ఎలా నడుచుకోవాలి అనే దాన్ని సమాజం నిర్ణయిస్తుంది. ఊహిస్తుంది. తన నిర్ణయాన్ని సమర్థిస్తుంది. కానీ ఇది సహజమైనదేమీ కాదు. ప్రయత్నపూర్వకంగా రూపొందించబడేదే. సామాజిక క్రమంలో ఒక్కొక్క కాలాన ఇది మారుతుండొచ్చు. అయినా దీనికైన ప్రాతిపదికను మాత్రం స్థిరంగా ఉంచుతారు.

మొత్తంలో పుట్టేటప్పుడే మగటిని ఇది, స్త్రీత్వం ఇదే అని నిశ్చయించేసిన సమాజంలో పిల్లలు పుడతారు, పెంచబడతారు. అందువల్ల ఈ మొత్తం వాతావరణం అత్యంత సహజమైనదైపోతుంది. నిజానికి ఇది 'రూపొందించబడినదే' కదా..! అయితే దీన్ని మరిచిపోయి ప్రకృతిలోనే స్త్రీది హీనమైన పుట్టుకగా మనకు మనమే ఊహాగానాలు, కట్టుకథలు కల్పించుకుంటాం. పిల్లలు కూడా తమను పెద్దలు వారికిష్టమైన రీతిలో రూపొంది స్తున్నారనే విషయం ఎరుగక ఈ లైంగిక వివక్షతను నేర్చుకుంటూ ఉంటారు.

'సాధారణంగా' అంటే...?

దీన్నే మనం రెండు విధాలా కొల బద్దలు అంటాం. పురుషుడ్ని చూసినప్పుడు, అతని ప్రతిభను చూస్తున్నప్పుడు ఒక రకమైన కళ్ళద్దాలు ఉపయోగిస్తాం. స్త్రీని చూసినప్పుడు, ఆమె సామర్థ్యాలను లెక్కగట్టేటప్పుడు మరోరకమైన కళ్ళద్దాలు వాడుతాం. టీకొట్టు, హోటలు, సినిమా హాలు, బజారు-ఇవన్నీ సాధారణ స్థలాలే. ఈ అన్నిచోట్లకు పురుషులు ఒంటరిగా వెళ్ళచ్చు.

**ఒక ఆడపిల్ల ఈ చోట్లన్నింటికీ ఒంటరిగా వెళ్ళచ్చా...? వెళితే అందుకు వేరే పేరుగదా..?**

'సాధారణం' అనే పదం లోపల మగ అనే అర్థమే ప్రముఖంగా కనిపిస్తోంది. అలాగే వంటిల్లు, వీధికొళాయి, వీధిబావి-ఇవన్నీ ఇంచుమించు స్త్రీల చోట్లనే భావించబడుతుంది. ఇక్కడల్లా పురుషులను చూడ్డం అపూర్వం. ఒకరిద్దరు వచ్చినా వారిని ఎగతాళి చేస్తాం. అంతవరకెందుకు..? మన ఇళ్ళలోపలే ఈ విభజన స్పష్టంగా ఉందే..నాన్న గది, నాన్న బల్ల, నాన్న ఈజీచైర్, నాన్న చేతిగడియారం అనే చిహ్నాలు స్పష్టంగా ఉంటాయి. అమ్మకూ ప్రత్యేకమైన చిహ్నాలున్నాయే..! వంటపాత్రలు, మసిగుడ్డలు, గరిటెలు, తట్టలు, స్పూన్లు, చీపురు, చాటలు లాంటివి ప్రత్యేకంగా ఉన్నాయి కదా..! అందువల్లే 'ఉల్ఫ్ వర్జీనియా' అనే సుప్రసిద్ధ అమెరికన్ రచయిత్రి 'నాకు మాత్రం ప్రత్యేకంగా ఒకగది ఉండుంటే..!' అని కలలు కన్నారు.

మనం జీవిస్తున్న సమాజం ఒక పురుషాధిక్య సమాజం అంటున్నాం.

**'హమ్మయ్య..? ఎంతోసేపటి నుండి చూస్తున్నాను ఈ మాట చెప్పలేదే అని ఎదురు చూస్తున్నాను.'**

మగవాడిని కేంద్రంగా ఉంచే అన్ని విషయాలూ తీర్మానించబడతాయి. నిర్ణయించబడతాయి. మగవాడి దృష్టి నుంచే ఈ ప్రపంచం చూడబడుతుంది. అంచనా వేయబడుతుంది. ఆస్తులపైన, వనరులపైన ఆధిక్యత వహించేది పురుషులే. కనుక సాంస్కృతిక సంస్థలన్నీ వారి అదుపులోనే ఉన్నాయి. అందువల్ల వాటికి సంబంధించిన

అధికారాలన్నీ కూడా వారి చేతుల్లోనే ఉన్నాయి. మనం చెబుతున్న 'స్త్రీవాదం' వీటి ప్రాతిపదికను ప్రశ్నిస్తుంది. అధికార వికేంద్రీకరణను నొక్కి చెబుతుంది. మహిళల శ్రమను గౌరవించాలని గట్టిగా చెబుతోంది.

సాధారణంగా వస్తూత్పత్తిలో పురుషుడి పాత్ర ఎక్కువగా ఉండొచ్చు. అయితే ఆ పాత్ర మరలా, మరలా తన కార్యం నిర్వర్తించాలంటే, కొనసాగాలంటే కొన్ని అవసరాలు పూర్తి చేయబడాలి. ఇల్లువాకిలీ, పిల్లాపాపలు, కుటుంబం, భోజనం, నిద్ర, బట్టల శుభ్రత, జబ్బు పడితే సేవా శుశ్రూషలు– మొత్తంలో పురుషుడు మానవుడిగా ఉండి మరురోజు, దానికి మరోరోజూ, అలాగే అన్ని రోజులూ ఉత్పత్తిలో పాలుపంచుకోవాలంటే పై అవసరాలన్నీ అతడికి తీర్చబడాలి. ఇవన్నీ మహిళలే చేస్తారు. అయితే ఉత్పత్తిలో మగవాడి కున్న గౌరవ, మర్యాదలు ఉత్పత్తికవసరమైన అవసరాలను నిరంతరం తీరుస్తున్న స్త్రీకి మాత్రం సమాజం ఇవ్వడం లేదు. ఈ అన్నీ సేవా కార్యాలు 'ఊరకనే' అనే శ్రేణికింద వచ్చేస్తాయి.

> **ఐక్యరాజ్యసమితి ఒక అంచనా ప్రకారం ప్రపంచం మొత్తంలోని 'ఊరకనే' ఉన్న మహిళల సేవల విలువ ఏడాదికి 11వేల లక్షల డాలర్లు.**
>
> **మానవ సమాజ ఆవిర్భావ కాలంలోనే స్త్రీ బానిసగా ఉందనే అభిప్రాయం 18వ శతాబ్ది అభిప్రాయం. ఇది పూర్తిగా అబద్ధం. అనాగరిక కాలంలోనూ, దాని తరువాతి కాలంలోనూ స్త్రీ ఒక స్వతంత్రమైన స్వేచ్ఛాయుతమైన పాత్ర నిర్వర్తించింది. అంతేగాక ఆమె గౌరవనీయురాలుగా కూడా విరాజిల్లింది.**
>
> **– ఏంగెల్స్.**

'ఊరకనే' అంటారు కదా, ఊరకనే ఉండటం అంటే ఏమిటి..? ఎవ్వరైనా రోజంతా చేతులు కట్టుకుని కూర్చునేందుకు వీలవుతుందా..? ఒక సామాన్యస్త్రీ వాస్తవానికి ఒక్క క్షణం ఊరక ఉండదు. చెప్పాలంటే ఉద్యోగం చేసే వారికి ఆదివారం శెలవు ఉంటుంది. వయస్సు మీరితే పదవి విరమణ ఉంటుంది. అయితే గృహ కార్యాలు చేసే మహిళలకు ఆదివారం డబుల్ షిఫ్ట్ ఉంటుంది. అందువల్లే ఒక కవి, మంచిరోజు పండుగరోజు లేదు పేదవారికి, ఆదివారం అసలే లేదు మహిళలకు..! అని చెప్పాడు.

> **గృహం, బయటి ప్రపంచం ఈ రెండింటి మధ్య మహిళలకు సంబంధించినంత వరకు ఒక కృత్రిమ విభజన చేయబడి ఉంది. ఇది ఇల్లదిలి బయటి ప్రపంచంలో పనిచేసే మహిళలను స్వయం పోషకులుగా, లోకజ్ఞానం సంపాదించుకునేవారిగా, పోటీపడే స్వభావం కలిగిన వారుగా ఉండాలని ఆశిస్తుంది. ఐతే కుటుంబం దీనికి వ్యతిరేకంగా స్త్రీలు వినమ్రులుగా, విధేయులుగా, సేవచేసేవారుగా, సహకరించేవారుగా ఉండాలని కోరుకుంటుంది. ఈ కోరికలు ఒకదానికొకటి సర్దుకుని పోయేవిగా ఉండవు. ఇందువల్ల మహిళలు శారీరకంగా, మానసికంగా తీవ్రమైన ఒత్తిడికి గురికావాల్సిన పరిస్థితి వస్తుంది. ఈ విషయం శ్రామిక మహిళలందరూ చెబుతారు. చక్కటి భార్య, ఉత్తమ నిర్వాహకురాలు అనే రెండు కర్తవ్యాలు ఒకే సమయంలో నిర్వర్తించటం కష్టం. కానీ విచిత్రమేమిటంటే,,,, పురుషులు మాత్రం ఉత్తమ భర్తలుగా, సమర్థుడైన నిర్వాహకుడిగా ఒకే సమయంలో ఉండాలని సమాజం ఆశించడం లేదు.**

'ఆదివారం ఎక్కడికీ వెళ్ళకుండా నీ కోసం ఇంట్లోనే ఉంటాను' అని చెప్పే మగమహారాజుకు అర్థగంటకు ఒకసారి కాఫీలు సప్లై చేస్తుండాలి. మాంసం తెచ్చి రుచికరంగా వండిపెట్టాలి. ఆయనగారు హాయిగా ఆరగించి గంటసేపు పవళించి లేస్తారు. వెంటనే సతీమణి వేడి వేడిగా టీ అందించాలి. ఆయన సంపాదనా పరుడు గదా..! మెల్లగా టీ చప్పరిస్తూ సిగరెట్టు పొగలు రింగురింగులుగా వదులుతూ నిజంగానే ఆదివారాన్ని అనుభవిస్తాడు. ఈమెకు మాత్రం నడుము విరిగిపోయే పనులు. ఏవ్వైన పెట్టిపుట్టుండాలి కదా...!

సరే, ఇవన్నీ ఒక పక్క ఉండనీ..! మనం 'సాధారణ' విషయానికొద్దాం. మహిళలకు రిజర్వేషన్ అడిగితే ఎవ్వరూ కోరనిదాన్ని మాత్రమే కేటాయిస్తారు. మిగతావన్నీ పురుషులకు చెప్పకనే రిజర్వు చేయబడిపోతాయి. ఇది తమాషాగా లేదూ..?

'సాధారణం' అనేది అందరికీ అన్వయించేది. అందులోనే మహిళలైన మేము కేటాయింపులు కోరతాం. పార్లమెంటులో 33 శాతం రిజర్వేషన్ అడిగితే ప్రస్తుతమున్న మొత్తం 540 సీట్లలో 180 సీట్లలో స్త్రీ మాత్రమే పోటీ చేయడానికి వీలవుతుంది. మిగతా 360 సీట్లలో పురుషుడైనా, స్త్రీ అయినా పోటీ పడొచ్చు. బస్సులో మహిళలకు కేటాయించిన సీట్లు తప్ప మిగతా అన్ని సీట్లూ మగవారికేనని భావింపబడుతోంది. ఇలాగే పార్లమెంటులో కూడా జరుగబోతోంది. అంతెందుకు, ప్రజాసంస్థలు మహాసభల సందర్భంలో ప్రతినిధుల ఎంపిక సమస్య వచ్చినప్పుడు కనీసం ఇద్దరైనా మహిళలుండాలి అన్నప్పుడు, 21మంది ప్రతినిధుల పట్టికలో ఇద్దరు మహిళల పేర్లు మాత్రమే ఉంటాయనేది మన అనుభవమే కదా..! అనగా మిగతా 19 మంది పురుషులే ఉండాలని అనుకుంటాం కదా..? ఈ 19 మందిలో మరి కొందరు మహిళలు ఉంటే జరగదా..? దీనికంతటికీ ఒకే కారణం, పురుషాధిక్యత సమాజం ఇలాగే పనిచేస్తుంది.

మహిళా చైతన్యం దృష్టితో ప్రపంచాన్ని చూడటం అంటే ఏమిటి..? లైంగిక సమానత్వం ఉన్నప్పుడు న్యాయదృష్టి మాత్రమే సరిపోతుంది. అయితే నేడు అలాంటి పరిస్థితి లేదు. పురుషాధిక్యత, స్త్రీలు రెండో శ్రేణి పౌరురాలుగా పరిగణింపబడుతున్నప్పుడు చట్టాలు, శాసనాలు, విధానాలు, ప్రణాళికలు మహిళలకు ఏవిధంగా సాయపడుతున్నాయో చూడాల్సిఉంది. అదేకాదు, బడ్జెట్ తయారీలో కూడా లైంగిక దృష్టి కోణం ఉండాలనే గట్టివాదన ఉంది. అనగా బడ్జెట్‌లో సంక్షేమానికి ఎంత కేటాయింపబడింది, అందులో మహిళల భాగమెంత..?, మహిళల్లోనూ వెనుకబడిన దళిత మహిళలకు కేటాయించిందెంత–అనే అంశాలనూ ప్రస్తుతం పరిశీలిస్తున్నారు. వాస్తవానికి అన్నింటిలోనూ మహిళలకు భాగస్వామ్యమూ ఉండాలి, హక్కులూ ఉండాలి. ఎందుకంటే నేటి వరకు సమాజం వారి పట్ల వివక్షతనే ప్రదర్శిస్తూ వస్తోంది. మహిళకు ఇలాంటి ప్రత్యేక కేటాయింపులు లేకపోతే వారిదాకా ఎలాంటి ప్రయోజనాలు వచ్చిచేరవు. కేంద్ర ప్రణాళికా కమిషన్, పదో పంచవర్ష ప్రణాళిక, జాతీయ రైతుల కమిషన్ మొదలగునవి కూడా మహిళలకు ప్రత్యేక కేటాయింపులుండాలని నొక్కిచెప్పాయి.

ఇటీవల వచ్చిన జాతీయ ఉపాధి హామీ పథకమే తీసుకుందాం. ఇంటికొకరికి పని కల్పించాలన్నారు. దీన్ని అలాగే అమలు పరిస్తే ఏం జరుగుతుంది..? ఆ ఒక్కరు పురుషుడుగానే ఉంటారుగానీ స్త్రీ ఉండదు. అందువల్లే ఉపాధిహామీ పథకంలో కూడా మహిళలకు 1/3 వంతున పని కల్పించాలని మహిళా సంఘాలు డిమాండు చేయడం న్యాయసమ్మతమే గదా..?

(సశేషం)

Classic Crafts




# LePakshi



## హస్తకళా వస్తు విక్రయశాలలు

లేపాక్షి గసఫాండ్రి, అబిడ్స్, హైదరాబాద్.
ఫోన్: 04023235028, 23212902
సెల్: 987990093132, 9849912244

ఎక్స్‌పోర్ట్ ఒరియంటెడ్ షోరూమ్ టెలిఫోన్ ఎక్ఛేంజ్ ఎదురుగా
హస్తకళా భవన్, ముషీరాబాద్,
హైదరాబాద్: 500 020, ఫోన్: 04027668178,
సెల్: 9848049636, 9849900929, 9849909930

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్ మినర్వా కాంప్లెక్స్, ఎస్.డి.
రోడ్, సికింద్రాబాద్: 500 003,
ఫోన్: 04027814729,
సెల్: 9849900939, 9849912492

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, రాజీవ్‌గాంధి ఇంటర్నేషనల్
ఎయిర్‌పోర్ట్, హైదరాబాద్.

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, తిరుమల
హిల్స్ - 517 504, చిత్తూర్ (జిల్లా) - 517501.
ఫోన్ : 08772277246, 2270334, సెల్: 9849900933,
9000103962

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, గోవిందరాజా స్వామి
టెంపుల్, తిరుపతి- 517501.
ఫోన్: 08776644337, సెల్: 9000103963

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, శ్రీనివాసా కాంప్లెక్స్,
తిరుపతి - 517501, చిత్తూరు (జిల్లా) సెల్: 9000103964

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, గాంధీనగర్,
విజయవాడ - 520 003,
ఫోన్: 08662573129, సెల్: 9849900937/38

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, బిల్డింగ్ నెం.
3-2-132-2, 12 లైన్, అరుండాల్‌పేట్, గుంటూరు-522002,
ఫోన్: 08632233151, సెల్: 9849900941

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, 29-1-7, టి.ఎన్.టి.
రోడ్, రాజమండ్రి - 533 104,
ఫోన్: 08832475757, సెల్: 9849900943

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, జగదంబ జంక్షన్,
విశాఖపట్నం - 530 002,
ఫోన్: 08912508037, సెల్: 9849900936/35

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, ప్రొద్దుటూరి కాంప్లెక్స్,
షాప్ నెం. 16, 17-18, హన్మకొండ, వరంగల్ - 506 011,
ఫోన్: 08702577727,
సెల్: 9849900940

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, సుభాష్ రోడ్,
అనంతపూర్ - 515 004,
ఫోన్: 08554220175, సెల్: 984990942

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, సాయి అమరమ్,
టూరిజం కాంప్లెక్స్, యెనుమలపల్లి క్రాస్, పుట్టపర్తి,
అనంతపూర్ (జిల్లా) - 515134,
ఫోన్: 08555289248, సెల్: 9000103965

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, ఓల్డ్ బస్‌స్టాండ్ రోడ్,
హెడ్‌పోస్ట్ ఆఫీస్ ఎదురుగా, కొండారెడ్డి బుర్జ్,
కర్నూలు - 518 001, ఫోన్: 08518240470,
సెల్: 9849900944

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, కోటి రెడ్డి సర్కిల్, కడప
టౌన్, కడప (జిల్లా) - 516001
ఫోన్: 08562241626, సెల్: 9849900934

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, బి-6, స్టేట్ ఎంపోరియమ్
కాంప్లెక్స్, బాబా కారక్ సింగ్ మార్గ్,
న్యూఢిల్లీ - 110 001, ఫోన్: 01123363892, 23366897,
సెల్: 09818566691

లేపాక్షి హాండీక్రాఫ్ట్స్ ఎంపోరియమ్, ఎఫ్: 17, దక్షిణపన్
దాకూరియా, కోల్‌కత్తా - 700 068,
ఫోన్: 03324237625, సెల్: 09831222511

నిర్మల్ ఇండస్ట్రీ, (మాన్యుఫ్యాక్చరింగ్) యూనిట్ ముషీరాబాద్,
హైదరాబాద్ - 500 020. ఫోన్: 04027610008,
సెల్: 9849900928

### ఆంధ్రప్రదేశ్ హాండీక్రాఫ్ట్స్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ లిమిటెడ్

(రాష్ట్ర ప్రభుత్వ యాజమాన్య సంస్థ)
హస్తకళాభవన్, ముషీరాబాద్, హైదరాబాద్ - 500 020. ఆంధ్రప్రదేశ్, ఇండియా
ఫోన్: 040-2761 6461, ఫ్యాక్స్: 040-2761 9560
ఇ-మెయిల్: aphdcltd@yahoo.com, aphdc_ltd@rediffmail.com
వెబ్‌సైట్: lepakshihandicrafts.gov.in



ధీర

# ఏకైక ఆదివాసీ దేశ భక్తురాలు గైడిన్ల్యూ.

-వేములపల్లి సత్యవతి

భరతమాత బానిస సంకెళ్ళను బద్దలుకొట్టి బంధ విముక్తి చేయటానికి జరిగిన ప్రతి పోరాటంలోనూ భారత మహిళలు తమ వంతును సకల విధాలా సమర్ధవంతంగా నిర్వహించారు. అశేష త్యాగాలు చేశారు. దేశం కోసం సర్వస్వం సమర్పించి పునీతులయ్యారు. దేశ స్వాతంత్ర్య పోరాట చరిత్ర పుటలలో ధృవతారల్లాగా వెలుగొందవలసిన దేశభక్తురాండ్రు ఉన్నారు. కాని మట్టిలో మాణిక్యాలలాగా మరుగున పడిపోయారు. అట్టివారిలో ప్రథమ శ్రేణిలో ప్రథమురాలుగా పేర్కొనవలసిన నిష్కళంక దేశభక్తురాలు మేడమ్ కామా. నేతాజీలాగానే ఖండాంతరాలలో (అందరికన్నా ముందే) భారతదేశపు సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం అనితరసాధ్యమైన కృషి చేసింది. బ్రిటన్ వలస పాలనకు బద్ధ విరోధి కామా. స్టట్‌గార్డ్‌లో 1907లో జరిగిన అంతర్జాతీయ కార్మిక మహాసభలో భారత ప్రతినిధిగా పాల్గొంది. దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని తీర్మానం ప్రవేశపెట్టి పాస్ చేయించిన ఘటికురాలు. వీర సావర్కార్ విడుదల కోసం అంతర్జాతీయ న్యాయస్థానం తలుపు తట్టిన ధీరవనిత. మనదేశంలో 'వందేమాతరం' గీతాలాపన జరగక పూర్వమే పారిస్ నుండి అదే పేరుతో ఇంగ్లీషులో ఏడు సంవత్సరాలు సంపాదకత్వం వహించి పత్రికను నడిపింది కామా. దేశభక్తుల్లో మేరు పర్వతంలాంటి మహిళ. దేశం స్వతంత్రమైన తర్వాత ముంబయిలోని ఒక వీధికి 'మేడమ్ కామా మార్గం' అని పేరు పెట్టి చేతులు దులిపేసుకున్నారు ఆనాటి మన స్వాతంత్ర సమర యోధులు. దేశానికి కాని ప్రజలకు గానీ వీసమెత్తు సేవలు చేయని వారి విగ్రహ ప్రతిష్టలు పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లోని నెల్లూరు జిల్లాలో ఆగర్భ శ్రీమంతుల ఇంట జన్మించారు పొణకా కనకమ్మ. స్వాతంత్ర పోరాటంలో ఆస్తిపాస్తులన్నీ హారతి కర్పూరంలా హరించుకుపోయాయి. వెూసకారుల వలన కొంత కోల్పోయారు. ఈ క్రమంలో కనకమ్మగారు స్వగ్రామం పొట్లపూడి నుంచి గూడూరుకు అక్కడి నుంచి నెల్లూరుకు నివాసం మార్చుకున్నారు. గూడూరులో ఉండగా ఇల్లు తగులబడి పోయింది. దానితోపాటు పుస్తకాల బీరువా మాడిమసైపోయింది. ఇల్లు పోయినదానికన్నా పుస్తకాలు కాలిపోయినందుకు ఆమె ఎక్కువ వ్యధ చెందారు. ఆశ్చర్యపడవలసిన విషయమేమిటంటే ఆ త్యాగమయి జ్ఞాపకార్థం మూడు పదుల సంవత్సరాల క్రితం కాంస్య విగ్రహం తయారయింది. నేటికీ అది ప్రతిష్టాపనకు నోచుకోలేదు. ఆమె స్థాపించి నడిపిన పాఠశాలలో ఓ మూల పడివుంది. మహిళలను తప్పుడు తూకపురాళ్ళతో తూచే పురుషాధిక్య సమాజంలో ఇలాంటివి చరిత్ర పుటలు తిరగేస్తే కోకొల్లలు. మేడమ్ కామా, పొణకా కనకమ్మ, సరోజినీ నాయుడు, సుచేతా కృపలానీ, హోమ్‌రూల్ స్థాపకురాలు అనిబిసెంట్, దుర్గాబాయి దేశ్‌ముఖ్ లాంటివారి మహిళల విగ్రహ ప్రతిష్టలు దేశంలో ఏ ప్రాంతంలోనూ జరుగలేదు. పైన పేర్కొన్న మహిళా దేశభక్తురాండ్రు విద్యావంతులు. కొంతమంది ఆగర్భ శ్రీమంతులు.

> **జోదాసాగ్ వీరమరణం, అమర త్యాగం రాణీమాను (గైడిన్ల్యూ) అత్యంత ప్రభావితం చేసింది. బ్రిటన్ ప్రభుతకు వ్యతిరేకంగా తిరుగుబాటు బావుటాను ఎగరవేసింది. ఉద్యమ బాధ్యతను భుజాలకెత్తుకుంది. బరక్ నది సమీపాన స్థావరం ఏర్పరచుకుని నాగాలను స్వాతంత్ర్య పోరాటపథంవైపు నడపటానికి ఉద్యమించింది. అందుకు విరామం లేకుండా కృషి సల్పింది.**

వేల సంవత్సరాల నుండి మనం నివసించే నాగరిక సమాజానికి బహు దూరంగా, భిన్నంగా అడవులలో నివసించే ఆదివాసీలున్నారు. వారి జీవన విధానం, ఆచార వ్యవహారాలు, సాంప్రదాయాలు, సంస్కృతి వేరు. నాగరిక ప్రపంచానికి పూర్తిగా భిన్నమైనవి. వారిలో అనేక రకాల తెగలున్నాయి. ఒక ఆదివాసి మహిళ దేశ స్వాతంత్ర్య పోరాటంలో పాలుపంచుకుని చరిత్ర సృష్టించింది. ఆమెపేరు గైడిన్ల్యూ. మణిపూర్‌లో ఒక కుగ్రామంలో జన్మించిన మణిపూర్ మాణిక్యం. మన తెలుగునాట ఆదివాసీల కొరకు పోరాడిన మన్యం వీరుడు అల్లూరి సీతారామరాజు ఆదివాసీ కాదు. మన దేశాన్ని పరిపాలించే సమయంలో అంగ్రేజీ సర్కార్‌కి మోసపటోమియాతో యుద్ధం చేయవలసి వచ్చింది. ఆ సమయంలో పిన్న వయసులోనే గైడిన్ల్యూ ఆంగ్ల సైన్యంలో చేరింది. తర్వాత బ్రిటన్ సైనికులు భారతీయులపై జరిపే దౌర్జన్యాలను కళ్ళారా గాంచి కలతచెందింది. ఆమె మనసు కలవర పడింది. ఉద్యోగానికి రాజీనామా చేసింది. అప్పటికే ఆదివాసీల ఉన్నతికి పాటుపడుతున్న వీరునిగా పేరుగాంచిన జోదాసాగ్‌తో కలిసి పనిచేయటం మొదలుపెట్టింది. ఇరువురు కలిసి 'హరాకా' అన్న పేరుతో ఒక సంస్థను స్థాపించారు. ఆ సంస్థ ఆశయం నాగాలలో సామాజిక, ధార్మిక, ఆర్థిక, రాజనైతిక విషయాలలో మార్పు తేవటం. అందుకు ఉద్యమ బాటపట్టారు. ఉద్యమ ప్రచారం వలన నాగాలలో నెమ్మది నెమ్మదిగా చైతన్యం కలగసాగింది. ఉద్యమం ఊరూరా ఊపందుకుంది. ఇది అంగ్రేజీ సర్కార్ గమనంలోకి వచ్చింది. జోదాసాగ్‌ను అరెస్టు చేసింది. ఉపేక్షిస్తే ప్రమాదమని తలచి అతనిని ఉరి తీసింది.

జోదాసాగ్ వీరమరణం, అమర త్యాగం రాణీమాను (గైడిన్ల్యూ) అత్యంత ప్రభావితం చేసింది. బ్రిటన్ ప్రభుతకు వ్యతిరేకంగా తిరుగుబాటు బావుటాను ఎగరవేసింది. ఉద్యమ బాధ్యతను భుజాల కెత్తుకుంది. బరక్ నది సమీపాన స్థావరం ఏర్పరచుకుని నాగాలను స్వాతంత్ర్య పోరాట పథంవైపు నడపటానికి ఉద్యమించింది. అందుకు విరామం లేకుండా కృషి సల్పింది. నిస్వార్థ త్యాగాలతో, అసమాన పోరాట పటిమను ప్రదర్శించి పనిచేసింది. అంకిత భావంతో ఆమె చేస్తున్న సేవలను చూసి గిరిజనేతరులు కూడా ఆమె చేపట్టిన ఉద్యమం వైపు ఆకర్షితులయ్యారు.

1937లో జవహర్‌లాల్ నెహ్రూ అస్సాంలో పర్యటించారు. ఆ సమయంలో గైడిన్ల్యూను గురించి విన్నారు. చాచా నెహ్రూ దిగ్భ్రాంతికి లోనయ్యారు. ఆమె నిస్వార్థ త్యాగం, అంకితభావం, దేశభక్తి, అసమాన పోరాటపటిమ, శౌర్యం, ధైర్యం నెహ్రూని చకితుడిని చేశాయి. ఒక ఆదివాసి మహిళ స్వయంగా సైన్యాన్ని సమకూర్చుకుని పరాయి ప్రభుత్వ దురాక్రమణకు వ్యతిరేకంగా పోరాడటం సామాన్యమయిన విషయం కాదని ఆయన గ్రహించాడు. బ్రిటీష్ ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి ఆమెను విడుదల చేయించటానికి కృషి చేశారు. కానీ పరాయి ప్రభుత్వానికి ఆమెను విడుదల చేసే సాహసం

లేకపోయింది. ఆమె వారికి సింహస్వప్నంగా కనిపించింది. నెహ్రూజీ ఆమెను నాణేల రాణీగా పేర్కొన్నారు. అప్పటి నుంచి ప్రజలు ప్రేమతో, గౌరవంతో రాణీమా అని పిలవసాగారు. 1972లో భారత ప్రభుత్వం రజతోత్సవాలు నిర్వహించింది. ఆ సందర్భంలో రాణీమా గైడిన్ల్యూకు తామ్రపత్రం ప్రధానం చేసి భారత ప్రభుత్వం సత్కరించింది. ఆదివాసీల హక్కుల స్ఫూర్తి ప్రదాత 1993లో ఈలోకాన్ని విడిచి వెళ్ళింది. మేడమ్ కామా, రాణీమా, కనకమ్మ లాంటి దేశభక్తి గల మహిళలు భరతమాత గడ్డమీద జన్మించినందుకు మనమందరమూ గర్వించాలి. గౌరవించాలి.

## యాసిడ్ దాడులపై ఎట్టకేలకు కదలిక

ప్రేమ పేరిట ఉన్మాదులు చెలరేగుతుంటే బంగారు భవిష్యత్ యాసిడ్ దాడుల్లో బుగ్గిపాలవుతుంది. దేశంలో ఏటా వెయ్యి వరకు యాసిడ్ దాడులు జరుగుతున్నట్లు న్యూఢిల్లీ కేంద్రంగా పనిచేస్తున్న ఒక సంస్థ జరిపిన సర్వేలో తేలింది. ఢిల్లీ నిర్భయ ఘటన తరువాత జస్టిస్ వర్మ కమిటీ చేసిన సిఫారసుల్లో యాసిడ్ దాడులను నిరోధించాలనేది ఒక ముఖ్యమైన అంశంగా ఉంది. యాసిడ్ డాడి చేసినా లేక అందుకు ప్రయత్నించినా ఐపిసిలోని నూతన సెక్షన్ 326(ఎ)కింద శిక్షార్హమైన నేరంగా పరిగణించాలని జస్టిస్ వర్మ కమిటీ చెప్పింది. యాసిడ్ దాడిలో బాధితులకు అవసరమైన వైద్య ఖర్చులు పది లక్షల వరకు పరిహారాన్ని నేరస్తుడే చెల్లించాలని కమిటీ ప్రతిపాదించింది. అంతేకాదు, ఇటువంటి కేసుల్లో దోషులకు కనీసం పదేళ్ళు కఠిన కారాగార శిక్ష విధించాలని సూచించింది. లా కమిషన్ చేసిన సూచనల మేరకు యాసిడ్‌ను ప్రమాదకర రసాయనాల నియంత్రణ జాబితాలో చేర్చాలని, పంపిణీ, అమ్మకాలను సమర్థవంతంగా నియంత్రించేందుకు గట్టి యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలని, డ్రగ్స్, మానసిక సంబంధమైన మందుల దుర్వినియోగాన్ని అరికట్టేందుకు నియంత్రణ, పర్యవేక్షణ ఉన్నట్టుగానే యాసిడ్‌పై కూడా ఉండాలని, ఎంపిక చేసిన దుకాణాల్లోనే దీనిని విక్రయించాలని, కొనుగోలుదార్లే దీని వాడకానికి బాధ్యత వహించేలా చర్యలు తీసుకోవాలని సూచించింది. యాసిడ్ దాడుల నియంత్రణకు పంజాబ్, హర్యానా హైకోర్టులు మాత్రమే ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకు కొన్ని ఆదేశాలు జారీ చేశాయి.

ఢిల్లీకి చెందిన లక్ష్మి అనే బాధితురాలు 2006లో దాఖలు చేసిన పిటిషన్ పై సుప్రీం కోర్టు విచారణ చేపట్టిన పిదప కొన్ని ఆదేశాలు జారీ చేసింది. యాసిడ్ దాడులకు పాల్పడిన వారిపై నాన్ బెయిలబుల్ కేసులుగా పరిగణించేందుకు వీలుగా చట్టంలో మార్పులు చేయాలని, బాధితులకు అందించే పరిహారాన్ని 3లక్షలకు పెంచాలని, ఘటన జరిగిన 15 రోజుల్లోపు లక్ష రూ॥ల పరిహారం అందచేయాలని, మిగిలిన మొత్తాన్ని వీలైనంత త్వరగా అందించాలని, 18ఏళ్ళలోపు వయసున్న వారికి యాసిడ్ విక్రయించరాదని, కొనుగోలుదారుల చిరునామాతో కూడిన ఫోటో గుర్తింపు కార్డు చూపిన వారికి మాత్రమే యాసిడ్‌ను అమ్మాలని పేర్కొంది.

రాష్ట్ర ప్రభుత్వాలు ఈ చర్యలను పకడ్బందీగా అమలు చేసినట్లయితే యాసిడ్ దాడులను కొంతమేరకైనా తగ్గించవచ్చు.

- మానవి డెస్క్

## సంకెళ్ళు వీడే శుభదినం

ప్రేమ పేరుతో వంచనలు
పెళ్లి పేరుతో సంకెళ్లు
లాంఛనాల ముసుగులో దందాలు
అణుఅణువూ సాధిస్తూ
స్వేచ్ఛను హరించే
పైశాచిక వీరులం
మేం మగధీరులం
యాసిడ్ బాటిల్లు మాపైకి
మద్యం బాటిల్ల మాలోకి
శృతిమించిన ఆగడాలు
వెర్రితలలు వేస్తుంటే మౌనం ముసుగు తొలగింది

*****

సహనం సంకెళ్లు వీడింది
నడుం బిగించి
పిడికిలికి పదును పెట్టి
దౌర్జన్యం తాటతీసి
దౌర్భాగ్యం తోలు ఒలచి
ధైర్యంగా ఎదుర్కొనే రోజు వస్తుంది
మున్ముందొస్తుంది.

*****

పుట్టి భూమి మీద
పడకముందే
గర్భంలో ఒదిగిఉన్న
పిండాన్ని లింగవివక్షతో
తుదిముట్టించే
హేయమైన నీచమైన కిరాయి ఆకృత్యాలను
రూపుమాపే రోజు రానుంది త్వరలో రానుంది

*****

మూడు ముళ్ళ బంధాన్ని
అడ్డం పెట్టుకొని
మత్తుపానీయాలకు బానిసవై
మమతల గూటిని దాచేసి
మా చిరునవ్వులను దోచే
ఆత్మీయానురాగాల్ని కాలరాస్తూ
కడగండ్ల పాల్జేస్తున్న
అపహాస్యపు కలతలను
ఎదుర్కోను ముందుకురుకే
స్త్రీ శక్తి ఏకమై
సమిష్టిగా తరిమికొట్టే
శుభదినం ముందుంది
ముందర రానుంది

- రావులపల్లి రామలక్ష్మి

పాత కథ

# ఒంటరి పోరాటం

- డాక్టర్ ఎ. రవీంద్రబాబు

ఇలా ఇప్పుడు అక్షరాల్లో అరుస్తున్న నా మనసులోని సంఘటనలు. సన్నివేశాలు, ఆలోచనలు అన్నీ.. కొంత కాలంగా నన్ను బాధిస్తున్నాయి. వేధిస్తున్నాయి. అవన్నీ ఈ రోజు బయటకొచ్చాయి. నాకు నేనేమీ కాలేకపోతున్నాననే వాస్తవాన్ని ఇప్పటికీ అవి రుజువు చేస్తున్నాయి. అంతేకాదు "నువ్వెవరు?" అని నన్ను ప్రశ్నిస్తున్నాయి. నేను నేనుగా బతికిలేనన్న నిజాన్ని చాటుతున్నాయి. నేను నేనుగా లేనప్పుడు అసలు నేనెవర్ని? సమాధానం దొరికీ దొరకనట్లు ఉంటోంది.

నా గురించి నేను చెప్పుకునే ముందు మా అమ్మ గురించి చెప్పాలి. అలా చెప్తేనే నేను మీకు బాగా అర్థమవుతాను. లేదు..లేదు. మా అమ్మ కూడా అర్థమవుతుంది. రెండు తరాలూ అర్థమవుతాయి. అంతకు మించి, నాకూతురుతో నహా మూడు తరాలు అర్థమవుతాయి.

అసలు నా బీజాలు మా అమ్మలోనే ఉన్నాయి. ఆమె నా జ్ఞాపకం, ఆమె నా వెనుకటి ప్రపంచం. ఆమె నా ముందటి సమాజం కూడా. అమ్మ నా ఒళ్లో ఆడుకుంటున్న పసిపాప. అమ్మ నా పగిలిపోయిన ప్రతిబింబం. ఆమె చీకటనే వెలుగును ప్రేమించిందనుకుంటాను.

నేను చీకటినే ప్రేమిస్తున్నాను.

నాకూతురు "ప్రేమిస్తున్నాను అనే భ్రమనే ప్రేమిస్తోందని" అనుకుంటాను.

సరే, అమ్మ గురించి ఇంకా చెప్తాను. నాకు తెలిసి అమ్మెప్పుడూ సమాజం చెప్పే ఆడదిలాగే ఉండేది. నాన్న మాటకు ఎదురు చెప్పకపోవటం, ఇంట్లో చిన్న చిన్న సమస్యల్ని పరిష్కరించే సత్తా ఉన్నా నాన్ననే పరిష్కారం అడగటం, వాటినే పాటించడం!

అమ్మకి వంట బాగా వచ్చు. ఎంతంటే వంటను ప్రేమించేంత బాగా వచ్చు అది వాళ్లమ్మ నేర్పిందట.

అమ్మకు భర్తను అనుకరించటం తెలుసు. కుటుంబాన్ని గుట్టుచప్పుడు కాకుండా నడపటం తెలుసు.

కొంతేమో... అనుభవాలు నేర్పాయి. అమ్మ తనకు తానుగా ఇష్టపడి నేర్చుకుందీ ఉంది. అదే పుస్తకాలు చదవటం, కానీ..నాన్న వచ్చే సమయానికి అన్నం మాడటం, పనులు కాకపోవటం, నాన్న పొలం పోయే సమయం, ఇలా అనేక ఇబ్బందుల వల్ల అమ్మకు చదవటమనేది ఓ జ్ఞాపకంగా మారిపోయింది.

అమ్మ గొప్ప ప్రేమికురాలు. భర్తని ప్రేమించడం తెలుసు, పిల్లల్ని ప్రేమించడం తెలుసు. వాళ్లకోసం తనే ప్రేమయ్యేది. పచ్చని పొలాలతోపాటు ఇంటి ముంగిట మల్లెతీగెల్ని, కనకాంబరాల్ని ఆత్మీయంగా ఆస్వాదించేది. ప్రకృతిలోని ప్రతి అణువునీ ఆస్వాదించటం అమ్మకు తెలుసు. వర్షపు చినుకుల్ని, ఉదయించే సూర్యుడిని, మబ్బుచాటున దాక్కొని ఊరించే చంద్రుడిని, కురిసే వెన్నెలనీ చూసి ఆనందించేది. అప్పుడప్పుడూ నాకూ చూపించి సంతోషించేది.

ఈ మధ్య ఏమైందంటే, మా ఆఫీసు కొలీగ్‌కు పుస్తకాలంటే పిచ్చి. తను చదువుతుంది. ఇతరులకూ ఇచ్చి చదివిస్తుంది. నాకూ కొన్ని పుస్తకాలు ఇచ్చి చదవమంది. కొన్ని బలవంతగా చదివాను. ఆపై ఇష్టంగా చదివాను. స్త్రీల గురించి, వారి జీవితాల గురించి, స్త్రీల వ్యక్తిత్వాల గురించి, అభివృద్ధి గురించి. కొన్ని కొన్ని అభిప్రాయాలు, కొన్ని కొన్ని ఆలోచనలు.. అన్నీ నాలో కొంత మార్పును తీసుకొచ్చాయి.

కానీ అమ్మకు సమయం దొరికేది కాదు. భర్త, ఇల్లు, పిల్లలు. అదే ఆమె ప్రపంచం. ఎప్పుడన్నా అలా ఆనందిస్తుంటే, నాన్న వస్తే అంతా మాయమయ్యేది! పరుగు లాంటి నడకతో వెళ్లేది. నాన్న కోప్పడితే., అరిస్తే కొడితే...ఎవరికీ తెలియకుండా పైటకొంగుతో కళ్లు ఒత్తుకోవటం కూడా అమ్మకు బాగా తెలుసు.

అమ్మ గురించి ఇంకొన్ని విషయాలు చెప్తాను.

అమ్మకు పెద్దగా కోరికలు ఉండేవి కావనుకుంటాను. ఒకవేళ ఉన్నా, ఆ కోరికలన్నీ నా గురించో, తమ్ముడి గురించో, నాన్న గురించో అయి ఉండేవి. ఇంటిపని, వంటపని, అప్పుడప్పుడు పొలం పని, మా పనులు ఇదే అమ్మ జీవితం. ఇదే అమ్మ సర్వస్వం.

ఇప్పుడిప్పుడు అనిపిస్తోంది. వీటన్నింటి నుంచీ అమ్మను విడిగా చూడలేమా అని.

అసలు అమ్మంటే ఎవరు? మనిషి కదా,ఒక మనసు కదా, వ్యక్తి కదా! వ్యక్తిత్వం? ఆమెను ఆమెగా ఎలా చూడాలి ?

సరే నా విషయానికి వస్తాను.

నన్ను కష్టపడి చాలా డబ్బులు ఖర్చు పెట్టి మరీ చదివించారు. నేనూ కష్టపడే చదువుకున్నాను. పేరున్న ఓ ప్రైవేటు సంస్థలో మంచి ఉద్యోగం. ఐదు లక్షలు కట్నం ముట్టాక, మరో ఉద్యోగి నా భర్త అయ్యాడు? ఆయనెప్పుడూ బిజీగానే ఉంటాడు. ఎప్పుడూ ఆఫీసు పనంటాడు. నేను తీరిగ్గా ఉండేది కూడా తక్కువే!

ఈ మధ్య ఏమైందంటే, మా ఆఫీసు కొలీగ్‌కు పుస్తకాలంటే పిచ్చి. తను చదువుతుంది. ఇతరులకూ ఇచ్చి చదివిస్తుంది. నాకూ కొన్ని పుస్తకాలు ఇచ్చి చదవమంది. కొన్ని బలవంతగా చదివాను. ఆపై ఇష్టంగా చదివాను. స్త్రీల గురించి, వారి జీవితాల గురించి, స్త్రీల వ్యక్తిత్వాల గురించి, అభివృద్ధి గురించి. కొన్ని కొన్ని అభిప్రాయాలు, కొన్ని కొన్ని ఆలోచనలు.. అన్నీ నాలో కొంత మార్పును తీసుకొచ్చాయి.

ఒక రోజు ఇంట్లోకి కొత్త ఫ్రిజ్ కొనాల్సివచ్చినప్పుడు "ఏది కొందామంటావ్!" అని అడిగాడాయన.

సలహా ఇచ్చాను."నీ మాటలకూ విలువ ఇవ్వాలిగా.. నువ్వూ సంపాదిస్తున్నావుగా?" అన్నాడు.

అదే మాట ఇంతకుముందు చాలా సార్లు. చాలా సామాన్లు కొన్నప్పుడు అన్నాడు కానీ నాకు అవన్నీ ఇప్పుడిప్పుడే కొత్తగా అర్థమవుతూ వస్తున్నాయి.

నన్ను గుర్తిస్తున్నాడా? నా సంపాదనను గుర్తిస్తున్నాడా? అదీ నా అనుమానం.

నావాళ్ళంటూ నాకు. భర్త, కూతురు ఉన్నారు. కానీ నాతో గడపటానికి వాళ్లకు సమయం లేదు. వాళ్ళు ఖాళీగా ఉన్నప్పుడు నాకు ఉండదు. టీవీల్లో మనుషుల బొమ్మలు చూస్తూ, ఆ బొమ్మల్లో నేనూ ఓ బొమ్మలా ఫీలవుతున్నాను. మరి నా ఇష్టాలు , నా ఆలోచనల సంగతి? నేను లేనా? అని కూడా అనిపించింది.

మొన్న ఆదివారం.. ఆయనేమో.. పనుందని ఆఫీసుకెళ్లాడు. కూతురు ఫ్రెండ్స్‌తో బయటకెళ్లింది.

ఇంట్లో ఒంటరిని. వంట వండిపడేశాను. బట్టలూ అవి సర్దేశాను. తర్వాత ఏం చెయ్యాలి ? అందరిలాగే టీవీ సీరియల్స్,ఏవేవో ప్రోగ్రామ్స్, సినిమాలు, వాటిని చూస్తూ ఎంతసేపని కాలక్షేపం ? కొంతసేపటి విసుగొచ్చింది.

నావాళ్ళంటూ నాకు. భర్త, కూతురు ఉన్నారు. కానీ నాతో గడపటానికి వాళ్లకు సమయం లేదు. వాళ్ళు ఖాళీగా ఉన్నప్పుడు నాకు ఉండదు. టీవీల్లో మనుషుల బొమ్మలు చూస్తూ, ఆ బొమ్మల్లో నేనూ ఓ బొమ్మలా ఫీలవుతున్నాను. మరి నా ఇష్టాలు , నా ఆలోచనల సంగతి ? నేను లేనా ? అని కూడా అనిపించింది.

ఇక నాకు, నా కూతురుకి మధ్య జరిగిన కొన్ని సంఘటనలు చేప్తే నా కూతురేమిటో మీకు అర్థమవుతుంది. మరి కొంత నేనూ అర్థమవుతాను.

నా కూతురు ఇంజనీరింగ్ చదువుతోంది. కంప్యూటర్ చదువు చదివితేనే విలువ కదా ఈ సమాజంలో ? ఇలా చెప్పుకోవటమే నాకూ స్టేటస్. అదే నా భర్తకీ నాకూతురికీ గొప్ప.

మా కూతుర్ని చేర్పించేనాటికి సాఫ్ట్‌వేర్ పడిపోలేదులేండి. తను మాత్రం ఎప్పుడూ స్నేహితులనీ, ఇంటర్నెట్ అనీ తిరుగుతుంటుంది.

కొన్ని రోజుల క్రితం ఆఫీసుకని హడావుడిగా రెడీ అవుతున్నాను. నా కూతురు కాలేజ్‌కు వెళ్లే తొందర్లో ఉంది. నా భర్త పనుందని రాత్రి ఇంటికి రాలేదు.

"ఎన్నిసార్లు చెప్పానమ్మా, ఫెయిర్ అండ్ లవ్లీ నాకొద్దని ? మళ్ళీ అదే తెచ్చావు" కోపంగా అంది కూతురు.

'' ఈసారి మారుస్తాలేమ్మా'' అనునయంగా అన్నాను.

రెడీ అయి నేను వెళ్తుంటే, దగ్గరకొచ్చి నా ముఖంలో ముఖం పెట్టి అంది "నీ కనుబొమ్మలు పెరిగాయి. వాటి రూపు మారిపోతున్నాయి. చూశావా ? మనింటి వెనకాలే కొత్తగా బ్యూటీ పార్లర్ పెట్టారు. ఆమె హెయిర్ కటింగ్ కూడా బాగా చేస్తుంది. సాయంత్రం వెళ్లి చేయించుకో" అంది కూతురు.

అద్దంలో చూసుకున్నాను, నిజమే, జుట్టు కూడా ! ఈ సారి స్టెప్ కటింగ్ చేయించుకోవాలి. ఆఫీసులో లీనా అలానే చేయించుకుంది. చాలా బావుంది.

మరో విషయం. ఒకరోజు నేనూ ఆయనా, కూతురు టీవీ చూస్తున్నాం. ఒకరినొకరం పట్టించుకోకుండా కూతురు ఫ్యాషన్ ఛానల్ అంటోంది. నేనేమో డ్యాన్స్ ప్రోగ్రాం అన్నాను. ఆయనేమో.. పడిపోతున్నసెన్సెక్స్ చూడాలి' అంటున్నాడు.

మరో రోజు.. ఆఫీసులోని నా కొలీగ్, నా కూతురు ఎవరితోనో సినిమా థియేటర్లో కనిపించిందని చెప్పింది.

నేనూ, ఆయనా కలిసి తిట్టాం. అలా తిరగొద్దని నచ్చచెప్పాం.

"మమ్మీ! మీ జనరేషన్ వేరు, మా జనరేషన్ వేరు. అసలు బాయ్ ఫ్రెండ్ లేకపోతే కాలేజిలో ఎంత అవమానమో తెలుసా? నన్ను ఎలా చూస్తారో తెలుసా?"అంది.

అంటే నా కూతురు తన ఆలోచనలూ అభిప్రాయాలూ నచ్చినవాడితో కాకుండా ఫ్యాషన్ కోసం, స్నేహితులు ఉన్నారని అనిపించుకోవడం కోసం స్నేహం చేస్తోందా? కాలేజ్‌లో స్టేటస్ కోసం తిరుగుతోందా?

నాకు భయమేసింది!

ఈ రోజు సాయంత్రం నీరజ నన్ను ఓ సభకు తీసుకువెళ్లింది. అది స్త్రీల అభ్యున్నతిని కాంక్షిస్తూ జరుగుతున్న సభ. రాష్ట్రంలో పేరున్న మహిళలందరూ వచ్చారు. ఒక్కొక్కరూ మాట్లాడుతున్నారు.

"స్త్రీలు బాగా చదువుకోవాలి. ఇంకా ఎదగాలి. మరింత అభివృద్ధి సాధించాలి. అన్నిట్లో పురుషులకు దీటుగా రాణించాలి. అణచివేతల్ని తరిమికొట్టాలి." ఇలా సాగాయి ఉపన్యాసాలు! అవన్నీ నిజాలనిపించాయి. కొన్ని అంశాలతో నన్ను నేను పోల్చి చూసుకున్నాను. ఇప్పుడు ప్రశ్న అది మాత్రమే

అమ్మ గొప్ప ప్రేమికురాలు. భర్తని ప్రేమించడం తెలుసు, పిల్లల్ని ప్రేమించడటం తెలుసు. వాళ్లకోసం తనే ప్రేమయ్యేది. పచ్చని పొలాలతో పాటు ఇంటి ముంగిట మల్లెతీగెల్ని కనకాంబరాల్ని ఆత్మీయంగా ఆస్వాదించేది. ప్రకృతిలోని ప్రతి అణువునీ ఆస్వాదించటం అమ్మకు తెలుసు. వర్షపు చినుకుల్ని, ఉదయించే సూర్యుడిని, మబ్బుచాటున దాక్కొని ఊరించే చంద్రుడిని, కురిసే వెన్నెలనీ చూసి ఆనందించేది. అప్పుడప్పుడూ నాకూ చూపించి సంతోషించేది.

కాదేమో! మించి ఆలోచించాలి. ఆధిపత్య ధోరణులనేకాకుండా వేరే వాటి గురించి కూడా ఆలోచించాలేమో?

ఉదయం నిద్ర లేచినప్పటి నుంచి రాత్రి నిద్రపోయేవరకు, నాకు నేనుగా బతికే క్షణాలుఎన్ని? అసలు నా. కంటూ సొంత ఇష్టాలు ఉన్నాయా? అన్నీ కార్పొరేట్ సమాజం నాపై రుద్దినవేనా? పొద్దున్నే వాడే సోపునుంచీ వేసుకునే డ్రెస్ నుంచి వాడుకునే కాస్మొటిక్స్‌దాకా ఇదే తంతు. ఎవరోతయారు చేసి మార్కెట్లోఉంచితే ఇవే వాడండంటూ టీవీలలో పేపర్లలో ప్రచారం కల్పిస్తుంటే.. మోడల్స్, హీరోయిన్స్ డబ్బులకు అమ్ముడై వాటిని ప్రదర్శిస్తుంటే, అవే నన్ను నియంత్రిస్తుంటే, బలవంతంగా నా బుర్రలోకి చొప్పిస్తుంటే...?

చివరకు నేను, నా కూతురు... మాలాంటి వాళ్ళం అనుకరిస్తున్నాం. మేం మా జీవితాల్ని అమ్మేసుకుంటున్నాం. మా కలల్నీ, కోరికల్నీ, ఊహాల్నీ వస్తువులుగా మార్చేసుకుంటున్నాం. చివరకు మా జీవితాన్నే వస్తువుగా చేసుకుంటున్నాం.

అసలు స్త్రీలు... అవతల 'ఆధిపత్య సమాజం' అని చెప్తూ వారినే అనుసరిస్తున్నారా? పురుషులు సాధించిందే అభివృద్ధా? ఇప్పుడు స్త్రీలు సాధించాల్సింది విద్య, ఉద్యోగాల్లో వారితో పోటీ పడటమేనా? మనం మనకంటూ ఓ సొంత ప్రపంచాన్ని నిర్మించుకోలేమా?

అమ్మది ఆ ఆధిపత్య సమాజం. నాది ఆ ఆధిపత్య సమాజంతోపాటు కార్పొరేట్ సెక్టార్ ప్రవేశించిన సమాజం.
నా కూతురుది పూర్తి కార్పొరేట్ సమాజం వైపు ప్రయాణిస్తున్న జీవితం.

మరి స్త్రీ అస్తిత్వం ఇప్పుడెక్కడ? స్త్రీగా.. స్త్రీ మనసు ఎక్కడ?

**(విపుల సౌజన్యంతో...)**

ఉదయం నిద్రలేచినప్పటి నుంచి రాత్రి నిద్రపోయేవరకు, నాకు నేనుగా బతికే క్షణాలు ఎన్ని ? అసలు నాకుంటూ సొంత ఇష్టాలు ఉన్నాయా ? అన్నీ కార్పొరేట్ సమాజం నాపై రుద్దినవేనా? పొద్దున్నే వాడే సోపు నుంచీ,వేసుకునే డ్రెస్ నుంచీ.. వాడుకునే కాస్మొటిక్స్ దాకా ఇదే తంతు. ఎవరో తయారుచేసి మార్కెట్లో ఉంచితే ఇవే వాడండంటూ టీవీలలో పేపర్లలో ప్రచారం కల్పిస్తుంటే.. మోడల్స్, హీరోయిన్స్ డబ్బులకు అమ్ముడై వాటిని ప్రదర్శిస్తుంటే అవే నన్ను నియంత్రిస్తుంటే, బలవంతంగా నా బుర్రలోకి చొప్పిస్తుంటే..?

స్ఫూర్తిగాథలు

# రాజమోహినీ దేవి సంస్కరణోద్యమం

- వకుళాభరణం లలిత

1951లో మధ్యప్రదేశ్‌లోని సర్గూజీ జిల్లాలో పెద్దఎత్తున క్షామం వచ్చింది. ఆహార ధాన్యాల కొరత ఎక్కువ. దాదాపు దారిద్ర్యం 1948 నుంచే ప్రారంభమైంది. ప్రజలు ఆకులలములు, వళ్లు, వేళ్లు, దుంపలతో పొట్ట పోసుకున్నారు. ఈ దారిద్ర్యమే రాజమోహినీదేవి ప్రారంభించిన ఉద్యమానికి మూలకారణం. వీటికి తోడు ఎన్నో సాంఘిక, మత సంబంధిత కారణాలు కూడా ఈ ఉద్యమాన్ని బలపర్చాయి. ఫక్స్ పేర్కొన్నట్లే వర్షం రాకపోవటంతో ప్రజలు, పశువులు కుప్పలు కుప్పలుగా రాలిపోయారు. దీనికి తోడు అంటువ్యాధులు చోటుచేసుకున్నాయి. గ్రామంలోని గిరిజన నాయకులు, గ్రామ పురోహితులు, జోస్యం చెప్పేవారు. ఎన్నో యాగాలు చేసారు. ఎన్నో జంతువులను బలియిచ్చారు. ఎంతో మద్యాన్ని అగ్నికి ఆహుతి చేసి కోపించిన దేవతలను, దెయ్యాలను సంతృప్తి వర్చడానికి ప్రయత్నించారు. ఈ విపత్తునుంచి కాపాడుకోవటానికి ప్రజలు మార్గాలను అన్వేషించ మొదలుపెట్టారు.

రాజమోహినీదేవి గోండు మహిళ. వయస్సు 60సం॥రాలు. మంజీశాఖకు చెందిన వ్యక్తి. రామ్‌కోలా పోలీసు స్టేషన్ పరిధిలో ఉన్న గోవిందపూర్ గ్రామవాసి. అంతకుముందు గార్గోరి గ్రామం నుంచి వలస వచ్చింది. ఆమె భర్తతోపాటు గోవిందపూర్‌లో ఆశ్రమాన్ని నెలకొల్పింది. తన కుటుంబ సభ్యులందరికీ దూరమైంది. 7మంది పిల్లలు. ఆమె వరిశుభ్రతకు మారుపేరు. చదువుకోలేదు. గిరిజనేతరులనుంచి చదవటం, రాయటం నేర్చుకొంది. తన ఆర్థిక పరిస్థితి చాలా దారుణం.

ఈ ఉద్యమాన్ని ప్రారంభించక ముందు ఆమెకు చెప్పుకోదగ్గ ఔన్నత్యం లేదు. బాపు ధర్మసభ ఆదివాసీ సోహమండల్ విధానమే ఆమెలో యింతటి మార్పు తెచ్చింది. 1951, 10జులై నాటికి ఆమెకు తినడానికి తిండిలేదు. ప్రజలు ఏపద్దతులను అనుసరిస్తే, ఈ బాధలను తప్పించుకోవచ్చని ప్రయత్నం చేశారు.

ఆ తరుణంలో రాజమోహినీ దేవి తరుణోపాయం త్వరలో లభిస్తుందని చెప్పటం ప్రజలకెంతో ధైర్యాన్నిచింది. తన చుట్టూ ఉన్న విషాదాన్ని గూర్చి ఆలోచించటం మొదలుపెట్టింది. అప్పుడే మహాత్మాగాంధీ జీవితం, బోధనలపట్ల స్ఫూర్తిని పొందింది. నిరాహారదీక్ష చేసింది. మేఘాలనుంచి వర్షం రావటంతో అదే ప్రజలకు శాంతి



సౌభాగ్యాలను చేకూర్చినట్లు భావించింది. ఒకరోజు ఒక సన్యాసి తనవైపుకు రావటం గమనించింది, రాజమోహిని. సత్యాన్ని ప్రపంచవ్యాప్తం చేయమని, అప్పుడే దేశం సౌభాగ్యవంతమవుతుందని సందేశాన్నిచ్చాడు ఆసన్యాసి. ఆయన సందేశాన్ని ప్రజలకు చేరువ చేసింది రాజమోహినీదేవి.

ఇంకో కథ ఏమంటే, ఇద్దరు ముగ్గురు యతీశ్వరులు ఆమెకు మర్మ సంబంధమైన వస్తువును ఇచ్చారట. దాంతో సమాజాన్ని సంస్కరించమని కోరారు. బిడ్డకు ఆహారం పెట్టాలనుకుంటే ఆమెకు అడవిలో లభ్యంకాలేదు. భర్త తప్పతాగి ఆమెను కొట్టాడు. రాజమేలన్ అనే నదికి వెళ్లి, దు:ఖపడుత్తా ఉండిందంట, అప్పుడు మహాత్మాగాంధీ, ఆయన బోధనలు గుర్తుకువచ్చాయి. గోవిందపూర్‌కు సమీపంలో ఉన్న గోదావరి అనే గ్రామానికి వెళ్లిందట. అక్కడ తనకొచ్చిన భావాన్ని ప్రజలతో ముచ్చటించిందట, జీవరాసిలో దేనినీ చంపవద్దనీ, కల్లు సేవించవద్దనీ, మాంసభక్షణ వీడమనీ, రోజూ స్నానం చేసి భగవంతుని ధ్యానం చేయమనీ కోరింది. ఆరోజే వర్షం కురిసింది. ప్రజలు ఆమె బోధనలు పాటించాలని తీర్మానించారు. ఆమెకు దైవ సంబంధిత శక్తి ఉందని అభిప్రాయపడ్డారు. ఆమె దర్శనం చేసుకోను చుట్టు ప్రక్కల గ్రామాల వాళ్లందరూ వచ్చారు. అక్కడ ఒక సంత జరిగింది. వేలాది సంఖ్యలో ఆమెకు భక్తులయ్యారు. ఆమె చుట్టు వక్కల గ్రామాలన్నిటికీ వెళ్లింది. 2వ దశలో ఆమెకు 80వేల మంది శిష్యులేర్పడ్డారట. ఇంకా ఆసంఖ్య 1956 నాటికి 1,50,000 పెరిగిందట.

**బాపుధర్మ సభ ఆదివాసి సేవామండల్ లక్ష్యాలు** :- ఈ సేవా మండల్ 1951లో ఏర్పడింది. 20-3-1959 దీన్ని రిజిస్టర్ చేశారు.

**లక్ష్యాలు :-**

1 సార్వజనీన సోదర భావాన్ని పెంపొందించటం.

2 మహాత్మాగాంధి సిద్ధాంతాలను బోధించటం, జాతీయసేవా కార్యక్రమాలను చేపట్టడం.

3 ఆదివాసీలు మద్యం, మాంసాలను సేవించకుండా ఉండటం. పారిశుద్ధ్యాన్ని గూర్చి తెల్పటం. ఆర్థిక ప్రమాణాన్ని మెరుగుపర్చటం. మామూలు జీవితాన్ని గడపటం, సత్యానికి విలువ ఇవ్వటం.

4. హిందూ మతాన్ని, గేయాలను, పాటలను అభివృద్ధి పర్చటం.

5. సామాజిక, మత సంబంధిత దురాచారాలను తొలగించడం.

**సేవామండల్‌లో పేర్కొన్న ప్రత్యేక లక్షణాలు :**

1. మతాన్ని అనుసరించటం, దేవుని ప్రేమించటం.

2. చర్కాతో తయారైన ఖద్దరును నేసి ధరించటం.

3. మహువాను మార్కెట్‌లో కొని, సారాయి దుకాణాల్లో కాచటం చేయరాదు.

4. మద్యం ప్రపంచంలో అత్యంత హీనమైంది. దీన్ని వాడకూడదు.

5. పొగాకును నమలరాదు. ధనాన్ని

ఇంటికోసం ఖర్చుచేయాలి.
6. మర్మ విద్యలు తెలిసినవారికి, మోసగాళ్లకు, దెయ్యాలకు, భూతాలకు తల ఒగ్గకూడదు.
7. ప్రతిరోజు స్నానం చేయాలి. శరీరం, మనస్సు, ఇల్లు శుభ్రంగా ఉంచుకోవాలి.
8. గోమాతను పూజించాలి. ఎప్పుడూ బాధపెట్టకూడదు.
9. చుట్టు పక్కల వారిని సోదరులుగా భావించాలి. ఒకే తల్లికి పుట్టినట్లుగా చూడాలి.
10. ఏ జంతువునైనా చంపకూడదు. మాంసభక్షణ చేయరాదు.
1. గాంధీ, బాబా మార్గాన్ని అనుసరించాలి. స్వరాజ్య బిడ్డలుగా ప్రవర్తించాలి.
12. పుట్టుక, మతం ఒక్కటే. మోసానికి దూరంగా ఉండాలి.
13. దేశానికి, సమాజానికి, కుటుంబానికి సేవ చేయాలి. భాగత్‌ల గౌరవాన్ని కాపాడాలి.
14. భూమిని దున్ని వ్యవసాయం చేయాలి. గోమాతను, లక్ష్మీ దేవిని పూజించాలి.

గాంధీ భావాలు రాజమోహినీదేవికి స్ఫూర్తినిచ్చాయి. 1955లో గాంధీ శిష్యుని కలుసుకోవటం జరిగింది. అతడు రషోదాష్టీ, బాలియాకు చెందినవాడు. పలమాయి జిల్లానుంచి అతడు పాదయాత్రకు వస్తే ఆమె కలుసుకొంది.

అతని భూదాన ఉద్యమానికి రాజ మోహినీదేవి తోడ్పాటునిచ్చింది. అంబికాపూర్ లోని సర్వోదయ ఆశ్రమానికి వెళ్లింది. వినోబాభావేను ఎన్నోసార్లు కలుసుకుంది. చిట్టచివరగా 1975లో కలుసుకొంది. అది భూదాన్ సిల్వర్ జూబ్లీ సంవత్సరం. పాదయాత్రలో పాల్గంది. శ్రీ శ్యామచరణ్ శుక్లా మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రితోపాటు పాదయాత్ర చేసింది. భగత్ సమావేశాల్లో కలుసుకోవాలన్నా ఆమె అనుయాయులు ఖాదీదుస్తులే ధరించేవారు.

మద్యపాన నిషేధంలో ఆమె పూర్తి బాధ్యత వహించి ఉద్యమాన్ని నడిపింది. సారాకు బానిసలు కావటమే దారిద్ర్యానికి మూలకారణమని వక్కాణించింది. ఆమె అనుయాయులంతా శాకాహారులే. 'నసాబంది' నిషేధాన్ని అమలు జరిపింది. పాల్‌తోహసిల్‌లో ఒక దేవాలయం ఉండేది. అక్కడ రోజూ జంతుబలులే. మద్యం ఏరులై పారేది. వివిధ గ్రామాలకు వెళ్లి గ్రామదేవతల ముందు జరిగే బలులను ఆపటానికి ప్రయత్నించింది. ఆమె అనుయాయులు పూర్తిగా శకునాలను మానలేదు. అటువంటి వారందరిని శాఖాహారులుగా మార్చిన ఘనత ఆమెదే. పాలవకా, సర్గూజా, మీర్జాపూర్ మొదలైన ప్రాంతాల్లో 24 ఆశ్రమాలను ఏర్పర్చింది.

ఈ విధంగా రాజమోహినీదేవి ఉద్యమం 25 సంవత్సరాలపాటు నిరాఘాటంగా సాగింది.

# ప్రపంచ ఆర్థిక సంక్షోభం-
# భారత మహిళలపై ప్రభావం

(ఐద్వా 9వ జాతీయ మహాసభ కమిషన్ పేపర్)

(గత సంచిక తరువాయి)

**స్వయం ఉపాధి రంగంలో మహిళలు:**

వేతనాలు పొందే ఉపాధి అవకాశాలు తగ్గిపోవడంతో మహిళలు ఉప కాంట్రాక్టర్ల ద్వారా నడిచే గృహ పరిశ్రమలవైపు కానీ లేక చిన్న చిన్న యూనిట్లుగా ఉన్న కంపెనీలలో కానీ పనిచేస్తున్నారు. సాధారణంగా వీరికి పీస్‌రేట్ పద్ధతిలో కానీ లేక అతి తక్కువ వేతనాలు కానీ చెల్లిస్తున్నారు. వీరికి అదనపుసౌకర్యాలేవీ అందుబాటులో ఉండవు.

**దేశంలోని సాంప్రదాయ చేనేత కార్మికుల సమస్యలు:**

చికన్ ఎంబ్రాయిడరీ పని అనేది దేశంలోని ఒక ప్రత్యేక నైపుణ్యం కలిగిన మంచి సాంప్రదాయ వృత్తి. దీనికి దేశంలోనూ అంతర్జాతీయంగానూ మంచి డిమాండ్ ఉంది. మన దేశంలోని లక్నోలో నివసిస్తున్న కమ్ము అనే మహిళ తన భర్త జీవించి ఉన్నపుడు ఆయనతో కలిసి అనేక దశాబ్దాలపాటు ఈ పనిచేసింది. ప్రత్యేక ఆర్డర్లపై వారు పనిచేసేవారు. ఆమె ఇప్పటికీ తనకు కావలసిన వస్తువులు, బట్టలు తానే కొనుగోలు చేస్తుంది. వాటిని తన కూతురు సాయంతో కత్తిరిస్తుంది. వాటిపై ఎంబ్రాయిడరీ పని చేస్తుంది. వాటితో దుస్తులు తయారుచేస్తుంది. ఆమె ఎంతో నైపుణ్యం కలిగిన పనితనం కలిగి వున్నా ఇప్పటికీ ఆమెకు పక్కా ఇల్లు లేదు. కురుస్తున్న పైకప్పు ఉన్న ఇంట్లో నివసిస్తుంది. ఆమెకు ఒక వికలాంగుడైన కుమారుడున్నాడు. అతనికి వైద్యం చేయించడానికి ఆమె ఎంతో కష్టపడాల్సి వస్తుంది.

చికన్ వర్క్ ఎంబ్రాయిడరీ కోసం వెచ్చించే శ్రమ, నైపుణ్యాలకు తగ్గ ఫలితం అందులో దక్కడంలేదని కమ్ము చెబుతుంది. ఎంతో నైపుణ్యం కలిగిన కార్మికునికైనా రోజుకు 50 రూపాయలు మాత్రమే లభిస్తుంది. ఇక మామూలు కార్మికునికి రోజుకు 8 నుండి 20 రూపాయలు మాత్రమే దక్కుతుంది. సంక్షోభంతో పరిస్థితులు మరింత దిగజారాయి. ఇంతకు ముందు కంటే చాలా తక్కువ వేతనం పొందుతున్నట్లు కమ్ము చెబుతుంది. ప్రస్తుత సంక్షోభ పరిస్థితులలో కూడా చికన్ వర్కర్ల కోసం ప్రభుత్వం ఏమీ చేయడంలేదని కమ్ము చెబుతుంది.

వయసు పెరుగుతున్న కొలదీ ఆమెకు రోజు రోజుకు ఐదు లేక ఆరు గంటల కంటే ఎక్కువ పనిచేయడం సాధ్యం కావడంలేదు. ముఖ్యంగా నైపుణ్యంతో చేయాల్సిన ఎంబ్రాయిడరీ పని మరింత కష్టతరంగా ఉంది. కనుక ఆమె సంపాదన మరింత పడిపోయింది. రాను రాను ఆమె ఆరోగ్యం దెబ్బతింది. కంటిచూపు తగ్గింది. ఆమె దీర్ఘకాలంగా తలనొప్పి, వెన్నునొప్పి, మెడనొప్పులతో బాధపడుతోంది. చికన్ వర్క్ చేసి చేసి చేతి వ్రేళ్ళ నొప్పులతో ఆమె బాధపడుతోంది. ఆమెకు భవిష్యత్తుపై అంతగా ఆశలేదు. ఈ విషయాలు "ప్రపంచ ఆర్థిక సంక్షోభం- పేదలపై ప్రభావం" అనే అంశంపై 2009 నవంబరులో ఢిల్లీ నుండి వెలువడిన యుఎన్‌డిపిలోని 26వ పేజీ నుండి సంగ్రహించబడినవి.

**దేశంలోని వ్యర్థ పదార్థాల సేకరణ దారులు:**

**ఇది ఒక రతన్‌బెన్ కథ:**

నా పేరు రతన్‌బెన్ జయదేవ్ వరవూర్. నేను గోమతిపూర్‌లో నివసిస్తున్నాను. (గోమతిపూర్ అహ్మదాబాద్‌లోని ఒక మురికివాడ) నా వయస్సు 50 సంవత్సరాలు. నేను గత 30 సంవత్సరాల నుండి వ్యర్థ పదార్థాలను సేకరిస్తున్నాను. నాకు ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు. నాకు 25 సంవత్సరాల వయస్సులో నా భర్త చనిపోయాడు. అప్పటి నుండి నేను చెత్త సేకరణ ద్వారా వచ్చిన ఆదాయంతో నా కుటుంబాన్ని పోషిస్తున్నాను. నా కొడుకులు చిన్న చిన్న కార్ఖానాల్లో అప్పుడప్పుడూ పనిదొరికినప్పుడు తాత్కాలికంగా పనిచేస్తుంటారు. ప్రతిరోజూ ఉదయం ఐదు గంటలకు నా దినచర్య మొదలవుతుంది. ఇంట్లోని పనులన్నీ పూర్తి చేసుకుని ఉదయం ఆరు గంటలకు నేను చెత్త సేకరణ పని మొదలుపెట్టి మధ్యాహ్నం వరకూ పనిచేస్తాను. మధ్యాహ్నం ఆ చెత్తను కట్టలుగా కడతాను. మళ్ళీ రెండోపూట నాలుగు గంటలకు వెళ్ళి రాత్రి ఎనిమిది గంటలకు తిరిగి వస్తాను. అదికూడా నేను సేకరించే చెత్తను బట్టి తిరిగి వస్తాను. అలా రెండు రోజులు చెత్త సేకరించి మూడవరోజు చెత్తకట్టలను షాపులో అమ్ముతాను. నేను పేపరు, ప్లాస్టిక్, ఇనుప సామాను, బట్టలు, విరిగిన బొమ్మలు, ప్లాస్టిక్ సంచులు, జుట్టు, తెలుపు మరియు రంగు పేపర్లు మొదలైనవి సేకరిస్తుంటాను. నేను సేకరించిన మొత్తం చెత్తకుగాను నాకు సుమారుగా 50 రూపాయలు వస్తాయి.

కానీ, ఆకస్మాత్తుగా గత అక్టోబరు నెల దీపావళి తరువాత షాపు యజమాని నాకు తక్కువ డబ్బు ఇవ్వడం మొదలుపెట్టాడు. నేను అతనితో ఈ విషయంపై గొడవ పడ్డాను. కానీ నాకు అతను ఇచ్చే డబ్బు తీసుకోవటం తప్ప వేరే మార్గం లేదు. అసలు సమస్య ఏమిటో నాకు అర్థం కాలేదు.

తరువాత ఒక సాయంత్రం నేను నా గుడిసె ముందు కూర్చొని ఉండగా ఇతర చెత్త

> దేశంలోని రైతులు వ్యవసాయం ఖర్చులు పెరిగిపోవడం, పంటరేట్లు స్థిరంగా లేకపోవడం మరియు ప్రభుత్వ సహకారం లేకపోవడం వంటి సమస్యలతో తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. మహిళా రైతులకు భూమి పట్టాలు లేకపోవడం, గుర్తింపు లేకపోవడం మొదలైన వాటితో వారు మరింత ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. వారికి వ్యవసాయ సబ్సిడీలు కానీ సంస్థాగత రుణాలు కానీ సంక్షోభ నివారణకు సంబంధించిన సదుపాయాలు కానీ ఏవీ అందుబాటులో ఉండడంలేదు.

సేకరణదారులు కూడా ఇదే సమస్యపై నాతో మాట్లాడారు. తరువాత ఒకసారి నేను చెత్త అమ్మడానికి షాపుకు వెళ్ళగా యజమాని నా చెత్తను కొనడానికి నిరాకరించడంతో పరిస్థితులు మరింత దిగజారాయి. మార్కెట్ కుదించుకుపోవడంతో చెత్త అమ్ముడుపోక షాపులో పోగుపడిపోతుందని అతను చెప్పాడు. కనుక ఇతర చెత్త సేకరణదారులకు కూడా ఇదే పరిస్థితి తలెత్తింది. తరువాత చుట్టు పక్కల ప్రాంతాల్లోని స్క్రాప్ షాపులన్నీ మూతపడుతున్నాయనే విచారకరమైన వార్త వచ్చింది. చెత్తకు ధర తగ్గడంలో యజమాని తప్పేమీ లేదు. అంతర్జాతీయ మార్కెట్‌లో చెత్తకు ధరలు పడిపోయాయని తెలిసింది.

ఇది నాపై తీవ్ర ప్రభావం చూపింది. ఆర్థిక సంక్షోభంతో చిన్న చిన్న ఫ్యాక్టరీలు మూతబడడం వలన నా కొడుకులు కూడా పనులు పోగొట్టుకున్నారు. మా ఇంటిలో తినడానికి తిండికూడా లేని పరిస్థితులు ఏర్పడ్డాయి. మాకు కనీసం కూరగాయలు కూడా కొనుక్కోలేని పరిస్థితులేర్పడ్డాయి. నా మనవళ్ళ చదువుకు నేను డబ్బు వెచ్చించలేకపోవడంతో వారు కూడా నాతోపాటు చెత్త ఏరే పనికి వచ్చి ఆదాయం సర్దుబాటుచేసే పనిలో పడ్డారు. నా ఇరుగు పొరుగువారు కూడా ఎన్నో ఇబ్బందులు పడడం నేను చూశాను. నా పొరుగున నివసించే ఏసిబిన్ అనే మహిళ తన శరీరాన్ని వైద్య ప్రయోగాలకు అమ్మివేసింది. మనందరికీ అది ప్రమాదకరమని తెలుసు. కానీ దానికి అధిక మొత్తాలు చెల్లిస్తారు. ప్రజల డబ్బంతా ఎక్కడికి పోతుందని నా ప్రశ్న. పేద ప్రజలే ఎందుకు ఇబ్బందులు పడాలి. పెద్ద పెద్ద పరిశ్రమలను కాపాడటానికి ప్రభుత్వం ఎన్నో పథకాలు పెడుతుందని నేను వార్తలలో తెలుసుకున్నాను. మరి మా సంగతేమిటి? వారు మా గురించి ఏమైనా ఆలోచిస్తున్నారా?

స్వయం ఉపాధి మహిళలకు అప్పు దొరకడమే కష్టతరంగా ఉంది. మైక్రోఫైనాన్స్ సంస్థలకు వాణిజ్య బ్యాంకుల నుండి పెద్ద ఎత్తున నిధులు, సహాయం అందేది. కానీ తరువాత కాలంలో వాణిజ్య బ్యాంకులు నిధులు ఇవ్వడం తగ్గించాయి. దీని ప్రభావం మైక్రోఫైనాన్స్ సంస్థలపై పడింది. దీనితో స్వయం ఉపాధి గ్రూపుల మహిళలకు ఈ రుణాలు కూడా అందడంలేదు.

దేశంలోని రైతులు వ్యవసాయం ఖర్చులు పెరిగిపోవడం, పంటరేట్లు స్థిరంగా లేకపోవడం మరియు ప్రభుత్వ సహకారం లేకపోవడం వంటి సమస్యలతో తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. మహిళా రైతులకు భూమి పట్టాలు లేకపోవడం, గుర్తింపు లేకపోవడం మొదలైన వాటితో వారు మరింత ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. వారికి వ్యవసాయ సబ్సిడీలు కానీ సంస్థాగత రుణాలు కానీ సంక్షోభ నివారణకు సంబంధించిన సదుపాయాలు కానీ ఏవీ అందుబాటులో ఉండడంలేదు.

**చికన్ వర్క్ ఎంబ్రాయిడరీ కోసం వెచ్చించే శ్రమ, నైపుణ్యాలకు తగ్గ ఫలితం అందులో దక్కడంలేదని కమ్ము చెబుతుంది. ఎంతో నైపుణ్యం కలిగిన కార్మికునికైనా రోజుకు 50 రూపాయలు మాత్రమే లభిస్తుంది. ఇక మామూలు కార్మికునికి రోజుకు 8 నుండి 20 రూపాయలు మాత్రమే దక్కుతుంది. సంక్షోభంతో పరిస్థితులు మరింత దిగజారాయి. ఇంతకు ముందు కంటే చాలా తక్కువ వేతనం పొందుతున్నట్లు కమ్ము చెబుతుంది. ప్రస్తుత సంక్షోభ పరిస్థితులలో కూడా చికన్ వర్కర్ల కోసం ప్రభుత్వం ఏమీ చేయడంలేదని కమ్ము చెబుతుంది.**

**వలస కార్మికులు:** సంక్షోభం యొక్క ప్రత్యక్ష ప్రభావం పురుష వలస కార్మికులకంటే మహిళా వలస కార్మికులపై కొంత తక్కువగానే ఉందని చెప్పవచ్చు. కానీ, దుష్ప్రభావం లేదని చెప్పలేము. ఆసియాలోని వలసలలో ముఖ్యంగా సరిహద్దులు దాటుతున్న వలసలలో పురుషులు తయారీ రంగంలోనూ, నిర్మాణ రంగంలోనూ పనిచేస్తున్నారు. మహిళా వలస కార్మికులు సంరక్షణ రంగంలోనూ, వినోదానికి సంబంధించిన పనులలోనూ ఉన్నారు. (ఉదా: నర్సింగ్ మరియు ఇంటిపని) ఈ సంరక్షణకు సంబంధించిన పనులు వాణిజ్య రంగంపై తక్కువ ప్రభావం చూపిస్తున్నాయి. కానీ జనాభాకు సంబంధించిన విషయాలపైనా, సంస్థాగత విషయాలపైనా మరియు ఆయా దేశాల్లోని మహిళలు ఇంట బయట చేసే పనులపైనా ఎక్కువ ప్రభావం చూపిస్తాయి. కనుక మహిళా వలస కార్మికుల వేతనాలు కొంత స్థిరత్వం కలిగి ఉన్నాయి. పురుషులకు తగ్గిపోయినంతగా తగ్గలేదు.

ఏది ఏమైనా ఇక్కడ ఉన్న తక్కువ ఉపాధి అవకాశాల వలన దేశీయ వలసలపై సంక్షోభ ప్రభావం ఉంది. వలస కార్మికులు, ముఖ్యంగా అట్టడుగు వర్గాల మహిళా కార్మికులు ఎక్కువగా ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఉపాధి అవకాశాలు అసలే తక్కువగా ఉన్న పరిస్థితుల్లో వలస కార్మికులు వచ్చి తమ ఉపాధి అవకాశాలపై దెబ్బ కొడుతున్నారని స్థానికులు భావిస్తున్నారు.

వలస మహిళలకు అందే హెచ్ఐవి సర్వీసులపై సంక్షోభ ప్రభావం తీవ్రంగా ఉన్నదనేది మాత్రం సరిగా గుర్తించని ఒక ముఖ్యమైన అంశం.

**మహిళలు చేసే వేతనం లేని పని:**

మహిళలు చేసే వేతనం లేని పనులపై సంక్షోభం ప్రత్యక్ష, పరోక్ష ప్రభావం చూపుతుంది. కుటుంబ ఆదాయాలు పడిపోయినపుడు కుటుంబాలు అనేక పద్ధతుల ద్వారా జీవనం సాగించే ప్రయత్నం చేస్తుంటాయి. అందులో భాగంగానే తమ నిత్యావసరాల ఖర్చులు తగ్గించుకుని వినియోగం పెంచుకునే ప్రయత్నం చేస్తారు. తమ అవసరాల కోసం బయటి వారితో పనిచేయించుకునే బదులుగా కుటుంబ సభ్యులతోనే పనిచేయించుకునే ప్రయత్నం చేస్తారు. పలు రంగాలలో ప్రభుత్వం తన సర్వీసులను ఉపసంహరించుకోవడమే కాక ఆరోగ్యం, పారిశుధ్యం లాంటివాటిపై అధిక మొత్తాల్లో యూజర్ చార్జీలను వసూలు చేస్తుంది. దీనితో కుటుంబంలో ఎలాంటి వేతనం లేకుండా పనిచేసే సభ్యులపై ముఖ్యంగా పనులు నిర్వహించే మహిళలపై అధిక భారం పడుతుంది.

సంక్షోభం తరువాత మహిళలు చేసే వేతనం లేని పని పెరిగిందని అనేక సర్వేలలో రుజువయ్యింది. ఇంటికి సంబంధించిన పనులైన శుభ్రం చేయడం, ఊడ్వడం, ఉతకడం లాంటివి ఇళ్ళలో పనిచేసేవారిని తొలగించి మహిళలే చేయాల్సివస్తుంది. అనారోగ్యానికి గురైనవారినీ, పిల్లలనూ మహిళలే చూసుకోవాల్సి వస్తుంది. అంతేకాక పొలాల నుండి, మార్కెట్ల నుండి కూరగాయలు, పండ్లు, ఆకుకూరలు తెచ్చే పనికూడా మహిళలే చేస్తున్నారు. ఇవన్నీ వేతనం లేని పనులే. ఈ విధంగా ఇళ్ళలో చేసే వేతనం లేని పని మహిళలకు మూడింతలు పెరిగిందని ప్రభుత్వ శాంపిల్ సర్వేలో తేలింది. యుఎన్‌డిపి నివేదిక 33వ పేజీలో కూడా ఇవే అంశాలు వెల్లడించారు. గృహ సంబంధిత పనులను మొత్తంగా మహిళలే వేతనం లేకుండా నిర్వహించడం, వేతనం ఇచ్చి చేయించుకునే ఆరోగ్య సేవలను వేతనం లేని సేవలుగా మార్చడం, గ్రామీణ

ప్రాంతాల్లో మహిళలు ఉచితంగా దొరికే కూరగాయలు, పండ్లు, ఆకులు, గడ్డిలాంటివి సేకరించే పనులు పెరగడం వలన ఈ వేతనం లేని పనులు పెరిగాయని చెప్పవచ్చని నివేదికలో పేర్కొన్నారు.

**ప్రాథమిక హక్కులు, అవసరాలపై దుష్ప్రభావం:**

ఆదాయాలు పడిపోవడంతో ఆహారం అందుబాటులో లేకుండా పోయింది. కుటుంబాలలో ముఖ్యంగా మహిళలు, ఆడపిల్లలు ఆహార కొరతను ఎదుర్కోవలసి వస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా ఇంధనం, ఆహార ధరలలో స్థిరత్వం లేకపోవడంతో చాలా దేశాలలో ఆహార ధరలు కూడా పెరుగుతున్నాయి. చాలా కుటుంబాలు అప్పులు చేసి ఆహార పదార్థాలు కొనుగోలు చేయాల్సి రావడంతో తక్కువ ఖరీదుగల ఆహార పదార్థాలను కొనుగోలు చేయడం, తక్కువ వినియోగించడం లాంటి పద్ధతులు అవలంభిస్తున్నారని అనేక సర్వేలలో తేలింది. చాలా కుటుంబాలలో మహిళలు, ఆడపిల్లలే ఆహార కొరత సమస్య ఎదుర్కొంటున్నారనీ, కుటుంబాలలోని తల్లులూ, అక్కలూ తాము తీసుకునే ఆహారాన్ని త్యాగం చేసి మిగిలిన కుటుంబ సభ్యులకు పెడుతున్నారనీ యుఎన్‌డిపి 2009 నివేదికలో కూడా తెలిపారు. మహిళలు ఆడపిల్లలకు సంబంధించిన పౌష్టికాహారం, ఆరోగ్యం విషయంలో ప్రపంచ దేశాలలో భారతదేశం చాలా వెనుకబడి వున్న విషయం కూడా ఈ సందర్భంగా గుర్తించాలి. 2005-06 సంవత్సరాలలో జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే (ఎన్ఎఫ్‌హెచ్ఎస్)నిర్వహించిన సర్వేలో అనేక అంశాలు వెలుగుచూశాయి.

**అవి:**

1. **3సం॥లలోపు పిల్లలలో 46 శాతం మంది బరువు తక్కువ వున్నారు.**
2. **బాడీ మాస్ ఇండెక్స్ (బిఎంఐ) సాధారణ స్థాయికంటే తక్కువగా వున్న మహిళలు 33శాతం ఉండగా పురుషులు 28 శాతం ఉన్నారు.**
3. **6నుండి 35 నెలల లోపు వయసు పిల్లలలో 79 శాతం మంది రక్తహీనతతో ఉన్నారు.**
4. **15 నుండి 49సం॥లలోపు వున్న అవివాహిత మహిళలలో 56 శాతం మందిలో రక్తహీనత వుండగా గర్భిణీ స్త్రీలలో 58 శాతం మందిలో రక్తహీనత వుంది. గ్రామీణ ప్రాంతాలలో ఈ పరిస్థితి తీవ్రత ఇంకా ఎక్కువగా ఉంది.**

ఆహార ధరల పెరుగుదల విపరీతంగా వున్న గత 4 సం॥ల ముందు కాలంలో కూడా పౌష్టికాహార వినియోగంలో తగ్గుదల కనిపిస్తుంది. కేలరీల వినియోగం ఇంకా తక్కువగా ఉంది. 2004-05 సం॥లలో నేషనల్ శాంపిల్ సర్వే సంస్థ (ఎన్.ఎస్.ఎస్.ఒ.) నిర్వహించిన ఒక పెద్ద సర్వే నివేదిక పరిశీలిస్తే గ్రామీణ ప్రాంతాలలో సరాసరి కేలరీల వినియోగం 1993-94 సం॥లలో 2153 కిలో కేలరీలు వుండగా 2004-05 సం॥లలో 2047 కిలో కేలరీలకు పడిపోయింది. అంటే 106 కిలో కేలరీల వినియోగం తగ్గిపోయింది. (ఇది 4.9 శాతం తగ్గుదల)

పట్టణ ప్రాంతాలలో 2071 కిలో కేలరీల నుండి 2020 కిలో కేలరీలకు తగ్గింది. అంటే 51 కిలో కేలరీలు తగ్గింది. (ఇది 2.5 శాతం)

1993-94 సం॥ నుండి 2004-05 సం॥ల మధ్యలో గ్రామీణ ప్రాంతాల్లో ప్రొటీన్ల వినియోగం 60.2 గ్రాముల నుండి 57 గ్రాములకు తగ్గిపోయింది. అదే కాలంలో పట్టణ ప్రాంతాల్లో ఇది 57 గ్రాములుగా స్థిరంగా ఉంది.

విద్య, ఆరోగ్య రంగాలలో విధిస్తున్న అధిక యూజర్ చార్జీల వలన మహిళలు, ఆడపిల్లలు ఎక్కువగా నష్టపోతున్నారు. ఆడపిల్లలను చదువు మాన్పించడం, మహిళలకు గర్భవతులైనపుడు కూడా ఆరోగ్య సదుపాయాలు అందుబాటులో లేకపోవడం వంటివి అనేక నివేదికలలో వెల్లడయ్యాయి. ఆర్థిక పరిస్థితులు దిగజారడంతో పురుషులు అసహాయ పరిస్థితులెదుర్కొనడం, తమ ఆగ్రహాన్ని ఏదో రూపంలో వెల్లడించాలని చూడడం లాంటి వాటి వలన లింగ వివక్షకు, హింసకు, గృహ హింసకు పాల్పడడం పెరిగింది. మహిళలపైన ఇంటా, బయటా హింస పెరిగిందని అనేక నివేదికలు చెబుతున్నాయి. దీనితోపాటు బహిరంగ ప్రదేశాల్లో మహిళలకు అభద్రత పెరిగింది. ఆర్థిక సమస్యలు, ఉపాధి కోల్పోవడం, అభద్రతా భావం మొదలైన వాటితో మహిళల్లో మానసిక సమస్యలు కూడా పెరుగుతున్నాయి. ఇది అంతగా గుర్తింపుకు నోచుకోని అంశంగా వుంది.

విద్య, ఆరోగ్య రంగాలలో విధిస్తున్న అధిక యూజర్ చార్జీల వలన మహిళలు, ఆడపిల్లలు ఎక్కువగా నష్టపోతున్నారు. ఆడపిల్లలను చదువు మాన్పించడం, మహిళలకు గర్భవతులైనపుడు కూడా ఆరోగ్య సదుపాయాలు అందుబాటులో లేకపోవడం వంటివి అనేక నివేదికలలో వెల్లడయ్యాయి. ఆర్థిక పరిస్థితులు దిగజారడంతో పురుషులు అసహాయ పరిస్థితులెదుర్కొనడం, తమ ఆగ్రహాన్ని ఏదో రూపంలో వెల్లడించాలని చూడడం లాంటి వాటి వలన లింగ వివక్షకు, హింసకు, గృహ హింసకు పాల్పడడం పెరిగింది. మహిళలపైన ఇంటా, బయటా హింస పెరిగిందని అనేక నివేదికలు చెబుతున్నాయి. దీనితోపాటు బహిరంగ ప్రదేశాల్లో మహిళలకు అభద్రత పెరిగింది. ఆర్థిక సమస్యలు, ఉపాధి కోల్పోవడం, అభద్రతా భావం మొదలైన వాటితో మహిళల్లో మానసిక సమస్యలు కూడా పెరుగుతున్నాయి. ఇది అంతగా గుర్తింపుకు నోచుకోని అంశంగా వుంది.

**సంక్షోభ సమస్యలతోపాటు లైంగిక సమస్యలపై కూడా దృష్టి సారించాలి:**

భారతదేశంలో సామాజిక భద్రత చాలా తక్కువ. కనుక ఈ పరిస్థితి త్వరితంగా మారాలి. నగదు బదిలీ, నిరుద్యోగ భృతి, నష్టపరిహారం మొత్తాలు అందజేసేటపుడు కుటుంబాలలో పురుషులనే పరిగణనలోకి తీసుకోవడంతో మహిళలు నష్టపోతున్నారు. మహిళల ఉపాధికి సంబంధించిన హక్కును, అవసరాన్ని గుర్తించిన కొన్ని పథకాలు. ఉదాహరణకు గ్రామీణ ఉపాధి హామీ పథకం లాంటివాటి వలన మహిళలకు ఎంతో మేలు జరిగింది. సంక్షోభ సమయంలో వారికి కొంత ఆదాయం సమకూరడమే కాక నగదు ఆదాయం వలన గృహ సంబంధిత ఖర్చులపై వారికి మంచి అదుపు ఏర్పడింది. చిన్నచిన్న మహిళా పారిశ్రామిక వేత్తలను గుర్తించి వారికి రుణ సౌకర్యాలు, మార్కెట్ సౌకర్యాలు కల్పించాలి. తద్వారా వారు మైక్రోఫైనాన్స్ సంస్థల బారిన పడకుండా చూడాలి. దీనితోపాటు మహిళలపై పెరుగుతున్న వేతనం లేని పని భారాన్ని తగ్గించాలి. ఇది అతి ముఖ్యమైన అంశంగా గుర్తించాలి. అధిక బడ్జెట్లు కలిగి ఉండి, జవాబుదారీగావున్న ప్రభుత్వ సేవల ద్వారా ప్రజలకు సౌకర్యాలు కలిగించినపుడే ఇది సాధ్యపడుతుంది.

అనువాదం: కె. నాగలక్ష్మి

వివక్ష

# ప్రేమను చిదిమేసిన కుల దురహంకారం

- సింహాద్రి సరోజిని

మధ్య యుగాల నాటి అమానవీయ చర్యలు ఇంకా దేశంలోని అనేక రాష్ట్రాల్లో కొనసాగటం మానవత సిగ్గుతో తలవంచుకోవలసిన విషయం. తమిళనాడులోని ధర్మపురి జిల్లాలో కుల దురహంకారం మరోమారు పడగవిప్పింది. కుల దొంతరల సమాజం ఒక నిండు జీవితాన్ని బలిగొన్నది. తమిళనాడులో దళితుల పట్ల చెలరేగుతున్న అగ్రకుల అకృత్యాలు చాలానే ఇటీవల కాలంలో వెలుగులోకి వచ్చాయి. అక్కడ అంటరానితనం, రెండు గ్లాసుల పద్ధతి, దేవాలయ ప్రవేశ నిషేధం, కోయంబత్తూరు, మధురైలోని ఉత్తపురంలో ఏకంగా దళిత కాలనీని వేరు చేస్తూ గోడకట్టిన ఉదంతాలు మన కళ్ళముందున్నాయి. హక్కుల కోసం ప్రశ్నించే దళితులను గ్రామ బహిష్కరణలు, ఇతర రకాలుగా ఇబ్బందులపాలు చేయడం వంటి వార్తలు చాలా తరచుగా బహిర్గతమవుతున్నాయి.

వీటికి తాజా ఉదాహరణగా తమిళనాడులో జరిగిన రెండు మూడు సంఘటనలను పరిశీలిస్తే మనకు అర్థమవుతుంది. దళిత భాగస్వామిగా ఉండే కులాంతర వివాహాలు జరిగిన ప్రతిసారీ అగ్రకుల దురహంకార శక్తులు పేట్రేగిపోవడం ఇక్కడ సర్వసాధారణమైంది. ఇప్పుడు ధర్మపురి జంటగా పిలుస్తున్న దళిత యువకుడు ఇల్లావరసన్, వన్నియార్ యువతి దివ్య గత సంవత్సరం ప్రేమ వివాహం చేసుకున్నట్లు వార్త వచ్చింది. అయితే ఈ వివాహం ఎంత కాలం నిలుస్తుందోనని పరిశీలకులు అనుమానాలు వ్యక్తం చేశారు కూడా. వారు భావించినట్లుగా ఆ వివాహం విచ్ఛిన్నమైంది. ఆత్మహత్యకు పాల్పడినట్లు చెబుతున్న వరుడు ఇల్లావరసన్ కొద్ది రోజుల ముందే ఒక పత్రికతో మాట్లాడుతూ 'మేము చాలా సంతోషకరమైన జీవితం గడిపాము. ఆమె తన తల్లిదండ్రుల వద్ద కంటే కూడా నా దగ్గర చాలా ఆనందంగా ఉంది. కానీ మేము రాజకీయ కుట్రకు బాధితులమయ్యాం' అని అన్నాడు. తానూ, తన భర్తా పెద్ద ఎత్తున ఒత్తిడిని ఎదుర్కొంటున్నామని, అందువల్ల 'నా ప్రేమను, వివాహాన్ని త్యాగం చేయాలని నిర్ణయించుకున్నాను' అని దివ్య కూడా అంతకు ముందు చెప్పింది. ఈ వివాహం విచ్ఛిన్నం కావడానికి ప్రధాన కారణంగా భావిస్తున్న పట్టలి మక్కలి కచ్చి (పిఎంకె) పార్టీ మాత్రం దీంతో తనకెలాంటి సంబంధం లేదని బుకాయించింది. అయితే పెళ్ళి విషయంలో యువతీయువకుల తల్లిదండ్రుల ఆమోదం అవసరమని నన్నాయి నొక్కులు నొక్కింది. చివరకు ఈ ఒత్తిళ్లను, వేధింపులను తట్టుకోలేక దివ్య తన తల్లి వద్దకు వచ్చేసింది. తన భర్త వద్దకు తిరిగి వెళ్ళాలని తాను భావించడం లేదని కోర్టులో చెప్పింది. ఈ మాటలను ఆమె చేత బలవంతంగా చెప్పించినట్లు కూడా అనుమానాలు వ్యక్తమయ్యాయి. దివ్య అలా చెప్పిన మరుసటి రోజే ఇల్లావరసన్ తంజావూరు జిల్లాలోని సురక్కొట్టాయి వద్ద శవం రైలు పట్టాల పక్కన శవమై కన్పించాడు. ఇది హత్యేనని ఇల్లావరసన్ తల్లిదండ్రులు ఆరోపిస్తుండగా, దీనిని అనుమానాస్పద మృతిగా చిత్రీకరించేందుకు పోలీసులు ప్రయత్నిస్తున్నారు. ఈ రకంగా ఒక సంతోషకరమైన వివాహ బంధం కుల కట్టుబాట్ల ఒత్తిళ్ళకు బలయింది. ఈ వివాహం పర్యవసానాలు పరిశీలిస్తే దళితుల పక్షపాతిగా ఉన్న దివ్య తండ్రిని కులం నుంచి వెలివేశారు. దాంతో అవమానం తట్టుకోలేక ఆయన ఆత్మహత్యకు పాల్పడ్డారు. దాన్ని సాకుగా తీసుకుని అగ్రకుల పెత్తందారులు ధర్మపురి జిల్లాలోని నయిక్కెన్‌కొట్టయ్ గ్రామంలో మూడు దళిత కాలనీలను ముందస్తు పథకం ప్రకారం బుగ్గిపాలు చేశారు. ఆ దాడిలో 270 దళిత కుటుంబాలు తమ సర్వస్వం కోల్పోయాయి. ఈ కేసుతో ఒక నిండు ప్రాణం, ఒక ప్రేమ వివాహం బూడిదయ్యాయి. ఇల్లావరసన్‌ది హత్యాలేక ఆత్మహత్యా అనే చర్చను మీడియా, స్వార్థ ప్రయోజన శక్తులు ప్రారంభించినప్పటికీ ఈ ప్రత్యేక పరిస్థితిలో దానివల్ల పెద్దగా వచ్చేతేడా ఏమీ ఉండదని వారు

దళిత భాగస్వామిగా ఉండే కులాంతర వివాహాలు జరిగిన ప్రతిసారీ అగ్రకుల దురహంకార శక్తులు పేట్రేగిపోవడం ఇక్కడ సర్వసాధారణమైంది.



గుర్తించకపోవడం విచారకరం.

తమిళనాడులోనే జరిగిన మరో కులాంతర వివాహం పర్యవసానాలను పరిశీలించడం అవసరం. ఇది దివ్య, ఇల్లావరసన్ వివాహం మాదిరిగా పెద్దగా ప్రచారం పొందనప్పటికీ కుల దురహంకారమనేది ఎంత దుర్మార్గంగా వ్యవహరిస్తుందో తెలుసుకోవడానికి ఈ సంఘటన తోడ్పడుతుంది. ఇది 24 ఏళ్ళ అభిరామి వివాహానికి సంబంధించిన విషయం. ఇది మన దేశ సామాజిక జీవనంలోని దుర్మార్గమైన కోణాన్ని అర్థం చేసుకోవడానికి తోడ్పడుతుంది. అభిరామి కల్లర్ (ఒబిసి) కులానికి చెందిన యువతి. ఆమె తంజావూరు జిల్లాలోని తన గ్రామమైన సురకొట్టయ్ సమీపంలోని వరోత్తనాడులో టీచర్ ట్రెనింగ్ కళాశాలలో చేరింది. ఆమె రోజూ బస్‌లో కాలేజీకి వెళ్ళి వస్తున్న సమయంలో ఒక దళిత యువకుడు మారిముత్తుతో స్నేహం కలిసింది. ఈ విషయం తెలిసిన ఆమె కుటుంబ సభ్యులు ఆమెను ఇంట్లోనే బందీని చేశారు. పచ్చి తాగుబోతు అయిన తన మేనమామ (35 ఏళ్ళు)ను వివాహమాడాల్సిందిగా ఒత్తిడి పెంచారు. మారి ముత్తును సంప్రదించిన అభిరామి అతనితో కలిసి వెళ్ళిపోయింది. వారు అక్కడా, ఇక్కడా తిరుగుతున్న సమయంలో కొందరు సిపిఎం సభ్యులను కలుసుకున్నారు. వారి సహాయంతో కుంభకోణం వెళ్ళి అక్కడ వివాహం చేసుకున్నారు. వారి వివాహం 2010 సెప్టెంబర్ 16న జరిగింది. చెన్నయ్‌లో తమ జీవన పోరాటం ప్రారంభించారు. వారికి ఒక పాప సౌందర్య జన్మించింది. తరువాత ఆ దంపతులు మారిముత్తు కుటుంబంతో కలిసి జీవించేందుకు స్వగ్రామానికి తిరిగి వచ్చింది. సౌందర్య మొదటి పుట్టిన రోజుకు ముందు అభిరామి అన్న తన మేనకోడలికి బంగారు గొలుసు బహుమతిగా ఇవ్వాలనే సాకుతో మారిముత్తును కలిశాడు. మారిముత్తు 2012 మే 25న తన బావమరిదిని కలిసేందుకు వెళ్ళాడు. కానీ తిరిగి రాలేదు. మరుసటి రోజు ముక్కలు ముక్కలుగా నరికిన అతని శరీరం నది ఒడ్డున కన్పించింది. ఆ హత్య తామే చేశామని అంగీకరిస్తూ అభిరామి తండ్రి, సోదరుడు పోలీసుల ముందు లొంగిపోయారు. అయితే వారిని అరెస్టు చేసినప్పటికీ ఎవ్వరూ సాక్ష్యం చెప్పేందుకు ముందుకు రాకపోవడంతో త్వరలోనే విడుదలయ్యారు. అభిరామి ఒబిసి కులానికి చెందిన వ్యక్తి కావడంతో దళితులు హత్యకు గురైనప్పుడు చెల్లించే నష్టపరిహారం ఆమెకు చెల్లించేందుకు జిల్లాకలెక్టర్ తిరస్కరించారు. అయితే బహిరంగ విచారణ సందర్భంగా అనుకోకుండా అభిరామి కేసు జాతీయ మానవ హక్కుల కమీషన్ ఛైర్మన్ ముందుకు వచ్చింది. ఆమెకు, ఆమె బిడ్డకు రూ. 5లక్షల నష్టపరిహారం చెల్లించాలని, ఆమె జీవనం కోసం ఉద్యోగం కానీ, కొంత స్థలం గానీ ఇవ్వాలని మానవ హక్కుల సంఘం జిల్లా కలెక్టర్‌ను ఆదేశించింది. అభిరామి తనకు లభించిన నష్టపరిహారాన్ని తన అత్తమామలకు ఇచ్చేసింది. అయితే ఆమెకు ఇంకా ఉద్యోగం రావాల్సే ఉంది. అభిరామి మూలంగా భూమి కలిగి ఉన్న కల్లర్ల నుంచి అర్థిక బహిష్కరణను ఎదుర్కొన్న అత్తమామలు ఆమెను ఇంటి నుంచి వెళ్ళిపోవలసిందిగా కోరారు. ఈ రకమైన హింస, హత్య, వేరుపడిపోవడం లేదా సామాజిక బహిష్కరణతో ముగిసినప్పుడు 'కుల దురహంకార నేరాలను' ఎదుర్కొనేందుకు ఒక ప్రత్యేకమైన చట్టం అవసరముందనే అంశాన్ని ఇలాంటి కేసులు వెల్లడిస్తున్నాయి. దీనికి సంబంధించి ఒక ముసాయిదా చట్టాన్ని ఐద్వా కేంద్ర ప్రభుత్వానికి అందించింది. ఇదే రకంగా ఉన్న చట్టాన్ని 242వ న్యాయ కమీషన్ నివేదిక సిఫారసు చేసింది. ఖాప్ పంచాయితీల, కుల పంచాయితీల (వీటిని తమిళనాడులో కట్టా పంచాయితీలంటారు) పాత్ర సహా మహిళలపై నేరాలకు సంబంధించిన అనేక కోణాలను వివరించిన వర్మ కమిషన్ నివేదిక కూడా న్యాయ కమిషన్ సిఫారసులను సమర్థించింది. ఇలాంటి అమానవీయ నేరాలపై చర్యలు తీసుకోవలసిన అవసరాన్ని కేంద్రంలోని యుపిఏ ప్రభుత్వం పూర్తిగా పట్టించుకోకపోవడం దారుణం. కుల

కుల, మతతత్వాలకు మూలాలను గుర్తించి వాటిని కూకటి వేళ్ళతో పెకిలించకుండా కుల దురహంకార హత్యలకు పాల్పడినవారికి మరణదండనే సరైనదని సుప్రీంకోర్టు ఉద్ఘాటించినా, చట్టాలెన్ని ఉద్ఘోషించినా ప్రయోజనమేమీ ఉండదని ఇల్లావరసన్, మారిముత్తు ఉదంతాలు మరోమారు చాటి చెబుతున్నాయి.

అణగారిన వర్గాలు వామపక్ష, లౌకిక, ప్రగతిశీల శక్తులను కలుపుకుని ఐక్యంగా ఉద్యమిస్తే సమాజంలోని ఈ సంకుచిత అడ్డుగోడలను ఎలా కూల్చవచ్చో కోయంబత్తూరు, మదురైలోని ఉత్తాపురం పోరాటాలు చాటి చెబుతున్నాయి.

వివక్షతో సాగించే తిరోగామి చర్యలు, వీటిని ప్రోత్సహించే బలమైన పితృస్వామిక నిర్మాణాలు ఇలాంటి నేరాలకు కారణమవుతున్నాయి. 2013 లో ఇప్పటి వరకు ఓ డజను కుల దురహంకార హత్యలు జరిగాయి. ఈ దారుణ హత్యలు సమర్థవంతమైన న్యాయ చర్యల అవసరాన్ని సూచిస్తున్నాయి.

ఈ కుల, మతతత్వాలకు మూలాలను గుర్తించి వాటిని కూకటి వేళ్ళతో పెకిలించకుండా కుల దురహంకార హత్యలకు పాల్పడినవారికి మరణదండనే సరైనదని సుప్రీంకోర్టు ఉద్ఘాటించినా, చట్టాలెన్ని ఉద్ఘోషించినా ప్రయోజనమేమీ ఉండదని ఇల్లావరసన్, మారిముత్తు ఉదంతాలు మరోమారు చాటి చెబుతున్నాయి. వామపక్షాలు డిమాండ్ చేస్తున్నట్లుగా పటిష్ట భూ సంస్కరణలు అమలు చేస్తే పరిస్థితిలో కొంత మార్పు తీసుకురావచ్చు. గ్రామాల్లో బావుల నుంచి మంచినీరు తోడుకోనివ్వకపోవడం, ఆలయాల్లో ప్రవేశాన్ని అడ్డుకోవడం, అగ్రవర్ణాల వీధుల్లోంచి నడవనివ్వకపోవడం వంటి అస్పృశ్యత, కుల దురహంకార చర్యలను పారదోలాలి.

మదురై జిల్లాలోని వాడుగపట్టి గ్రామంలో ఒక దళిత బాలుడు చెప్పులు ధరించి అగ్రకుల వీధుల్లో నడిచినందుకు అతని తలపై వారి చెప్పులు పెట్టి గ్రామంలో తిప్పిన సంఘటన సభ్య సమాజం తలదించుకునేలా చేసింది. వామపక్షాలు ఇప్పటికే కోయంబత్తూరులో కుల వివక్షకు, విద్వేషాలకు చిహ్నంగా ఉన్న ఒక గోడను కూల్చడం ద్వారా ఈ ఫ్యూడల్ శక్తులకు గట్టి సవాల్ విసిరాయి. అణగారిన వర్గాలు వామపక్ష, లౌకిక, ప్రగతిశీల శక్తులను కలుపుకుని ఐక్యంగా ఉద్యమిస్తే సమాజంలోని ఈ సంకుచిత అడ్డుగోడలను ఎలా కూల్చవచ్చో కోయంబత్తూరు, మదురైలోని ఉత్తాపురం పోరాటాలు చాటి చెబుతున్నాయి.

## మనది స్వతంత్ర భారతమా?

# మృగాల భారతమా?

(ఆగష్టు 15 స్వతంత్ర దినోత్సవ సందర్భంగా పునరాలోచన దిశగా).

- అల్లూరి మన్మోహిని

ఎందరో మహనీయుల ఎందరెందరో తల్లుల అపురూపమైన అనంత త్యాగాల భరితం ఈ 66సం॥ల స్వతంత్ర భారతం. బుడతకీచుల (పోర్చుగీసువాళ్లు) బ్రిటిష్ సామ్రాజ్యవాద దోపిడీ వలస పాలనల్లో బందీగా బానిసత్వంలో మగ్గిన భారతజాతి ఒక్కుమ్మడిగా మేల్కన్నది. వీర భారతిగా తన ప్రతాపం చూపింది. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని గడగడలాడించింది.

**"కుక్కలతో పోరాడి కూడూ తింటముగాని,.. మాకొద్దీ తెల్ల దొర తనము, బాబు, మాకొద్దీ తెల్ల దొరతనము".**

**"స్వాతంత్ర్యమే మా జన్మహక్కని చాటండి**
**స్వరాజ్య రుధిర జ్వాలలతోటి**
**స్వతంత్ర సమరం నెరపండి**
**ఎంత కాలమిక సహించియున్నా**
**దోపిడి మూకకు దయరాదన్నా"**

అని పాటలు పాడుతూ చైతన్య భారతి ప్రజలు ఎదురు తిరిగి విదేశీ పాలకులను తరిమికొట్టారు. పంజాబ్‌లోని జలియాన్ వాలాబాగ్‌లో జరిగిన మారణహోమం సామ్రాజ్యవాదుల క్రూర పాలనకు ఉదాహరణ. దేశభక్తి, అత్యున్నత త్యాగాలు, మానవతా విలువల వెల్లివిరిసిన స్వర్ణయుగం అది.

అంతటి క్రూర నియంతృత్వ పాలకులను తరిమి కొట్టిన, భారత ప్రజలు ఈనాటి ఇంతటి మానవమృగాల భారతాన్ని ఇక సహించరు. పాడి, పంటలు, సిరిసంపదలతో తులతూగే భారతదేశాన్ని, దోచుకుపోతున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కబంధ హస్తాలనుండి బంగారు భారతాన్ని విముక్తి చేయుటకై, అశేష భారత ప్రజలు తిరగబడి 300సం॥ల ఆంగ్లేయుల పాలనను తరిమి కొట్టారు. అఖండ భారత ప్రజల చైతన్యం వెల్లివిరిసింది.

మరి ఈనాటి భారతాన్ని మృగాల భారతం అనటం తప్పేనేమో అనిపిస్తోంది. ఎందుకంటే క్రూర మృగాలు కడుపులో ఆకలి తీరితే వాటి ఆహారం ఎదురుగా ఇంకా ఉన్నా వదిలేసి వెళ్లిపోతాయి. వాటి కడుపు ఆకలి తీర్చుకొనుటకు అవసరమైనంతవరకే తీసుకుంటాయి. ప్రకృతి నియమాల కనుగుణంగానే జత కడతాయి. కాని పవిత్ర భారతంలో అను నిత్యం చిన్నా, పెద్ద తారతమ్యాలు లేకుండా అత్యాచారాలతో మాన ప్రాణాలు దోచుకొనే నూతన రాక్షస వికృత జాతి ఉద్భవించింది. అది ప్రబలిపోతోంది. నూతన మానవ మృగాలు విచ్చలవిడి స్వైరవిహారం స్త్రీ జాతిని వేటాడుతోంది. చిన్నారి బాలికలు, యువతుల నూరేళ్ల అపురూప భవితను రాక్షసంగా కబళిస్తోంది. కొండల్లో, గుట్టల్లో స్త్రీల దిక్కులేని శవాలు. ఇంకా ఘోరంగా దేశవ్యాపితంగా యువతులపై ఘోరాలు స్త్రీలపై పసిబిడ్డలు, బాలికలపై నిత్యం జరిగేరాక్షస కృత్యాలతో పత్రికలనిండా అవే వార్తలు. అయినా పాలకులకు చీమకుట్టినట్లు లేదు. ఒకవైపు న్యాయవ్యవస్థ ఘోషిస్తోంది. చివాట్లు పెడుతోంది. అయినా పాలకులకు చలనంలేదు.



"అర్థరాత్రి స్త్రీ నడిరోడ్డుమీద నిర్భయంగా నడవగల్గినప్పుడే దేశానికి స్వతంత్రం వచ్చినట్లు" అని గాంధీజీ సందేశం . కానీ ఈనాడు స్త్రీకి పట్టపగలే ఇంటా, బయటా రక్షణలేదు. స్వతంత్రభారతం స్త్రీల పాలిట బలిపీఠం అయింది. ఇంకా ఘోరాతిఘోరం, చిన్నారి బాలికలు, యువతుల చీకటి మార్కెట్ విచ్చలవిడిగా సాగిపోతోంది. అమ్మాయిల అమ్మకాల సందర్భంగా, గుండాలచేతిలో చిక్కుకుపోయిన అమాయక బాలికలు, యువతుల ఆర్తనాదాలు, వారిపై సాగే హింస(వ్యభిచారగృహాలలో) వ్రాయుటకు భాషలేదు. దన దాహంతో మానవత్వం మరణించింది. స్వతంత్రభారతం గూండాల భారతం అయింది.

యువతులపై. మహిళలపై క్రూరమైన యాసిడ్ దాడులు, (ఆమ్లా) ఇతరత్రా మహిళలపై సాగుతున్న ఘోరకృత్యాలకు సంబంధించి సుప్రీంకోర్టు చొరవతో, 2012లో 43251 సంఘటనలు బయటకు వచ్చినవి. ఇంకా బయటకు తెలియని అజ్ఞాత హింసలు, హత్యలు ఇంకెన్నో. "మహిళలపై సాగే ఈఘోరకలికి ఎంతోమంది మరణిస్తున్నా మీకు బాధలేదు". అని ఉన్నత న్యాయస్థానం ఇటీవల కేంద్రప్రభుత్వాన్ని నిలదీసిన తీరు ఇది.

ఒక వైపు మనం ఎంతో ఘనంగా చెప్పుకునే అఖండభారతాన్ని ముక్కముక్కలుచేసి మంత్రుల సంఖ్యలను ఇంకా పెంచుకొంటే దేశ ప్రజల సంపదలు, శ్రమ జీవుల కష్టార్జితం అణువణువు దోచుకొనుటకై దేశాన్ని కుక్కలు చింపిన విస్తరి చేస్తున్నారు. బ్రిటిష్

**హేయమైన, జుగుప్సాకరమైన రాజ్యనీతితో, ప్రజలను ఇంకా, ఇంకా దోచుకొనుటకై కుర్చీలకోసం, సింహాసనాల కోసం, నువ్వు దొంగ అంటే నీవు దొంగ అంటూ ప్రకటనలతో పెనుగులాటలు, ప్రజల నవనాడులు క్రుంగదీసే బ్రాందీ, సారాల వ్యాపారంతో ఖజానా నింపుకుంటున్న పాలకులు జాతిపిత గాంధీజీ వారసులమని చెప్పుటకు, సిగ్గుబిడియాలు లేకుండా బరితెగించి చెలామణీ అవుతున్నారు.**

**అసలు స్వతంత్రభారతంలో ప్రభుత్వం ఉన్నదా? పరిపాలన జరుగుతోందా? గమనించాలి. "రౌతు 'కొద్దీగుర్రం" అని మన పెద్దలు అన్నట్లు పాలకులననుసరించి ప్రభుత్వ యంత్రాంగం నడుస్తుంది. ప్రజల ప్రాణాలతో చెలగాటమాడే పాలకులను బట్టే పాలనాయంత్రాంగం పనిచేస్తుంది.**

సామ్రాజ్యవాదుల "విభజించి పాలించు"అనే కుట్రతోనిండిన విధానం మన స్వతంత్ర భారత పాలకులు అవలంబించటం ఎటువంటి దేశభక్తి ? హేయమైన, జుగుప్సాకరమైన రాజ్యనీతితో, ప్రజలను ఇంకా, ఇంకా దోచుకొనుటకై కుర్చీలకోసం, సింహాసనాల కోసం, నువ్వు దొంగ అంటే నీవు దొంగ అంటూ ప్రకటనలతో పెనుగులాటలు, ప్రజల నవనాడులు క్రుంగదీసే బ్రాందీ, సారాల వ్యాపారంతో ఖజానా నింపుకుంటున్న పాలకులు జాతిపిత గాంధీజీ వారసులమని చెప్పుటకు, సిగ్గుబిడియాలు లేకుండా బరితెగించి చెలామణి అవుతున్నారు. స్వతంత్రం వచ్చిన 5నెలలకే మహాత్ముని హత్యతో దేశం దద్దరిల్లింది. హిందూ ముస్లింభాయి భాయి అన్నందుకే జాతిపిత గాంధీజీని హత్యచేసారు. గాంధీజీ వారసుల మని చెప్పుకునే పాలకులు, ఆయన ఆశయాలనే ఖూనీ చేస్తూ, గాంధీబమ్మను పెట్టుకొని, ప్రజలను నిలువునా మోసంచేస్తూ, అవినీతి, కుంభకోణాల భారతంగా గిన్నీస్‌బుక్‌లోకి ఎక్కుతోంది. లక్షల కోట్ల ధనరాశులతో కేజీల టన్నుల బంగారం గుట్టలతో కుబేరుల రాజ్యాన్ని తలపిస్తున్నారు.

అసలు స్వతంత్రభారతంలో ప్రభుత్వం ఉన్నదా? పరిపాలన జరుగుతోందా? గమనించాలి. "రౌతు 'కొద్దీగుర్రం" అని మన పెద్దలు అన్నట్లు పాలకుల ననుసరించి ప్రభుత్వ యంత్రాంగం నడుస్తుంది. ప్రజల ప్రాణాలతో చెలగాటమాడే పాలకులను బట్టే పాలనాయంత్రాంగం పనిచేస్తుంది. ఉదాహరణకు ఇటీవల బీహార్‌లో స్కూలులో ప్రభుత్వం పెట్టే భోజనం విష పూరితమై 23మంది చిన్నారి విద్యార్థులు చనిపోవటం. అంతటి ఘోరకలికి కారణమైన స్కూలు యాజమాన్య బాధ్యతారాహిత్యం, అత్యంత నిర్లక్ష్య వైఖరికి నిదర్శనం. ఇదే వైఖరి, ప్రభుత్వ పాలనా విభాగాలన్నింటా సాగిపోతోంది. అట్లే పాలనా యంత్రానికి నట్లు( బోల్టులు) లేవు. పూర్తి స్వేచ్ఛారాజ్యం అన్న మాట. ఎవరు ఎంత దోచుకున్నా అడిగే దిక్కు లేదు. ఇటీవల సి.బి.సి.ఐ.డి. డిపార్టుమెంటు పుణ్యమా అని ధనదాహం తారాస్థాయిలో పెరిగిపోతున్న కుబేర సంతతి దేశ ప్రజలకు పరిచయమయ్యారు.

అభ్యుదయవాది, ఆదర్శవిద్యావేత్త చుక్కారామయ్యగారు (మాజీ ఎమ్.ఎల్.సి) ప్రభుత్వ సిబ్బందికి చెప్పిన హితవు"వసతి గృహాల్లోని విద్యార్థులను తమ ఇంటి బిడ్డలవలే భావించి తల్లి మాదిరిగా అన్నంపెట్టండి ప్రేమతో వడ్డించండి" అని ప్రకటించారు. ఇంకా ఆయన, "అఘాయిత్యాలు జరిగినప్పుడు హడావిడి చేస్తారు. తర్వాత మామూలే" అన్నారు. కాని జవాబుదారీ లేని ప్రభుత్వ పథకాలకు, వాటిని అమలు చేసే ప్రభుత్వం యంత్రాంగం కూడా అట్లే పనిచేస్తుంది. రౌతు కొద్దీ గుర్రం అంటే అదే అర్థం.

అందుకే జాతిపిత మహాత్మాగాంధీ "నా కొద్దు ఈ స్వతంత్ర్యం, నేను కోరుకున్నది. ఈ స్వతంత్రంకాదు" అని 1947 ఆగస్టు 15 స్వతంత్రోత్సవాలకు హాజరుకాలేదు. ఇంట్లోనే మౌనంగా ఉండి పోయారు. ఈ సంగతి పాలకులకు గుర్తు చేయాలి. ఇంకా ముఖ్యంగా కేవలం స్వాతంత్ర్యం సాధించుట కొరకే ఈ కాంగ్రెసు సంస్థ పాత్ర. పరిపాలనకు పనికి రాదు. స్వాతంత్ర సాధన జరిగాక ఈ కాంగ్రెస్‌ను రద్దు చేయమని" గాంధీజీ స్పష్టంగా ప్రకటించినట్లు గాంధీజీ తన ఆత్మకథలో వ్రాసుకున్నారు. ఆయన సలహాలు అమలు చేయలేదు. దాన్కి నిదర్శనవే ప్రపంచంలో కెల్లా సిరిసంపదలు పాడి పంటలు గల బంగారు భారతానికి పట్టిన దుర్గతి. అంటే నేటి స్వతంత్ర భారతంలో కోట్లాది ప్రజలు ఆకలి పేదరికంలో, నిలవనీడ లేక రోడ్ల ప్రక్కఫుట్‌పాత్‌లపై నిద్రిస్తున్నారు. వృద్ధులు, పసిబిడ్డలతో స్త్రీలు చలిలో, మురికిలో, వానలకు ఎండలకు అల్లాడే అభాగ్యులు దీనజనులు కలిగిఉన్న భారతాన్నా?

ముఖ్యంగా దేశవ్యాపితంగా అసెంబ్లీల్లో, పార్లమెంటులో అవినీతి అభియోగాలు ఎదుర్కొంటున్న అధినేతలు, ప్రజాప్రతినిధులు, 700 మంది ఉన్నట్లు న్యాయవ్యవస్థ లెక్కలు చెబుతున్నది. వీరేనా దేశాన్ని కాపాడేవారు ? అభివృద్ధి చేసేవారు?

ఒకవైపు జాతీయతను సామ్రాజ్య వాదులకు తాకట్టుపెడుతున్నారు. దేశ స్వతంత్ర సార్వభౌమత్వంకోసం సర్వస్వం ఒడ్డి అశేష త్యాగాలు చేసిన భారత ప్రజల కష్టార్జితం అయిన దేశ సార్వభౌమత్వాన్ని కొల్లగొడు తున్నారు. దీన్ని తుదముట్టించేందుకు అంతకంతకు దీన, హీన స్థితికి దిగజారి పోతున్న ధన స్వామ్య దుష్ట విధానాలకు తల్లడిల్లే భారతమ్మ తనబిడ్డల్ని మేల్కొల్పాలి. నిద్రాణమైన చైతన్యశక్తి, ఆనాటి త్యాగధనుల చరిత్ర తిరిగి ప్రారంభమవ్వాలి. చైతన్యభారతి తాను కలలు గన్న బంగారు భవితను సాధించాలి. రాబోయే మరో స్వాతంత్రోద్య మంలో, జాతికే జన్మనిచ్చిన తల్లుల త్యాగ శక్తి ముందు నిలవాలి. భావితరం నిజమైన స్వతంత్ర సార్వభౌమత్వం కోసం, నవభారత నిర్మాణం కోసం సన్నద్ధమవ్వాలి. మహనీయు లందరూ ఉద్బోధించిన సమసమాజకేతనం ఎగరేస్తారు. ఇది అనివార్యం. అజేయం. ప్రకృతి సహజం. అందుకే అవినీతి, దోపిడే శక్తులను అంతం చేసే మరో స్వాతంత్ర్యోద్య మాన్ని స్వాగతిద్దాం....

## బాలకార్మికత

గణేష్ ! చిన్న మాట ఉంది వినరా!
నీవు చదువుకోరా ముందరా
పనికెందుకురా తొందరా
పిల్లలు బడికి ముద్దురా
పనికి వద్దురా
డబ్బు లేదని చింతేలరా
ఖర్చులేని బడి ఉందిరా
ప్రాథమిక పాఠశాలలో చేరరా
మంచి క్రమశిక్షణలో మెలగరా
బద్ధకం నీకేలరా
కష్టపడి తెలివిగా చదవరా
స్కాలర్‌షిప్‌లెన్నో పొందరా
చదువే నీకు ముద్దురా !
గణేష్! నా మాట వినరా!!

- పి. హేమమాలిని
7వ తరగతి

వాస్తవం

# నేను, నా మోకాలు

- పి.రమ

నేను మోకాళ్ళ నొప్పితో గత కొంతకాలంగా బాధపడుతున్నాను. చివరకు ఒకరోజు ఫ్రీ ఆర్థో చెకప్ వుంది అంటే వెళ్ళి చెకప్ చేయించుకున్నాను.బాగా అరిగిపోయి డామేజ్ అయినవి మోకాళ్ళ జాయింట్ రీప్లేస్‌మెంట్ ఆపరేషన్ ఎంత తొందరగా చేయించుకుంటే అంత మంచిది అని డాక్టర్ చెప్పారు. వెంటనే మా శ్రీవారు ఎంత ఖర్చు అవుతుంది దాని వివరాలు ఏమిటి అని వాకబు చేసినారు. నేను కూడా వెంటనే Sun Shine లో డా॥ గురవారెడ్డి దగ్గరే చేయించుకుంటాను అని చెప్పాను. ఇంతకీ చెప్పవచ్చేది ఏమంటే ఇంతకు ముందు ఆపరేషన్ చేయించుకున్న వారి దగ్గర వివరాలు అడిగి తెలుసుకున్నాము. 8వ తారీఖున Sun Shine కి వెళ్ళాము. డా॥ గురువారెడ్డిగారు కూడా రెండు మోకాళ్ళు చేయించుకుంటే మంచిది అని చెప్పినారు. నేను కూడా రెండు మోకాళ్ళు చేపించుకుందామని మెంటల్‌గా ప్రిపేర్ అయ్యాను. మాకు ఏప్రియల్ 10వ తారీఖున ఆపరేషన్ తేది ఇచ్చినారు. ఆరోజు అమావాస్య కాబట్టి చాలా మంది ఆపరేషన్ చేయించుకోవడానికి ఇష్టపడటం లేదు అని తెలిసింది. ఒక మంచి పని చేయాలి అని అనుకున్నప్పుడు అమావాస్య, పౌర్ణమి అని కాలయాపన చేయకుండా వెంటనే దాన్ని అమలు పరచాలి. అలా నేను ఎక్కువ రోజులు టైమ్ తీసుకోకుండా ధైర్యంగా నిర్ణయించుకున్నందుకు ఇప్పుడు గర్వపడుతున్నాను. 10వ తారీఖు ఉదయం ఆపరేషన్ చేశారు. ఆపరేషన్ జరిగినంత సేపు నాకు మెలకువగానే ఉన్నది. అన్ని శబ్దాలు వినిపిస్తూనే ఉన్నాయి. ఆపరేషన్ తర్వాత ఐ.సి.యు.లోకి తీసుకువెళ్ళారు. రెండవరోజు ఫిజియోథెరపీ డాక్టర్స్ వచ్చి నిలబెట్టినారు. ఆ నిలబడటం ఎలా సాధ్యమైందో నాకు తలచుకుంటే ఇప్పటికీ ఆశ్చర్యంగా ఉంటుంది. నొప్పులు మాత్రము విపరీతంగా ఉన్నాయి. నరకము అంటే ఇలాగే ఉంటుందేమో అనుకున్నాను. ముందుగానే ప్రిపేర్ అయ్యాను కాబట్టి ఆ



నొప్పులు భరించాను. పైగా నిద్ర కూడా పట్టదు. నిద్రకు ఇంజెక్షన్ చేసినా నిద్ర పట్టేదికాదు. ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురు చూస్తూ ఉండేదాన్ని. ఆపరేషన్ అయిన 5వరోజు డిశ్చార్జి చేసారు. అసలు ఇలాంటి సమయాలలో కుటుంబసభ్యుల సహాయసహకారం చాలా అవసరం. ఆ సహకారాలు నాకు సమృద్ధిగా లభించాయి కాబట్టి నేను తొందరగా కోలుకున్నాను. మా ఆయన దాదాపు 40 రోజులు లీవ్ పెట్టినారు. అన్ని రకాల సపర్యలు చేసారు. ఇక్కడొక విషయం చెప్పాలి. అసలు మన మహిళల ఆలోచనా విధానంలో మార్పు రానిదే సమాజంలో మార్పురాదు. మా ఆయన సెలవు పెడితే చాలా మంది పాపం! ఆయన సెలవు పెట్టుకొని కష్టపడుతున్నాడు అనేవాళ్ళు. అంటే భర్తకు బాగాలేకపోతే భార్య సెలవు పెట్టి సపర్యలు చేస్తే అది ఆమె బాధ్యత అంటారు. అదే భార్యకు బాగా లేనప్పుడు భర్త ఆ పని చేస్తే పాపం అని ఆలోచిస్తారు. మరి భర్త చేయకపోతే ఎవరు చేస్తారు. అని ఎందుకు ఆలోచించరు? ఇంతకీ ఆ ఆపరేషన్ నొప్పులు దాదాపు 3నెలలవరకు రోజుకోవిధంగా బాధ పెట్టినాయి. తరువాత క్రమేణా తగ్గుతూ వచ్చినాయి. నిద్ర కూడా బాగానే పడుతుంది. నడక మామూలు స్థితికి రావటానికి 6నెలలు టైమ్ పడుతుంది అని డాక్టర్‌గారు చెప్పారు.

ఆపరేషన్ తరువాత జీవితంలో రెండోసారి నడక నేర్చుకున్నట్లుంది. నా ఆపరేషన్ పుణ్యమా అని మా ఇంట్లో అందరూ (మా ఆయన, మా అమ్మాయిలు) వంట పర్‌ఫెక్టుగా నేర్చుకున్నారు. నాకు ఎప్పుడూ ఒక కోరిక ఉండేది ఎప్పుడూ నేనే వండుకొని నేనే తినేకన్నా ఎవరన్నా వండిపెడితే తినాలి అని. ఆకోరిక ఈ విధంగా తీరింది. మా వాళ్ళు నాకన్నా బాగా వండేస్తున్నారు. ఏదైన అవసరమే మనిషికి అన్నీ నేర్పిస్తుంది. ఇక్కడ ఒక ముఖ్య విషయము ఏమిటి అంటే ఆడవాళ్ళు ఇంట్లో అందరికీ సపర్యలు చేయటమే కాదు అవసరము వచ్చినపుడు వారి చేత హక్కుగా చేయించుకోవాలి.

## చల్లని అమ్మ!

అమ్మా !
చిన్నప్పుడు చందమామను చూపిస్తూ,
నువ్వు తినిపించిన గోరు ముద్దలను
ఏలామరిచి పోతాను ?
రాత్రుళ్ళు నన్ను నిద్ర పుచ్చడానికి
నువ్వు పాడే జోల పాటలను
ఎలా మరిచిపోతాను ?
క్రింద దించితే నాకాళ్ళు ఎక్కడ
కందిపోతాయోనని
ఎప్పుడు ఎత్తుకుతిరిగే ఆరోజులను
ఎలా మరిచి పోతాను ?
నేను మాట్లాడే ముద్దుముద్దు మాటలకు
ఎంత మురిసి పోయే దానివో
ఎలా మరిచిపోతాను ?
నాజీవితంలో వచ్చిన ఆటుపోటులకు
నేనెక్కడ కృంగిపోతానోనని
నాకు కొండంత అండగా వుండేదానివి
నాజీవితాన్ని నల్లేరు మీద నడకలా
సాగిపోయేటట్లు చేశావు
నన్ను ఒక్కక్షణం చూడకుండా వుండేదానివి
కాదు
నన్ను విడిచి ఎలా వెళ్ళావమ్మా ?
ఒక్కసారి నీ చల్లని ఒడిలో సేదతీరాలని
ఉందమ్మా !

- ఎస్.ఎస్. లక్ష్మీదేవమ్మ

కథ

# శ్రామిక వలసలు

– మల్లెమాల వరలక్ష్మి

పిల్లవాడేడుస్తున్నాడు. వీధి కుక్క అరుస్తూంది. కొంగుచాటున రొమ్ము అందించి పాలుతాపుతూ......ఆమె.

మా ఇంటికి ఎదురుగా నిర్మిస్తున్న మూడంతస్తుల భవనానికి ఇసుక, ఇటుక మోస్తూ.....ఇరవై ఏళ్ళకు మించని అమ్మాయి. రోజువారీ కూలి. వారం రోజులుగా నేనామెను గమనిస్తున్నాను. ఏడాది పిల్లవాణ్ణి చంకలో వేసుకొని, భుజాన పాతచీర, ఇంకో భుజానికి సంచి వేలాడుతూ ఎడమచేత్తో సత్తు తూకలో గంజి అన్నం....ఉదయం ఎనిమిది కల్లా హాజరేసుకుంటుంది. ఇంటి ముందున్న గానుగ చెట్టుకి చీరను ఉయ్యాల కట్టి బిడ్డకు పాలిచ్చి అందులో వడుకోబెట్టి నిద్రవుచ్చుతుంది. మేస్త్రీ వచ్చి పని పురమాయించగానే నెత్తికి గోళమెత్తి ఇసుక, ఇటుకలు మోస్తుంది. మధ్య మధ్యలో పిల్లవాడు ఏడిస్తే పాలు పడుతుంది. ఆరోజు వాడు ఎక్కువ ఏడుస్తున్నాడు. ఆకలికాబోలు. వాడు ఉయ్యాల్లో లేచికూర్చున్నాడు. వాణ్ణి దింపి, నంచిలో దాచుకున్న అరటిపండు తినిపించింది.

"తమ్మక్కా! ఏందమ్మే! ఇట్టాగైతే ఎట్టా? ఎప్పుడూ నీ బిడ్డసోదేనా? రేపట్నుంచి నువ్వు పన్లోకి రావద్దు" మేస్త్రి అరచి చెపుతున్నాడు.

"లేదులేన్నా! వొచ్చేస్తున్నా!"

"వాణ్ణి ఇట్టా ఇచ్చి నువ్వు పోవే...నేను పడుకోబెడుతా" సహకూలీ సహకారం. తల్లిపాలు తాగి బొద్దుగా, ముద్దుగా ఉన్నాడు. చిరిగిన బనీను, మొలకు గోచీ.

" తమ్మక్కా! వాణ్ణి తెచ్చి మా వరండాలో కూర్చోబెట్టిపో...నేనాడిస్తా"

"మేడమ్..మీరా? వద్దు మేడమ్...మాకిది అలవాటే"

"లేదు...లేదు...వాణ్ణిటివ్వు" గేటుతీసి ఆమె చేతిలో బిడ్డను అందుకున్నాను. ఆ అమ్మాయి కంటనీరు

"ఎందుకే ఆ కన్నీళ్ళు"

"కంట్లో ఇసకబడింది మేడమ్" చీరకొంగుతో కళ్ళు తుడుచుకుంది. నాకు తెలుసు. కంట్లో నలక కాదు. చెప్పుకోలేని, ఎదలో దాగిన ఆమె బాధ పొంగిన కంటతడి అది. వాణ్ణి వరండాలో కూర్చోబెట్టి బిస్కెట్ ప్యాకెట్ విప్పి చేతికందించాను. తింటున్నాడు, చొల్లు కార్చుకున్నాడు....ఇంట్లో ఉన్న చిన్న టీషర్టు, నిక్కరు తెచ్చి వాడికి డ్రస్ మార్చి తొడిగాను.

సూర్యుడు నడినెత్తిమీద మండుతున్నాడు. వాణ్ణి హాల్లోకి తెచ్చి దుప్పటి పరిచి పడుకోబెట్టాను. నిద్రపోయాడు. లక్ష్మి వచ్చి అంది "మేడమ్! వీణ్ణి నేను చూసుకుంటాను. మీరెళ్ళి భోంచెయ్యండి" లక్ష్మి మా వంటమనిషి.

"లక్ష్మీ! ఈ తమ్మక్క సంగతులేమైనా నీకు తెలుసా?"

"మొన్ననే చెప్పింది మేడమ్ ... నాకతలాంటిదే..వీళ్ళది కదిరి. పదహారేళ్ళకే మేనమామకిచ్చి పెళ్ళి చేశారు....మొగుడు తాగుబోతు. బేల్దారి కూలీ...మొగోడుగదా...వీణ్ణి పుట్టించాడు...ఈ పిల్లా కూలికిపోతుంది. వాడు తాగొచ్చి దీన్ని కొడతాడు. ఈ పిల్ల కూలి డబ్బులు కూడా లాక్కుంటాడు... ఇదిగో ఇప్పుడు.... ఈ బిల్డింగ్ మేస్త్రీ కదిరి వెళ్ళి ఒక బ్యాచీ కూలోళ్ళని తోలుకొచ్చాడు. వాళ్ళతో పాటు ఈ పిల్లనూ తరిమాడు మొగుడు. జైలు దగ్గర గుడిసెల్లో వీళ్ళ గతుకుల, బతుకులూ..వాడొచ్చి ఎప్పుడు దీన్ని తన్ని డబ్బులు గుంజుకుని పోతాడోనని భయంతో ఉంది". నాకూ చాలా విషయాలు తెలిసాయి. నాలుగేళ్ళ క్రితం మొగుడొదిలేసాడని మా పంచన వచ్చి చేరింది లక్ష్మి.

మా వారు ఆఫీసు పనిమీద నెల రోజులు ఢిల్లీ క్యాంపు....అమ్మాయి, అల్లుడు బెంగుళూర్లో....అబ్బాయి అమెరికాలో...నేనూ లక్ష్మి....ఇద్దరమే ఇక్కడ. కూర్చుని ఆలోచిస్తున్నాను. ఈ శ్రామిక మహిళల దైన్యస్థితి, ఈ దోపిడీ దళారుల వ్యవస్థ....భవనాలు అంతస్తులు మించుతున్నాయి. రాళ్ళెత్తే కూలీల బ్రతుకులు రాలిపోతున్నాయి. అంతు చిక్కని సమాధానం.

సాయంకాలమైంది. బట్వాడా తీసుకుని, ఒళ్ళంతా కమ్ముకున్న ఇసుక, సిమెంటు వీధి కుళాయి నీళ్ళతో కడుక్కుని, నిద్రపోతున్న పిల్లవాణ్ణి భుజానేసుకుని ...పోబోతూ

"మేడమ్! రేపు ఆదివారం...పనిలేదం..మీకేమైనా పనిజెయ్యాలంటే ప్రొద్దున్నే వస్తా...చెప్పండి".

"వచ్చేయ్! వచ్చేయ్....తప్పకుండా వచ్చేయ్ బిల్డింగ్ పని మానెయ్ నీ గుడ్డా..గోచీ సర్దుకుని వచ్చేయ్...లక్ష్మికి సహాయంగా ఇంటిపని చేసుకో...ఇంటి వెనక సర్వెంటు క్వార్టర్స్‌లో లక్ష్మితోపాటు ఉండిపో...వీడు నాకు తోడు...."

వాడి తలనిమిరాను.

తమ్మక్కా! బిడ్డను నాకాళ్ళమీద పడేసి నా కాళ్ళకు మొక్కింది.

ఆ అమ్మాయి కళ్ళనిండా కృతజ్ఞతా భావం...అభయం దొరికిన తృప్తి నా హృదయమూ చల్లబడింది.

**(చైతన్య మానవి దశాబ్ది ప్రత్యేక సంచిక విడుదల సందర్భంగా నిర్వహించిన కథల పోటీల్లో సాధారణ ప్రచురణకు ఎంపికైన కథ)**

## అమ్మ

అమృతం కన్నా తీయనైంది అమ్మ
సమాజంలో నాకిష్టమైంది అమ్మ
నా ఆనందం కోరేది అమ్మ
నన్ను కన్నది కూడా అమ్మే
మంచు కన్నా చల్లనైంది అమ్మ
అమ్మ లేనిదే జన్మే లేదు.
జన్మ వద్దు అనుకుంటే జీవితమే లేదు

## గురువు

గురవంటే కొందరికి బరువు
గురువు లేకపోతే చదువే కరువు
చక్కగా పాఠాలు చేప్తే గురువుకుంటుంది
పరువు
గురువు గారి మాట వినకపోతే ఉంటుంది
మాకు దరువు.

-పి. హేమమాలిని

అవగాహన సందర్భం

# బజారుల్లో కొనలేనివి

- శిలాలోలిత

'ప్రతి సమస్యకు పరిష్కారముంటుంది. పరిష్కరించలేనివంటూ ఏమీ ఉండవు. గందరగోళం పడటంవల్ల సమస్య క్లిష్టమౌతుంది. కాబట్టి సమస్యను పరిష్కరించుకోవడమే జీవితం'

ఈ రోజు ఉదయంనుంచీ వానకురుస్తూనే ఉంది. మనసుకూడా తడితడిగా ఉంది. ఎందుకో ఈ ఆగని నీళ్ళని చూస్తూంటే విశాలాక్షి గుర్తొస్తోంది. బతుకంతా ఎదురీదిన ఒంటరి నావ ఆమె. ఆరోజుల్లోనే డిగ్రీవరకూ చదివింది. ఉద్యోగస్తురాలైంది. ఎంతో చురుగ్గా,ఉత్సాహంగా ధైర్యంగా జీవితంలో ఎదురైన అనేక అడ్డంకుల్ని అవలీలగా దాటేసింది. చిరునవ్వును కోల్పోలేదు. జిడ్డు కృష్ణమూర్తి ఫిలాసఫీని ఒంటబట్టించుకొంది. 'ప్రతి సమస్యకు పరిష్కారముంటుంది. పరిష్కరించలేనివంటూ ఏమీ ఉండవు. గందరగోళం పడటంవల్ల సమస్య క్లిష్టమౌతుంది. కాబట్టి సమస్యను పరిష్కరించుకోవడమే జీవితం' అనుకునేది. ఆమె జీవితంలోని ప్రతి అధ్యాయమూ రాస్తే వెయ్యి పేజీలైన సరిపోవు.

అలాంటి విశాలాక్షిని ఈ మధ్యే కలిశాను. ఆశ్చర్యం ఆమె ఆమెకాదు. నేను నమ్మలేకపోయాను. మానసికంగా బలహీనమైపోతే, దాని ప్రతిఫలాలు శరీరంపై ఎలాపడ్తాయో తెల్సింది. నూరేళ్ళ వృద్ధురాలిలా ఉంది. ముఖ్యంగా చిరునవ్వు లేదు. విశాలాక్షితో మాట్లాడిన తర్వాత నిశ్శబ్దంగా అయిపోయాను కొంతసేపటివరకు.

విశాలాక్షి ఎంతటి స్నేహశీలో, సహాయకారో, ఎన్నెన్ని మంచి పన్లు చేసిందో,ఎంతటి అననుకూలవాతావరణాన్నైనా అనుకూలంగా మలుకుచుందో నాకు తెలుసు. నాలుగేళ్ళ క్రితం విశాలాక్షి శరీరంపైకి దొంగదాడికి 'కాన్సర్' దిగింది. ఇక షుగరూ, బి.పి.థైరాయిడ్ మొదలైనవన్నీ అదనంగా వచ్చి చేరాయి. విశాలాక్షి శరీరమంతా గాయాలమయమే. ఐనా సహజంగానే తీసుకుందామె. ఎదుర్కోవడానికే ప్రయత్నించింది. తమ గురించి తాము తక్కువగా పట్టించుకొనేవాళ్ళకే ఇన్ని వ్యాధులొస్తాయా అన్పించింది. సమాజంకోసం, కుటుంబంకోసం ఏకకాలంలో శ్రమించిన నిరంతర శ్రామికురాలు ఆమె.

ఇప్పుడు వచ్చిన సమస్యల్లా ఇంట్లోనే. ఇద్దరు కొడుకులు ఒక కూతురు. అందరికీ పెళ్ళిళ్ళయిపోయి, ఇద్దరిద్దరు పిల్లల్తో సెటిలయిపోయారు. ఇప్పుడు వాళ్ళందరికీ



విశాలాక్షి బరువైపోయింది. ఆమె నెవరు చూడాలి ? డాక్టర్ల చుట్టూ హాస్పటళ్ళ చుట్టూ తిప్పాలి. డబ్బు లెవరు పెట్టాలి ? అంతటైం ఎవరికుంది ? ఎవరిజీవితాలు వాళ్ళకైపోయాయి కదా ! ఇన్నాళ్ళు ఆమే అన్నీ చేసుకున్నానని గొప్పగా ఫీలవుతుందికదా ! ఇప్పుడు కూడా ఆమె చేసుకుంటే బాగుంటుంది అన్న అభిప్రాయంతో, సూటిపోటిమాటలతో గాయపరుస్తున్నారు. చుట్టాలముందు, స్నేహితులముందు ఒకలా, ఒంటరిగా ఉన్నప్పుడు ఒకలా వాళ్ళ ద్వంద్వ ప్రవృత్తిని విశాలాక్షి భరించలేకపోతోంది. మానసికంగా దెబ్బతింది. తను పెంచిన మొక్కలే ఇలా విషవృక్షాలవుతాయనేది ఆమె ఊహకందని విషయం.

ఇది ఒక్క విశాలాక్షి సమస్యేకాదు. మనం చుట్టూ చూస్తే చాలామంది ఇళ్ళల్లోని దృశ్యమే ఇది. బతుకంతా పాటుపడి పిల్లల్ని పెద్దచేసి, బాధ్యతలన్నీ నెరవేర్చాక వాళ్ళకు 'కరివేపాకు' స్థానాన్నిస్తుంటే ఎలానో అన్పిస్తోంది. ఆలోచిద్దాం. ఎందుకిలా జరుగుతోంది. మనుషులమైన మనం, మానవత్వం ఉందనుకుంటున్న మనం, తల్లి దండ్రులపట్ల ఎందుకిలా ప్రవర్తిస్తున్నాం. చెప్పేదొకటి, చేసేదొకటిలా ఎందుకు తయారవుతున్నాం. 'ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును'-లాంటి విషయాల్ని ఎందుకని కావాలని మర్చిపోతున్నాం. చాన్నాళ్ళక్రితం 'తాతా -మనవడు' అనే సినిమా ఒకటి వచ్చింది. అందులో కొడుకు తండ్రి కోసం గొయ్యి తవ్వుతుంటే మనవడు (చిన్నకుర్రాడు) కూడా గొయ్యితవ్వడం మొదలుపెడ్తాడు. నువెందుకు తవ్వుతున్నావని తండ్రి ప్రశ్నిస్తే, నువ్వు తాతకు తవ్వుతుంటే, రేపు నేనుకూడా నీకు తవ్వాలికదా ! అందుకని ఇప్పట్నించే మొదలు పెట్టాను' అంటాడు.

మనం నేర్పిన విలువలు, చూపిన దారుల్లోనే పిల్లలు నడుస్తారనేది నిజం. కానీ విశాలాక్షిలోని మంచితనం ఎవరికీ రాలేదు.

చాలా సంకుచితంగా, తమవరకే ఆలోచించుకుంటూ, డబ్బుసంపాదనే ధ్యేయమనుకుంటూ, ఓల్డ్ఏజ్‌హోమ్‌లో పడుండాలి ముసలాళ్ళంతా ఇలా ఇళ్ళల్లోకాదు. చాదస్తాలు పెరిగిపోతాయి. అన్ని విషయల్లోకి చొరబడుతుంటారు. ప్రైవసీ ఉండదు. సోదంతా చెబుతుంటారు. భరించడం కష్టం. వేగమైన జీవితంలో పాకుడురాళ్ళలా నిలబడిపోయి వుంటారు. డబ్బులు పడేస్తాం కావాలంటే, ఓల్డ్ ఏజ్‌హోమ్‌లోనే బెస్ట్. వాళ్ళే చాలా బాగా చూసుకుంటారు. డాక్టర్లు కూడా వస్తారు. చచ్చిపోవడం తప్పదని తెలిసాక రాజీపడిపోవాలి. ఫోన్‌వస్తే తప్పకుండా అటెండయ్యి కర్మకాండలన్నీ చేస్తాంకదా ! వీడియోలు కూడా తీసి విదేశాల్లో ఉన్నవాళ్ళకు పంపుతాం. సర్దుకుపోవాలి. అంతేకాని కుటుంబసభ్యులను నలుగురిలోను బ్లేమ్ చేయకూడదు.

ఈమాటలన్నీ విన్నాక మనసు చితికిపోయింది. మానవత్వం కనుమరుగౌతున్న తరాన్ని చూసి బాధనిపించింది. మీరేమంటారు ? మన ఇళ్ళల్లోనే అమ్మానాన్నలుంటే బాగుంటుందికదూ ! వృద్ధాప్యంలో, శరీర నిరాకరణ సందర్భంలో, అశక్తతతో వున్న వాళ్ళకు కావాల్సింది, ప్రేమ, ఆదరణ, ఆప్యాయత మాత్రమే. అవి బజార్లో కొనుక్కుంటే దొరికేవి కావు. హృదయాల్లోంచే రావాలి. వృద్ధుల కన్నీళ్ళతో తలగడలు గడ్డకట్టొద్దనేదే నా ఆకాంక్ష. •

పుస్తక సమీక్ష

# సాంప్రదాయ జీవిత - వికసిత

- వొరప్రసాద్

సంప్రదాయ పద్మవ్యూహం ఛేదించుకొని జీవితాన్ని వికసింపచేసుకున్నారు వకుళాభరణం లలిత. 'నా జ్ఞాపకాలు-క్షేత్ర పరిశోధనలో అనుభవాలు' పేరిట ఆమె రాసిన పుస్తకాన్ని ఎమెస్కో, ప్రచురణ సంస్థ వెలువరించింది. మధ్యతరగతి సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలోని మహిళ ఆధునిక భావజాలానికి ప్రతినిధిగా పరివర్తన చెందిన తీరు ఈ పుస్తకం ద్వారా మన కళ్ళకు కడుతుంది. వకుళాభరణం లలిత జీవిత పరిణామం ఈ పుస్తకం నిండా పరుచుకుని అనేక కోణాలను పాఠకుడి ముందు ఆవిష్కరిస్తుంది. ఒక మహిళగా ఆమె సమస్యలను ఎదుర్కొన్న తీరు అభినందనీయం. గృహిణిగా, అధ్యాపకురాలిగా, పరిశోధకురాలిగా ఆమె వ్యక్తిత్వం ఎంత బలమైనదో ఈ పుస్తకం చాటి చెబుతుంది. పాత సంప్రదాయాలు, ఆచారాలు మహిళల వికాసానికి ఎంత ఆటంకంగా ఉంటాయో అందరికీ తెలిసిందే. అటువంటి అనేక ప్రతిబంధకాల మధ్య ఒక స్త్రీ కొన్ని లక్ష్యాలను సాధించడం అంటే సాధారణ విషయంకాదు. వ్యవస్థ మొత్తం పురుషుడి కార్యకలాపాలకు అనుగుణంగా రూపొందడంతో పురుషుడి విజయం సులభమవుతుంది. అటువంటి సమాజంలో ఒక మహిళ సామాజిక కార్యకలాపాలలో పాలుపంచుకుని తన వ్యక్తిత్వాన్ని తగినంతగా ప్రదర్శించడానికి అవకాశాలు తక్కువగా ఉంటాయి. తనకున్న సానుకూల అంశాలను ఆధారం చేసుకుని సంకల్పబలంతో కొన్ని సాధించగలుగుతారు కొందరు. ఆ కోవకి చెందినవారు వకుళాభరణం లలిత.

నెల్లూరు జిల్లాలో మారుమూల చిన్న గ్రామానికి చెందిన వకుళాభరణం లలిత స్ఫూర్తి కలిగించే జీవితాన్ని సొంతం చేసుకోగలిగారు. కుటుంబ నేపథ్యం వల్ల చదువుకు అవకాశం కలిగింది. స్వాతంత్ర్యం వచ్చిన తొలినాళ్ళలో చదువుకునే స్త్రీల సంఖ్య చాలా పరిమితం తనమాటల్లో ఆ విషయం చెప్పారు "1950వ దశకంలో ఆడపిల్లలు కళాశాలలో చదువుకోవడమనేది అరుదుగా ఉండేది. అంతకుముందు చదువుకోవటం అంటే దేవదాసీలుగా ఉన్న స్త్రీలు ముందడుగు వేసి చదువుకునేవారు. "నేను నెల్లూరు జిల్లా, కావలి కళాశాలలో ఇంటర్మీడియేట్‌లో చేరినప్పుడు 120 మంది విద్యార్థులలో 7మందిమి మాత్రమే విద్యార్థినులం" ఆ తర్వాత డిగ్రీలో చేరినప్పుడు ఇద్దరమే ఉన్నాం" అంటూ రాశారు. ఈ నేపథ్యం మహిళల చదువుకు ఎంత ఇబ్బందికర పరిస్థితులు




ఉండేవో మనకు తెలియజెప్తుంది. అసలు ఆడపిల్ల చదువుకు సంసిద్ధం కావడం ఒక అంశం అయితే అందుకు అనుకూల పరిస్థితులు ఉండటం అనేది మరో కీలకమైన అంశం. మరోచోట 'ఆడపిల్లలకు ఆ రోజుల్లో చదువుకోవటం అంటే అంత సులువు కాదు. ఎన్నో ఒడిదుడుకులు, సూటిపోటీ మాటలనే బంధువులు. అయితే ఎన్ని ముళ్ళున్నా గులాబిని వదులుకోలేం గదా" అని రాస్తారు. యాభై దశకం నుండి ఈ రోజు వరకు పరిణామాల్ని చూస్తే ఈ అరవై ఏళ్ళ కాలంలో వచ్చిన మర్పులెన్నో. అప్పటి మహిళల పరిస్థితిలలో నుండి ఈనాటి మహిళలకు ఉన్న అవకాశాలను పోల్చినప్పుడు చాలా వ్యత్యాసం కనపడుతుంది. సామాజికంగా మహిళలు పాల్గొనటం పెరిగింది. అదే స్థాయిలో మహిళలు ఎదుర్కొంటున్న తీవ్ర సమస్యలు చాలా ఆందోళన కలిగిస్తున్నాయి. ఆ కాలం నాటికి నెలకొన్న సామాజిక స్పృహ, సేవా దృక్పథం, కొన్ని మానవతా విలువలు నేడు అడుగంటి పోవడం చూస్తున్నాం. మరో కోణంలో చూస్తే తరతరాలుగా అణిచివేయపడ్డ మహిళలు, దళితులు, తదితర సామాజిక వర్గాలకు సామాజిక కార్యకలాపాలలో భాగస్వామ్యం పెరిగింది. ఈ నేపథ్యంలోంచి చూసినప్పుడు వకుళాభరణం లలిత రాసిన 'నా జ్ఞాపకాలు' పుస్తకానికున్న ప్రాధాన్యత తెలుస్తుంది. అప్పట్లో స్త్రీలకు అవకాశాలు ఇవ్వకుండా ఇబ్బంది పెట్టిన వ్యవస్థ, నేడు అవకాశాలు కల్పిస్తున్నట్టు ఫోజు పెడుతూ ఆందోళనకరమైన రీతిలో కొత్త సమస్యలను స్త్రీల నెత్తిన రుద్దుతుంది. ఈ అసమానతల సమాజంలో క్షణం క్షణం నలిగిపోతున్న వర్గాలను తన పరిశోధనలకు లక్ష్యంగా చేసుకోవడంలో వకుళాభరణం లలిత ప్రత్యేకత కనపడుతుంది.

నేరస్థ జాతులను, దేవదాసి, జోగిని, బసివి వంటి దురాచారాలకు బలైపోయిన మహిళల జీవితాలను పరిశోధించి సభ్యసమాజం దృష్టికి తీసుకొచ్చే ప్రయత్నం చేసారు వకుళాభరణం లలిత. ఇప్పటికే ఈ పరిశోధనలకి సంబంధించి పలు పుస్తకాలు ప్రచురించారు. ఈ పుస్తకంలో ఏడు భాగాలుగా తన జీవిత పరిణామాన్ని వివరించారు. తన బాల్యం, కళాశాల జీవితం, దాంపత్య జీవితం, ఉద్యోగజీవితం, పరిశోధన అంటూ చేసిన విభజన ఆమె నేపథ్యాన్ని క్రమ పద్ధతిలో అర్థం చేసుకోవడానికి దోహదపడుతుంది.

బాల్యంలో తనపై ప్రభావం చూపిన వారిని గూర్చి ఉద్వేగంగా రాస్తారు. రమణక్కను గూర్చి చెప్పాల్సివస్తే నేను ఈ దశలో ఉండటానికి కారణం తను నా కోసం వేసిన పునాదియే. అందుకే నేను ఏ పని చేస్తున్నా నా మనస్సులో ముందుండి ఆ పనిని నా చేత చేయిస్తుందని భావిస్తాను. తాను నా కోసం పడ్డ ఆరాటం, తపన నేనెన్నటికి మరువలేను' అని గుర్తుచేసుకుంటారు. తను చదివిన హైస్కూల్ గురించి, కావలి కళాశాల గురించి

అక్కడి అధ్యాపకులు, తన మీద ప్రభావం చూపిన వ్యక్తుల గురించి ఆరాధనగా రాస్తారు.

తన భర్త చరిత్ర పరిశోధకుడిగా ప్రసిద్ధులైన ఆచార్య వకుళాభరణం రామకృష్ణ తనకు రాసిన ప్రేమలేఖల గురించి, తన వివాహం చేసుకోవాలనే ఆకాంక్షను వ్యక్తపరిచిన సంఘటన గురించి దాంపత్య జీవితం ఛాప్టర్‌లో ప్రస్తావిస్తారు. వకుళాభరణం లలిత, రామకృష్ణల కుటుంబం విద్యావంతులు, పరిశోధకులతో వర్ధిల్లుతూ తెలుగునాట వెలుగు విత్తనాలు నాటడంలో ఆశ్చర్యం లేదు. ఆధునిక చైతన్యంతో అలరారుతూ మానవతా విలువలతో కూడిన సమాజాన్ని ఆకాంక్షిస్తూ సాగే ఈ కుటుంబ ప్రయాణం ఎందరికో స్ఫూర్తిదాయకం. గాఢమైన ఈ దంపతుల అనురాగం ఈ ఛాప్టర్‌లో వ్యక్తమవుతుంది.

"కళాశాల ప్రాంగణంలో అడుగు పెట్టేసరికి రామకృష్ణ విజయవాడ నుంచి వచ్చి ఈ కళాశాలలో చేరినందువల్ల నా దృక్పథంలో మార్పు వచ్చింది. మా కళాశాల విద్యార్థుల్లో కాంగ్రెస్ పార్టీ బలంగానే ఉన్నా దానికంటే కూడా ఎస్.ఎఫ్.ఐ మరీ బలంగా ఉండేది. రామకృష్ణ నన్ను ఎస్.ఎఫ్.ఐలో సభ్యురాలిగా చేర్చారు. అప్పుడప్పుడు పార్టీ సదస్సులకు వెళ్ళడం జరుగుతుండేది. "వకుళాభరణం రామకృష్ణతో కాలేజీ రోజుల నుండే లలితకు పరిచయం ఉంది. వామపక్ష విద్యార్థి సంఘంలో రామకృష్ణ కార్యకలాపాలు నిర్వహిస్తూ లలితను కూడా ప్రోత్సహించారు. ఇప్పటికీ ఈ దంపతులు ఆ బాటలోనే పయనిస్తూ ప్రగతిశీల భావాల వ్యాప్తికి కృషిచేయడం గొప్ప విషయం.

వకుళాభరణం లలిత తన మీద మార్క్సిజం ప్రభావం వుందని చెప్పారు. తన భర్త కుటుంబం ద్వారా ఈ భావాలు తనకు చేరాయి. ఆ ప్రస్తావన చేస్తున్నప్పుడు "సిద్ధాంతరీత్యా నేను దాస్ కాపిటల్ గానీ, మిగిలిన మార్క్సిజమ్ పుస్తకాలు గాని లోతుగా చదవలేదు. అయినా ఇంటి వాతావరణం వల్లగానీ, కె.వి.ఆర్.ఎన్.వి.ఆర్.ఎంజె. మాణిక్యరావు గార్లతో ఉన్న సన్నిహితత్వం వల్ల గాని నాలో మార్క్సిజం జీర్ణించుకుపోయింది. సిద్ధాంతరీత్యా కాకపోయినా, ఆచరణలో నా జీవితంలో మార్క్సిజం ప్రభావం అణువణువునా ఉంది. ఆ మార్క్సిజం ప్రభావం మానవతా విలువలకు ప్రాధాన్యం ఇవ్వడానికి దోహదకారి అయ్యింది. "అని రాస్తారు. మార్క్సిస్టు ఆలోచనా వేదికగా కనిపించే వారి కుటుంబాన్ని గమనించినవారికి ఈ మాటలు ఎంత అక్షర సత్యాలో అర్థమవుతుంది.

ఈ పుస్తకంలో తన పరిశోధనల వెనుక తను చేసిన కృషిని ప్రత్యేకంగా రాసారు. అలాగే జవహర్‌భారతి కాలేజి గురించి ఎంతో ఆత్మీయంగా రాస్తారు. ఆ కాలేజి ప్రత్యేకత, అక్కడి పెద్దల కృషిని గురించి రాసిన విషయాలను చదువుతుంటే ఆ కాలేజీలో చదవలేకపోయినందుకు కొద్దిపాటి విచారం ఎవరికైనా కలుగుతుంది. అన్నింటికీ మించి వకుళాభరణం లలిత మీద ఆ కాలేజీ చాలా ప్రగాఢమైన ముద్ర వేసిందనే భావన కలుగుతుంది.

నేరస్త జాతుల మీద, దేవదాసీ, జోగినీ వ్యవస్థల మీద పరిశోధన కోసం వకుళాభరణం అనేక ప్రాంతాలకు వెళ్ళారు. కొన్ని చోట్ల ఒంటరిగా ఇబ్బందులు కూడా ఎదుర్కొన్నారు. అలాంటి ఒక సంఘటన ఒకచోట ప్రస్తావిస్తారు. 'కర్నూలు జిల్లా సిద్దాపురం సెటిల్మెంట్ ఉంది. రామకృష్ణ విద్యార్థి మల్లిగాంధీ స్టూవర్ట్‌పురం, సిద్దాపురం సెటిల్మెంట్లపై సిద్ధాంత వ్యాసం రాశాడు. అయితే ఇంటర్వ్యూకు రేపు పొద్దున్న వెళ్దామనంగా లెక్చరర్‌గా పనిచేసే అతని అక్కయ్య మరణించింది. అతడు వెంటనే చీరాల వెళ్ళాల్సి వచ్చింది. అటవీశాఖ,కన్సర్వేటర్ డైరెక్టరైన మూర్తిగారు మాకు కర్నూలులోని అతిథి గృహంలో బస ఏర్పాటు చేశారు. రాత్రికి రాత్రి మల్లిగాంధీ చీరాలకు వెళ్ళాల్సి వచ్చింది. మావారు రామకృష్ణకు ఫోను చేస్తే రాజు అనే విద్యార్థిని కర్నూలుకు పంపిస్తానని చెప్పారు. ఆ రాత్రి అతిథి గృహంలో నేనొక్కతినే ఉన్నాను. గాంధీ వెళ్ళటం, అతిథి గృహంలో ఇంకెవ్వరు లేకపోవడంతో తలుపులు బిగించుకొని నేను ఒక్కర్తినే ఉంటే ఆ రాత్రంతా జాగారమే. గుండ్లు మిటకరించుకొని ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అని ఆత్రుతతో ఎదురుచూస్తుంటే తెల్లవారు జామున కాస్త నిద్రపట్టింది. 6గంటలకునిద్రలేచి ఒంటరిగా చేసే పనిలేక రిక్షా పిలిపించుకొని, కర్నూలంతా రిక్షాలోనే తిరిగొచ్చాను. 12గంటలకు అతిథిగృహం చేరితే ఒంటిగంటకు రాజు వచ్చాడు. "ఇటువంటి అనుభవాల మధ్య పరిశోధనలను కొనసాగించడానికి గట్టి సంకల్పబలం ఉండాలి. వకుళాభరణం లలితకు అది నిండుగా వుంది కాబట్టే ఈనాటికీ ఆ ఉత్సాహంతోనే కనబడతారు.

పురుషులకు లేని కొన్ని సమస్యలు మహిళలకు ఉంటాయి. జవహర్ భారతి కళాశాలలో అధ్యాపకురాలిగా పనిచేస్తున్నప్పుడు జరిగిన అటువంటి ఒక సంఘటనను ఈ పుస్తకంలో ప్రస్తావిస్తారు. "రామకృష్ణ ప్రిన్సిపాల్‌గా ఉన్న కాలంలో ఒకరోజు నేను ఒక గంట ఆలస్యంగా కళాశాలకు వెళ్ళాను. దానికి కారణం పరిశోధనలో నిమగ్నమవడం. నాక్లాసును రామకృష్ణ తీసుకొని చరిత్ర బోధించి నన్ను సెలవు పెట్టి ఇంటికి పొమ్మన్నారు. నేను పడ్డ అవమానం వర్ణనాతీతం! ప్రిన్సిపాల్‌గా రామకృష్ణ దృష్టి వేరు".

ఇటువంటి అనేక సంఘర్షణలోంచి, అనుభవాలలోంచి వకుళాభరణం లలిత వ్యక్తిత్వం ఒక సమగ్రతను సంతరించుకున్న తీరు ఈ పుస్తకం మనకు పట్టిస్తుంది.

సంప్రదాయ జీవితం నుండి ప్రగతిశీల భావాలవైపు సాగే ప్రయాణంలో చాలా సమస్యలు ఎదురవుతాయి. వ్యక్తిగత ఆచరణ దగ్గర్నుంచి సామాజిక కార్యకలాపాల వరకు ప్రతీ క్షణమూ ఒత్తిడిని ఎదుర్కొంటూ సాగాలి. వకుళాభరణం లలిత అనుభవాలు ఈ అభిప్రాయం ఎంత సరైనవో తెలియజేస్తాయి. ఒకచోట రాసిన సంఘటన దీనికి ఉదాహరణ 'ఒకసారి విరసం సభ్యురాలైన కృష్ణాబాయి గారు విశాఖపట్నంలో మాట్లాడుతున్నప్పుడు నీవింకా మంగళసూత్రాన్ని వేసుకుంటున్నావేమని అడిగారు. సికింద్రాబాదులో జరిగే మహంకాళి జాతర్లో మంగళసూత్రాలు రెండూ వడిపోయాయి. అది మొదలు మంగళసూత్రాలను, కాలి మట్టెలను ధరించడం మానివేశాను. మామూలుగా హిందూ స్త్రీకి మంగళ సూత్రం ఉండి తీరాలి. ఇద్దరి ఉద్దేశంలో హృదయ సమ్మేళనమే వివాహానికి చిహ్నం. మా బంధువులెందరో ఎందుకిలా చేశావని ప్రశ్నించారు. చిరునవ్వే దానికి సమాధానం. "ఈ సంఘటన వకుళాభరణం లలితలో వచ్చిన పరిణితి, చైతన్యాన్ని ప్రతిబింబిస్తుంది. క్షేత్ర పరిశోధనలో అట్టడుగు మహిళల, నేరస్తు జాతుల, గిరిజన మహిళలతో సన్నిహితంగా మెలిగిన వీరికి నిజమైన మానవసంబంధాల గురించి బాగా తెలుసు. అందుకే తన జీవితం, కుటుంబ

సభ్యుల జీవితాల చుట్టూ సామాజిక అంశాల తోరణాలు అల్లుకుని అందరినీ ఆహ్వానిస్తుంటాయి. అసమానతలు లేని సమాజం కోసం తను, తన కుటుంబం పడుతున్న తపన ఎప్పటికీ స్ఫూర్తిని నింపుతూనే ఉంటాయి.

ఈ పుస్తకానికి వకుళాభరణం లలిత రాసి ముందుమాటలో తను జీవిత చరిత్ర రాయదగినంత స్థాయి కాదని రాశారు. నిజానికి ఎవరి జీవితంలోనైనా చెప్పాల్సిన, ఇతరులకు అవసరమైన అనుభవాలను, ఆలోచనలను ఇచ్చే అంశాలు ఉంటాయి. రాసే శక్తి ఉన్నవారు మాత్రమే రాయగలరు. వకుళాభరణం లలిత జీవితంలో అందరికీ, ముఖ్యంగా మహిళలకి ఉపయోగపడే అనేక అంశాలు ఉన్నాయి. ఈమె సమస్యలను అధిగమించిన తీరు, పరిశోధనలు చేయడానికి చూపిన ఆసక్తి ఎందరికో ప్రేరణ కలిగిస్తాయి. ముఖ్యంగా ఈ రోజున మహిళలు అన్ని సామాజిక రంగాల్లో చాలా వేగంగా ప్రవేశిస్తున్నారు. ఎన్నో సమస్యలను వాళ్ళు ఎదుర్కొంటున్నారు. అలాంటి వారికి 'నాజ్ఞాపకాలు' పుస్తకం వంటివి చాలా ధైర్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని ఇస్తాయి. సామాజిక స్పృహను పెంచుతాయి. అంతకంటే జీవిత సార్థకత ఏముంటుంది. నిజంగా వకుళాభరణం లలిత జీవితం సామాజిక స్ఫూర్తిని శక్తివంతంగా చాటుతుంది.

జీవిత సత్యం

# స్త్రీ విద్య - జాతి పురోభివృద్ధికి దోహదకారి

-ఎస్. పుణ్యవతి



స్త్రీకి విద్య అవసరమా అనేది గత కాలపు ప్రశ్న. ఇప్పటికీ కొన్ని ప్రాంతాల్లో, సామాజిక తరగతుల్లో 'చదువెందుకు?' అని నిరుత్సాహపర్చే వాళ్ళూ లేకపోలేదనుకోండి. ఏమైనా స్త్రీ విద్య జాతి పురోభివృద్ధిలో కీలక పాత్ర పోషిస్తుందనే సత్యం సర్వత్రా గుర్తించబడింది. జాతీయ స్థాయి నుండి అంతర్జాతీయ స్థాయి వరకు తీవ్రస్థాయిలో "స్త్రీ విద్య - దాని ఆవశ్యకత"పై చర్చలు సాగాయి. 1860లో ప్రముఖ బ్రిటీష్ పార్లమెంటేరియన్ జాన్ స్టువర్ట్ మిల్ స్త్రీల హక్కులు - అందులో భాగమైన స్త్రీ విద్య గురించి పెద్ద పోరాటం చేశారు. మన దేశంలో కూడా ఈశ్వరచంద్రవిద్యాసాగర్ మొదలుకొని కందుకూరి, గురజాడ వంటి సంస్కర్తలు స్త్రీ విద్యా వ్యాప్తికి చాలా కృషి చేశారు. ఆధునిక భారత మహిళ చరిత్రను తిరగ రాస్తుందని భావి మహిళల పట్ల ఎంతో ఆశాభావం వ్యక్తం చేశారు. వీరందరికన్నా ముందర మహారాష్ట్రలో మహాత్మా జ్యోతిబాపూలే స్త్రీ విదవ్యాప్తి కోసం గొప్ప కృషి చేశారు. ఆయన భార్య సావిత్రిబాయి పూలేని ప్రోత్సహించి ఆడపిల్లలకు చదువు నేర్పే ఉపాధ్యాయునిగా తర్ఫీదు నిచ్చారు. ఆ క్రమంలో ఆయన ఛాందసవాదుల నుండి ఎన్నో ఆటంకాలు, దాడులు ఎదుర్కొన్నారు.

అ ం ు ు నా 'ఆడపిల్లలకు చదువెందుకు'? అనే ప్రశ్న ఇప్పటికీ ఎదురవుతూనే ఉంది. "స్త్రీలకి ఇల్లే ప్రపంచమయితే మగవానికి బయటి ప్రపంచమే ఇల్లు" అన్ని జస్టిస్ చిన్నపరెడ్డి ఒక సభలో వ్యాఖ్యానించారు. అట్లాంటి చిన్న ప్రపంచంలో నుండి సువిశాల ప్రపంచంలోకి రావాలంటే చదువు అవసరం. చదువుకుంటేనే తన చుట్టూ ఉన్న సమాజాన్ని, నడుస్తున్న చరిత్రను, రాజకీయాలు, ఆర్థిక వ్యవహారాలు, శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం, వగైరా విషయాలను అర్థం చేసుకోగలుగుతుంది.. వ్యక్తిత్వం వికసిస్తుంది. స్త్రీ తన శక్తిసామర్థ్యాలను పెంచుకుంటుంది. ఆర్థికంగా స్వతంత్రురాలు కావాలంటే చదువు అవసరం. విద్య ఉంటేనే స్త్రీ ప్రజా జీవితంలోకి అడుగు పెట్టగలుగుతుంది. తనయొక్క తనచుట్టూ ఉన్న ప్రజల యొక్క మెరుగైన జీవితాల కోసం ప్రజాఉద్యమాలు నిర్మించగలుగుతుంది.

కానీ, దురదృష్టవశాత్తు మన దేశంలో స్వాతంత్ర్యం వచ్చి 65సం॥ తరువాత కూడా సగం మంది స్త్రీలకు చదువు అందుబాటులో లేదు. 2011 లెక్కల ప్రకారం మన రాష్ట్రంలో అక్షరాస్యతశాతం 67.6 కాగా అందులో స్త్రీల అక్ష్యరాస్యత 59.7 శాతం మాత్రమే. జాతీయ స్థాయిలో మొత్తం అక్షరాస్యత 74 శాతం కాగా మహిళల్లో అది 65 శాతంగా ఉంది బీమారు (రోగిష్టి) రాష్ట్రాలుగా పేరుపడ్డ బీహార్, యు.పి., వంటి రాష్ట్రాలకన్నా తక్కువగా ఉంది.

ఎంత చెప్పుకున్నా పితృస్వామ్య విలువలు బలంగా ఉన్న మనలాంటి ఆసియా దేశాల్లో ప్రభుత్వ ప్రోత్సాహం లేకుండా స్త్రీలలో 100% అక్షరాస్యత సాధించడం అసాధ్యం. ఆడపిల్ల పుట్టడమే దండగ అనుకునే సంస్కృతిలో ఉన్న మన సమాజంలో తల్లిదండ్రులు ఆడపిల్ల చదువుపై శ్రద్ధ పెట్టడంలేదు. ఆర్థికంగాను, సామాజికంగాను వెనుకబడ్డ దళిత, గిరిజన వర్గాల్లో స్త్రీల అక్షరాస్యత మరీ తక్కువ. దళిత స్త్రీలలో 47శాతం ఉంటే, గిరిజన స్త్రీలలో 34శాతం మాత్రమే ఉంది. స్త్రీల పట్ల వివక్షకు సామాజిక, కులపరమైన అసమానతలు కూడా తోడయ్యాయి.

### చదువు -సామాజిక స్థితి

బడిలో చేరుతున్న పిల్లల సంఖ్య ఆశాజనకంగా ఉంది. కానీ, బడిమానివేస్తున్న పిల్లల సంఖ్యను చూస్తే ఒక అడుగు ముందుకు

**రెక్కలు, ముక్కలు చేసుకునైనా కులాన్ని, కుటుంబాన్ని, ఉద్ధరించే కొడుకును పెంచి విద్యాబుద్ధులు చెప్పిస్తుంది. ప్రయోజకుణ్ణి చేస్తుంది ఆ తల్లి. ఒకవేళ కొంత వెసులుబాటు ఉండి చదివిద్దామన్నా పితృస్వామ్య కుటుంబపు విలువలు అందుకు అంగీకరించవు. "ఆడపిల్లకు పెట్టిన పెట్టుబడి, గోడకుకొట్టిన సున్నం తిరిగిరావు" అంటూ సామెతలు గుర్తుచేసారు. ఆడపిల్ల అత్తవారింటికి వెళ్ళి పోతుంది కనుక మాకేం ఉపయోగం? అంటూ వాదనకు దిగిన సందర్భాలు అనేకం**

**చిన్న ప్రపంచంలో నుండి సువిశాల ప్రపంచంలోకి రావాలంటే చదువు అవసరం. చదువుకుంటేనే తన చుట్టూ ఉన్న సమాజాన్ని, నడుస్తున్న చరిత్రను, రాజకీయాలు, ఆర్థిక వ్యవహారాలు, శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం, వగైరా విషయాలను అర్థం చేసుకోగలుగుతుంది.. వ్యక్తిత్వం వికసిస్తుంది. స్త్రీ తన శక్తిసామర్థ్యాలను పెంచుకుంటుంది. ఆర్థికంగా స్వతంత్రురాలు కావాలంటే చదువు అవసరం. విద్య ఉంటేనే స్త్రీ ప్రజా జీవితంలోకి అడుగు పెట్టగలుగుతుంది.**

రెండు అడుగులు వెనక్కి అన్నట్లున్నది. 2000 నాటికి 6-18సం॥ మధ్య వయస్సున్న పిల్లల్లో 60శాతం పైగా ఆడపిల్లలు బడిమానివేస్తున్నారు. బాలకార్మికుల జాబితాలో చేరిపోతున్నారు. ఎందువల్ల ? పేదరికం, బడి అందుబాటులో లేకపోవడం ఆడపిల్లపట్ల వివక్ష, ఇంటిచాకిరి వంటివి ప్రధాన కారణాలుగా కనిపిస్తాయి.

కుటుంబసభ్యుల శ్రమమీదనే ఆధారపడ్డ కుటుంబాల్లో ఆడపిల్ల చదువు అందని ద్రాక్ష పండుగానే ఉంటుంది. 5-6 సం॥ల వయసు నుండి ఆడపిల్లలు పనులు చేయక తప్పదు. తల్లి పనికి పోతే తమ్ముళ్ళను, చెల్లెళ్ళను ఆడించడం, ఇంటిపనిలో సహాయపడడం తప్పనిసరి. దళితులు, గిరిజనులు మాత్రమేగాక చిన్న రైతులు, వృత్తిదారుల్లో కూడా ఇదే పరిస్థితి . గొర్రెలు, మేకల పెంపకందార్లు, కల్లుగీతకార్మికులు, నేతకార్మికులు, బీడికార్మికులు ఇత్యాది కుటుంబాల్లో స్త్రీల శ్రమే మూలాధారం. అటువంటి స్థితిలో ఆడపిల్ల తెగించి బడికి పోతానన్నా "ఇంటిపని ఎవడొచ్చి చేస్తాడు" అంటూ తల్లి తిట్లు మొదలెడుతుంది. అదే తల్లి కొడుకు చదువు పట్ల శ్రద్ధ పెడుతుంది. రెక్కలు, ముక్కలు చేసుకునైనా కులాన్ని, కుటుంబాన్ని, ఉద్ధరించే కొడుకును పెంచి విద్యాబుద్ధులు చెప్పిస్తుంది. ప్రయోజకుణ్ణి చేస్తుంది ఆ తల్లి. ఒకవేళ కొంత వెసులుబాటు ఉండి చదివిద్దామన్నా పితృస్వామ్య కుటుంబపు విలువలు అందుకు అంగీకరించవు. "ఆడపిల్లకు పెట్టిన పెట్టుబడి, గోడకుకొట్టిన సున్నం తిరిగిరావు" అంటూ సామెతలు గుర్తుచేసారు. ఆడపిల్ల అత్తవారింటికి వెళ్ళి పోతుంది కనుక మాకేం ఉపయోగం? అంటూ వాదనకు దిగిన సందర్భాలు అనేకం ఎదుర్కొన్నాం. నాణ్యమైన చదువులు కొడుకులకి వానాకాలపు చదువులు "ఆడ"పిల్లలకి, సర్వశిక్ష అభియాన్ లెక్కలే ఈ వాస్తవాలు చెబుతున్నాయి. జిల్లా పరిషత్తు స్కూళ్ళలో మగ పిల్లలు 13 లక్షలకు పైగా ఉండగా ఆడపిల్లలు అంతకన్నా ఎక్కువగా 14 లక్షలకు పైగా ఉన్నారు.

బడి అందుబాటులో లేకపోవడం మరో సమస్య. ఆడపిల్లని ఉన్న ఊళ్ళో అది కూడా 5వ తరగతి వరకు చదివించడానికి కొంత శ్రద్ధ చూపుతున్నారు. ఆ తరువాత వేరే ఊరికి పంపి చదివించరు. చదివించినా సవాలక్ష ఆంక్షలు పెడతారు. స్త్రీల శీలం చుట్టూ పరిభ్రమించే భావజాలం ఆడపిల్ల చదువును నిరోధిస్తుంది. ముల్లు వచ్చి అరిటాకుమీదపడ్డా..... వంటి సామెతలు ఉత్తినే పుట్టలేదు. ఈ భావజాలం ఆడపిల్ల విద్యకు దూరం చెయ్యడంతోపాటు ఆమెకు అభివృద్ధి ఫలితాలు అందకుండా చేస్తోంది. కుటుంబంలో ఆడపిల్లలు-మగపిల్లల మధ్య అసమానతని, పుత్ర సంతానానికి ప్రాధాన్యతను పెంచుతోంది. పరోక్షంగా కట్నం సమస్యకి కూడా ఆజ్యం పోస్తోంది. కోరిన కట్నం ఇచ్చి పెళ్ళి చేసి గుండెల మీద బరువు దించుకోవాలి అన్న ఆలోచనకు దారితీస్తోంది. కట్నంగోల భరించలేక ఆడపిల్లే వద్దు అనే పరిస్థితి వస్తోంది. బడి అందుబాటులో ఉంటే ఈ సమస్యకు కొంత పరిష్కారం, కానీ దురదృష్టవశాత్తు

**ఉన్నత చదువులు, సామాజిక హోదాను పెంచుతాయి. అందుకు భిన్నంగా సామాజిక హోదాను హీనపర్చే అటెండర్లు, స్వీపర్లు వంటి పోస్టులు మాత్రమే ఎక్కువగా స్త్రీలకు దొరుకుతున్నాయి. ఒక వేళ సంఘటిత రంగంలో, ప్రభుత్వ ఉద్యోగాల్లో స్త్రీలు ఉన్నప్పటికీ వాటిల్లో ఎక్కువభాగం కుటుంబపరంగా స్త్రీలు చేసే పనులకు కొనసాగింపు లాంటివే. టీచర్లు, నర్సు, గుమస్తా, టైపిస్టు -ఇత్యాది పోస్టులే ఎక్కువ.**

ఇంటికి మూడు కిలోమీటర్లలోపు ఉన్న పాఠశాలలు 25%మాత్రమే. సర్వశిక్ష అభియాన్ ఇచ్చిన లెక్కలే ఇవి.

అక్షరాస్యత ప్రభావం స్త్రీల మొత్తం అభివృద్ధిపైన పడుతుంది. అక్షరాస్యత లేని కారణంగా శాస్త్ర సాంకేతిక రంగాల్లో జరుగుతున్న అభివృద్ధి ఫలాలు స్త్రీలకు అందనంటున్నాయి. శ్రామిక మహిళల్లో అక్షరాస్యత ఈ విషయాన్ని తెలియజేస్తోంది. గ్రామీణ ప్రాంతాల్లో 78% మహిళా శ్రామికులు నిరక్షరాస్యులు కాగా పట్టణ ప్రాంతాల్లో 50%మంది. శ్రామిక మహిళల్లో ఉన్నత చదువులు చదివినవారు గ్రామాల్లో 0.93% కాగా పట్టణాల్లో 15% మాత్రమే. చదువుల్లో కూడా నాణ్యమైన చదువులు-సైన్సు. ఇంజనీరింగ్, వైద్యం, మేనేజ్‌మెంట్, అడ్మినిస్ట్రేషన్ వంటి కోర్సులు స్త్రీలకు అందుబాటులో లేవు. సంఘటిత రంగంలోనూ ప్రభుత్వ రంగంలోనూ నిర్వహించే ఉద్యోగాలు, ఉన్నత చదువులు, సామాజిక హోదాను పెంచుతాయి. అందుకు భిన్నంగా సామాజిక హోదాను హీనపర్చే అటెండర్లు, స్వీపర్లు వంటి పోస్టులు మాత్రమే ఎక్కువగా స్త్రీలకు దొరుకుతున్నాయి. ఒక వేళ సంఘటిత రంగంలో, ప్రభుత్వ ఉద్యోగాల్లో స్త్రీలు ఉన్నప్పటికీ వాటిల్లో ఎక్కువభాగం కుటుంబపరంగా స్త్రీలు చేసే పనులకు కొనసాగింపు లాంటివే. టీచర్లు, నర్సు, గుమస్తా, టైపిస్టు -ఇత్యాది పోస్టులే ఎక్కువ. ప్రయివేటీకరణ ఫలితంగా ఆ ఉద్యోగాలు కూడా అసంఘటిత రంగంలో చేరిపోయాయి. ఈ పరిస్థితి స్త్రీ, పురుష నిష్పత్తిలో తీవ్ర అసమానతకి, ఆడపిల్లల జనాభా తగ్గిపోవడానికి కూడా కారణమవుతున్నది.

ప్రభుత్వం పూర్తి బాధ్యత తీసుకుంటేనే ఆడపిల్లల చదువుల విషయంలో ఆశించిన ఫలితాలు సాధించగలం. స్త్రీల అభివృద్ధిని సాధించినపుడే సమాజం కూడా అభివృద్ధి సాధిస్తుంది. అదే సందర్భంలో ప్రభుత్వంపైన, సమాజంపైన ఒత్తిడి తీసుకురావడానికి చదువుకున్న ఆడపిల్లలు కూడా ముందుకురావాలి. ఉద్యమాలు నిర్మించాలి.

# బడి గది - చదువుల కది సమాధి

బొజ్జ లోని బుజ్జాయి, చేయునెంతో అభ్యాసం,
బోసి నవ్వుల పాపాయిలో ఉరకలెత్తు ఉత్సాహం,
ఎదుగుదలను ఒకటొకటిగ చూపటకై ప్రోత్సాహం.
జీవిక కవి అతి సహజం, విద్యల కవి అరంభం,
అతి సహజం కుతూహలం,
ఒద్దనలేదే బిడ్డా, విద్యలతో ఆ బంధం,
సుతి మెత్తని అనుబంధం.
ఆ బంధం, అనుబంధం, ఆ సహజం,
కుతూహలం. సహజ బడి.
చిరునవ్వుల పాపాయికి, చిరుత ప్రాయపు చిన్నారికి,
చిర చిరల బడి వద్దు
వెచ్చనైన అమ్మ వొడే, పచ్చనైన ప్రకృతంటి మొదటి బడి.
ఎదిగాకే అసలు బడి.
బడి అంటే ఎటులుండునొ ఎరగ దసలు
పాల బుగ్గల పాపాయి.
భలే, భలే బడి అని, బంతిలాగ ఎగురుకుంటు,
పరుగులెత్తు పాపాయికి,
ఎదురయ్యే అనుభవాలు, గమనిస్తే సరి సరి,
బడి మాటే ఎత్తరు మరి.
పాపాయికి అది ఇష్టం, తాగూరికి అది స్వప్నం,
చలం చాచా కదే స్వప్నం,
ఆటలతో పాటలతో, స్వచ్ఛమైన భావంతో, స్వేచ్ఛఅనే రాగంతో..
విజ్ఞతతో అల్లుకున్న, ప్రాణంగా పెంచుకున్న పొదరిల్లే
ఎదిగెదిగీ గగనంలో విహరించిన ఆ హర్మ్యం.
స్వప్నించిన ఆ హర్మ్యం, కనువిప్పితె కరిగిపోయి.
కనిపించెను కాంక్రీటుల ఆకాశపు హర్మ్యం, విద్యలకడ మృగ్యం.
ఆకాశపు హర్మ్యాలు, కాంక్రీటుల కట్టడాలు,
విలయాలకె నిలయాలు.
కాలేవవి విద్యల కిక ఆలయాలు.
ఆటలు ఒక అస్త్రం, రసాయనిక శాస్త్రం, ఎండార్ఫిన్ ఆ శస్త్రం.
హుషారిచ్చు ఎండార్ఫిన్, మేధనిచ్చు ఎండార్ఫిన్,
జోకొట్టును ఎండార్ఫిన్.
ఆటల్లేని ఓ అర్ఫన్, నేటి బడే ఓ అర్ఫన్.
తెలివి లేని పెద్దలు, తెలుసుకోని ప్రభుతలు,
అస్త్రమైన, శాస్త్రమైన, శస్త్రమైన ఆటలకై
ఇవ్వలేరు ఓ స్థలం, నిలపలేరు ఆ స్థానం.
ఆటల్లేని నేటి బడిని, బేగుల మోతలే ఆటలైన నేటి బడిని
బుడుగలనే, బడుగులు చేయు నేటి బడిని
ఆటలతో కలగలిపితె, మోతలకిక సెలవిస్తే,
సమ్మెట పోటు లాంటి ఆ బడే ముద్దుల మూట అవ్వదా !
ఒంటికి బట్ట తోడై, కాలికి జోడు తోడై, మనిషికి మనిషి తోడై,
యూనిఫాం అందరి తోడై, అవసరమే అన్నిటా తోడై,
చేయి, చేయిగ, జోడు జోడగ, ఆడుకుంటు బడికి వెడితే,
ముద్దుమాట, నోట బయట పడక ముందే,
గొంతు నొక్కు టక్కు నిక్కుల నెక్కుటై.
ముందు అడగు వేయబోగా, బంధమేయు,
నిగనిగల పై జోడు, దానిలోని మే జోడు, ఆరెంటికి తోడు,
పాసిందా కాలు, కంపు కంపు కాలు,
అవసరమా ఈ టక్కు, టైల, బూటు టెక్కుల తోడు ?

తత్తత్త, మ్మమ్మమ్మ, ప్పప్పప్ప, న్ననన్న
ఆరో నెలనే ఆరుదెంచే అమృతాల కూజితాలు,
సొంతభాషలో ఎదిగినపుడు అవే మనోరంజితాలు
రకరకాల భావాలను పరభాషలో పలకలేక దూరమయిన నందనాలు
ఆంగ్ల భాష పరభాషే, ఇంగ్లీషో వెర్రి ఆశే,
ఆశల్నన్ని అణగార్చి, వెర్రిలోనే వర్రీ అయి, క్వెర్రీలకు కళ్ళెమేసి,
అర్థంకాక వ్యర్థమైన చదువులతో,
క్లాసు, క్లాసు పైకెళితే, పైన ఉన్న నింగిలోని
సూర్యుడెపుడు కానరాడు, చంద్రుడైన తోడురాడు,
చూపు ఆనినంత మేర ఉన్నదొకటి - తరగతి గది
సహజమైన తృష్ణల్నీ, ఉదయించే ప్రశ్నల్నీ,
మింగేసే తరగతి గది. ఉసూరుమని ఏడ్పించే తరగతి గది.
ఆత్మనెంతో పీడించే, ఆత్మహత్యకు ఉసిగొల్పే,
చదువులతో తయారయిన సమాధి అది.

- డాక్టర్ డి.ఎల్.విద్య.

**మారుతున్న ఆధునిక కాలంలో ఇద్దరు ప్రేమికులు ఆలాపించుకుంటున్నపాట**

ప్రియుడు :- ఆకాశం దించాలా నెలవొంక తుంచాలా అంటు రాగం తీస్తుంటే...

ప్రేయసి :- ఆకాశం దించొద్దూ నెలవొంక తుంచొద్దూ పెళ్ళైనాక కిచన్‌లోకి వచ్చి కుక్కరును స్టౌమీద పెట్టి దించితే చాలు...... కూరగాయలు తరిగిచ్చి వంటలోను సాయంచేస్తే చాలు.....

- పి.రమ

# ABHYUDAYA MAHILA EDUCATIONAL INSTITUTIONS

**LAKSHMIPURAM, 3RD LANE, GUNTUR.**
**PH : 0863-2231359, Cell : 9842690447**

**The courses offered under Jr. College** which was recognized by Govt. A.P. are

*MPC*   *MEC* } both media
*BiPC*   *CEC* }

**Similarly in Degree College the courses offered are**



**B.Sc. SECTION :**
MATHS, PHYSICS, CHEMISTRY
MATHS, PHYSICS, COMPUTERS
MATHS, ELECTRONICS, COMPUTERS
MATHS, STATISTICS, COMPUTERS
BIO TECHNOLOGY, BIOCHEMISTRY, CHEMISTRY (for both MPC & Bi.PC)
BIO INFORMATICS, BIOTECHNOLOGY, CHEMISTRY

**B.Com SECTION :**
B.Com COMPUTERS
B.Com GENERAL

# భవాని స్పెషాలిటీస్ హాస్పిటల్

## భవాని డయాబెటిక్ సెంటర్

కొత్తపేట, మంగళగిరి. ఫోన్ : 232730

డా॥ కె. భవాని, M.B.B.S., D.G.O., PGDHS, Dip. in Diabetes
డయాబెటాలజిస్ట్, గైనకాలజిస్ట్ మరియు ప్రసూతి వైద్య నిపుణులు
సంప్రదించు వేళలు : ఉ॥ 10 గం॥ల నుంచి మ॥ 1 గం॥ల వరకు
సా॥ 5 గం॥ల నుండి 8 గం॥ల వరకు

కన్సల్టెంట్ ఫిజిషియన్, డయాబెటాలజిస్ట్
డా॥ కె. సత్యనారాయణ రావు, M.D., (Gen Med),
PGDHS, Dip. in Diabetes HOD & Prof of Medicine, Cardiology & HIV SMC (VIJ)

**షుగర్ వ్యాధుల స్పెషలిస్టు**

గుండెజబ్బులు, బిపి, మూత్రపిండములు, క్షయ, నెమ్ము, నరముల వ్యాధులు, ఎయిడ్స్, సాధారణ వ్యాధుల వైద్య నిపుణులు
సంప్రదించు వేళలు : ఉ॥ 7 గం॥ల నుంచి 9 గం॥ల వరకు మరియు
సా॥ 4 గం॥ల నుండి రా॥10 గం॥ల వరకు

**వైద్య రంగంలో 33 సంవత్సరముల అపారమైన అనుభవం**

**అర్జంట్ కేసులు అన్నివేళలా చూడబడును**

*Best Wishes From*

# P.G.S. Nursing Home

**Station Road, Mangalagiri,**
**Guntur Dt. A.P.**



**DR. P.Girija,**
M.B.B.S FCCP



**DR. P.Adinarayana**
M.B.B.S DLO

**KIRANAM SOCIAL SERVICE ORGANISATION**

*Youth & Health is Nations Wealth*

మీడియా

# రాలిన 'సుమబాల' ఒకరేనా...

- కె. అరుణ

ఇటీవల బాలీవుడ్ నటీమణి 'జియాఖాన్' ఆత్మహత్య సినీరంగాన్నే కాదు... ప్రేక్షక లోకాన్ని నివ్వెరపోయేట్లు చేసింది. ఈ అమ్మాయి మన పర్వర్టెడ్ దర్శకుడుగా పేరుగాంచిన, పైత్య క్రోపాలకు మారుపేరయిన ఇన్ ఓన్లీ రామ్‌గోపాల్ వర్మ 'నిశ్శబ్ద్' సినిమాతో తెరకు పరిచయమైంది. స్నేహితురాలి తండ్రి (అమితాబ్)తో ప్రేమలో పడటం ఆ చిత్ర కథాంశం. అలాంటివే రామ్‌కు నచ్చుతాయి కనుక ఇందులో పెద్ద ఆశ్చర్య పోవాల్సిన పనిలేదు. పైగా ఇది 'లోలిటా' అనే ఇటాలియన్ ప్రసిద్ధ నవల నుంచి ప్రేరణ పొంది మరీ తెరకు పొక్కింది. తేడా క్యాండిడేట్లు మనకే కాదు, ప్రపంచమంతటా కొలువుతీరి ఉంటారనడానికి ఇంతకంటే తార్కాణం అవసరం లేదేమో కదా ! సరే, మనం జియాఖాన్ వద్దకొద్దాం.

ఆ అమ్మాయి ఆత్మహత్యకు కారణం బాలీవుడ్ నటుడు ఆదిత్య పంచోలి నటి జరీనా వహాబ్‌ల పుత్రుడు (ఏకైక) సూరజ్‌తో ప్రేమ విఫలం కావడం. అది తట్టుకోలేని జియా 'నేను నిన్నెంతగానో ప్రేమించాను. నిన్నే కలవరించాను. నీకై తపించాను. నా 'సర్వస్వం' దారపోశాను. కానీ, నీ నుండి నేను ఏమీ పొందలేక పోయాను. ఈ మోసాన్ని నా మనసు తట్టుకోలేక పోతోంది. ఈ నిర్లక్ష్యాన్ని భరించలేకపోతుంది. అందుకే నా కెరియర్, భవిష్యత్తును వదులుకొని మరీ ఈ లోకంనుండి సెలవు తీసుకుంటున్నా... అంటూ హృదయ విదారకంగా లేఖ రాసి మరీ చనిపోయింది.

సినీరంగంలో ఇంతటి సున్నిత మనస్కులు ఉంటారా అంటే ఉంటారు. మనసు చంపుకుని అవకాశాలకోసం జీవితాన్ని తాకట్టుపెట్టే అమాయకులకు సినీరంగంలో కొదవలేదు. కళపైనో, కాసులపైనో, లైమ్ లైట్ కోసమో,తాను తారకలా వెలిగిపోవాలని తనువును తాకట్టు పెట్టే ముగ్ధలకు ఇక్కడ రెడ్ కార్పెట్ సదాసిద్ధంగా ఉంటుంది. ఆత్మాభిమానాన్ని ఫణంగా పెట్టే దీపకళికలకు ఇక్కడెప్పుడు తలుపులు తెరిచే ఉంటాయి. అలాంటి జియాఖాన్ వెండితెర తళుకు బెళుకుల నడుమ స్ఫటికం లాంటి స్వచ్ఛమైన ప్రేమకోసం అన్వేషించి విఫలమైంది.

ఇదంతా ఎందుకు చెప్పుకుంటున్నా మంటే అలాంటి సూరజ్‌ను ముంబయి పోలీసులు అరెస్టు చేయడం, బెయిల్ రావడం, ఇంటికెళ్ళడం అంతా రీళ్ళు తిప్పినంత వేగంగా జరిగిపోయాయి. డబ్బును, అధికారానికి, హోదాకు న్యాయాన్ని తొక్కి పారేసే మన దేశంలో మనం మనం ఇంతగా చెప్పుకోడానికి ఏముంది, ఇలా జరగకపోతే అనుకోవాలిగానీ అని నాలుక చప్పరించే వారికి సైతం ఆశ్చర్యం కలిగించిన విషయం సూరజ్ తల్లి దండ్రుల రియాక్షన్.

ఆ మాతృమూర్తి ఆనందం ఎలా ఉందంటే... హమ్మయ్య ! నా కొడుకు బైటికి వచ్చేశాడు. వాడికి కడుపునిండా ఇంటిభోజనం పెట్టాలి. వాడిగదిలో వాడి పరుపుపై నా బంగారు కొండ కంటినిండా నిద్రపోవాలి అని! ఇక తండ్రి, 'వీడు ఇదంతా మర్చిపోడానికి నేను ఏర్పాట్లు చేస్తున్నా వాటిని చిత్రసీమకు వచ్చే సంవత్సరం పరిచయం చేద్దామనుకున్నా ఇప్పుడు షూటింగ్ మొదలు పెడ్తే అన్నీ మరిచిపోతాడు' అన్నాడు. పనిలో పనిగా వచ్చిన పాపులారిటీ (హతోస్మి అనుకోకండి) ఈ విధంగా సొమ్ము చేసుకోవాలన్నది వారి ఎత్తుగడ !

వీరికి కన్న ప్రేమ తప్ప.... ఆ సున్నిత మనస్కురాలు గుర్తులేదు. గుండె గాయమై, ఆశలు ఆవిరై, అన్నీ వదిలి ప్రాణాలు పోగొట్టుకున్న ఆడపిల్ల హృదయ ఘోష పట్టలేదు. ఆమె మనసు పాడిన మౌనగీతం కనిపించలేదు. ఆ పూబాల వేదనాభరిత జ్వాల ఆగుపించలేదు.

ఇవన్నీ చూస్తుంటే ఈ వెలుగులు మధ్య బ్రతికే కుటుంబాల్లో విలువలు ఎంతవరకూ ఉన్నాయో అర్థమవడం లేదూ ? సినిమాల్లో పుంఖాను పుంఖాలుగా డైలాగులు చెప్పే 'హీరోలు' తమ పిల్లలకు ఏం నేర్పుతున్నారు అన్న అనుమానం రావడం లేదూ? కోరింది కోరినట్లు అడిగింది అడిగినట్లు, మాట నోట్లో ఉండగానే అన్నీ అమరిపోతుంటే ఆ పుత్ర రత్నాలకు ఇతరుల గురించి ఆలోచించాల్సిన అవసరమేంటి ? పదిహేనేళ్ళు రాకుండానే లక్షల విలువైన బైకులు, కార్లు కొని చేతిలో పెడుతుంటే ఎదుటివారి ప్రాణాలంటే లెక్కేంటి? అంతేనా! మానవత్వం,సమాజం, సామాజిక స్పృహ అన్నవి వారిలో మచ్చుకైనా కానరావు. అన్నది అర్థమవడం లేదూ! స్వార్థం, సరదాలు, కులాసాలు, సుఖసౌఖ్యాల నడుమ దయ, జాలి, ప్రేమ అన్నది వెతకడం అమాయకత్వమేగా !

ఇదంతా చదువుతుంటే మీకు బాలీవుడ్ నటుల బదులు టాలీవుడ్ నటశిఖామణులు, అందుకు సంబంధించిన ఘటనలు గుర్తు రావడంలో తప్పేమీ లేదు.! నడిరోడ్డుపై అకారణంగా ఇద్దరు 'సాఫ్ట్‌వేర్ ఉద్యోగులపై దాడి... ఇదేమని ప్రశ్నించినందుకు తిమ్మిని బమ్మిని చేయబోయిన వైనం కళ్ళముందు తారాట్లాడిందా ? అది మరిచిపోకముందే ఆకుటుంబానికి చెందిన మరో కుర్రహీరో 'పబ్'లో అమ్మాయిని వేధించి, విసిగించిన సంఘటన కదలాడిందా ! ఇదంతా డబ్బు, హోదా, అధికారం తెచ్చిన 'బలుపు' కాదూ ? మమ్మల్ని ఎవరేం చేయగలరులే అన్న 'మదం' కాదూ ?



ప్రజలు టిక్కెట్ కొని తమ సినిమా చూస్తే తప్ప మనుగడ లేదని వారికి తెలీదా ? సామాన్యులపైనే తమ రోజు గడవదని అర్థం కాదా? అది మరిచి విలాసాలలో తేలి మునకలు వేసీ, ఇలాంటి వేషాలు, ఇలాంటి అహంకారాలు కాక మరోటి ఆశించడమే అనవసరం. పై పెచ్చు తమ వారసులు వెర్రి 'వేషాలు' చూస్తూ కూడా పల్లెత్తు మాట అనని, ప్రెస్ ముందు నిమ్మకు నీరెత్తినట్లు ప్రవర్తించిన మంత్రివర్యులు తమ సంతానానికి ఏ విలువలు నేర్పుతున్నారో, ప్రజలపట్ల ఆయన గారికి ఎంతటి గౌరవాభిమానాలు కొలువు తీరాయో మనకు తెలియకపోతేగా !

పెద్దలు చెప్పినట్లు 'ఆవు చేలోమేస్తే దూడ గుట్టున మేస్తుందా' మన పిచ్చి కాకుంటే! దొరికే వరకూ అందరూ దొరలే అని వినలేదూ!

కృత్రిమత్వం తప్ప సహజత్వం తెలియని జీవితాలు వీరివి. వారికి జీవితంలో ఎదురయ్యే ప్రేమా తెలీదు. అనుభూతులు అర్థంకావు... త్రిశంకు స్వర్గంలో ఊగిసలాడటం తప్ప!

వీరికి ఒక పరుషపుమాట, చెడు ప్రవర్తన, గుండె గాయం ఎదుటి వారికి ఎంతటి వేదన కలిగిస్తుందో అర్థం కాదు... మాయా ప్రపంచంలో పడి మునకలేయడం తప్ప! ఇలాంటి వారి గురించి ఆశలు పెట్టుకోవడం... వారిని ఆకాశంనుండి ఊడిపడ్డట్లు విలువివ్వడం... వారిని నెత్తినెత్తుకుని తమ భవిష్యత్తును నాశనం చేసుకునే వారిని చూస్తేనే బాధ! తొలిరోజు ఆట కోసం క్యూలో నలిగి ప్రాణాలు పోగొట్టుకునే వారి గురించే ఆలోచన!

వారికేం మహారాజులు! సర్వ అవలక్షణాలను 'హీరోయిజం'గా చూపి పబ్బం గడుపుకునే రారాజులు! దమ్ము కొట్టడం, తాగడం, అమ్మాయిలను ఏడిపించడం కనీస లక్షణాలని భ్రమింపచేసే అధినాయకులు! వీరి గురించి, వీరు పాటించే విలువల గురించి కాదు మనం బాధపడాల్సింది!

వీరిని నమ్మి నలిగిపోయే 'కుసుమాలు' గుర్తొస్తేనే మనసు కలుక్కుమంటుంది! అది 'జియాఖాన్ కావచ్చు! మరెవరైనా అవ్వొచ్చు! •

## మానికొండ సూర్యవతి గారికి నివాళులు



**1921 జననం** **1993 జూలై 4, అస్తమయం**

**రాష్ట్ర మహిళా ఉద్యమ నిర్మాతల్లో ఒకరు ఆశయసాధన కోసం మొక్కవోని విశ్వాసంతో నిలిచిన ఆదర్శవాది. అట్టడుగు వర్గాలకు కొండంత అండగా నిలబడ్డ త్యాగశీలి మానికొండ సూర్యవతి. స్త్రీలకు విద్యా సౌకర్యాలు కల్పించాలని, పురుషులతో పాటు సమాన సౌకర్యాలు కల్పించాలని, పురుషులతో పాటు సమాన కూలీ ఇవ్వాలని, ఆస్తి హక్కు కల్పించాలని, మరుగుదొడ్లు, ఆసుపత్రులు కట్టించాలని ఉద్యమాలు నిర్మించారు. పెత్తందార్ల దాడులకు, అవమానాలకు జంకకుండా చివరికంటా నిలబడ్డారు. ఆ మహనేతను స్మరించుకుంటూ, ఐద్వా మరియు చైతన్యమానవి హృదయ పూర్వక నివాళులర్పిస్తూంది.**

## ఆడపిల్లనమ్మా!

జీవించేహక్కు
రాజ్యాంగ బద్దమట
ఆహారం ఆరోగ్యంకూడా
హక్కులేనట
కడుపుతో ఉన్న అమ్మకి
కనడం హక్కే కదా !
మరి అమ్మ కెందుకీ వ్యథ !!

***

వద్దు ! వద్దంటూ పెట్టుకుంటూంది మొర
కాదు ! పొమ్మంటున్నాడీ నాన్న
జాలిచూపొద్దంటూంది నాన్నమ్మ
ప్రాణాలు నిలిపేవాడు వైద్యుడట
ప్రాణాలు పెకలిస్తానంటూంది డాక్టరమ్మ
అమ్మ కన్నీరు తుడవటానికి
ఒక్క ఆపన్న హస్తమూ ముందుకిరాలేదు
నన్ను బలవంతంగా బయటకు
రప్పించాలని ఇంతమంది చేతులు
చాస్తున్నారేమిటి ?
నన్ను నిర్జీవంగా
మార్చాలని వీళ్ళంతా ఏకమయ్యారు
మా అమ్మకి నాకూ హక్కుల్లేవా ?
మనిషై నిలవడానికి
హక్కులతో పనేమిటి ?
మానవత్వం ఉంటే చాలదా ?
ఆడా మగా ఉంటేనే కదా మనుగడసాగేది

***

పంటి బిగువున బాధలు భరించే ఓతల్లీ
బిగుసుకున్న నీ పిడికిలి నాకు ఉత్తేజం
కదమ్మా !
అమ్మా ! ధైర్యం తెచ్చుకో
మౌనం వీడు -నువ్వు పూనుకుంటే
కన్న బిడ్డనే కాదు
కడుపులోని బిడ్డను రక్షించుకోగలవు
బయటకు వచ్చాకా నీరుణం
నేను తీర్చుకుంటాను
ఎందుకంటే
నేను ఆడపిల్లనమ్మా !
మళ్ళీ మళ్ళీ ఆడపిల్లకే జన్మనిచ్చే
తల్లి నౌతానుకదమ్మా !!

\- ఆర్. దుర్గా ప్రసన్న

చట్టాలు

## Maintanance of Hindu wivaha Children under Hindu Marriage Act 1955

# మనోవర్తి చట్టం

- ఆర్. దుర్గాప్రసన్న, అడ్వకేట్

**కు**టుంబ వ్యవస్థ ఏర్పడిన నాటినుండీ పురుషుడు భార్యా, పిల్లలు, తల్లిదండ్రులు ఇతర కుటుంబ సభ్యుల పోషణా భారాన్ని స్వీకరించి స్త్రీకి కుటుంబాన్ని నిర్వహించే బాధ్యతని అప్ప చెప్పాడు సుకుమారి అయిన స్త్రీని మాతృమూర్తిగా భావించి పిల్లలను కనడం వారి ఆలనపాలనాది సంరక్ష బాధ్యతలను మాత్రమే స్త్రీ బాధ్యతగా భావించేవారు. శారీరకంగా స్త్రీల కంటే బలవంతుడైన పురుషుడు కుటుంబ పెద్దగా వ్యవహరించడమే కాక తన సంపాదనతో కుటుంబాన్ని పోషిస్తూ సమాజానికి తన వంతు ఆర్థిక సేవలనందించడం పురుషుని యొక్క బాధ్యత. పురుషుడు చేసే అన్ని ధర్మ కార్యక్రమాలు సక్రమంగా నిర్వర్తించాడని స్త్రీ భార్యగా ఇంట్లో వుండి అన్ని విధాల సహకరిస్తూ వుంది. ఈ విధంగా భార్యా భర్త లిరువురు కుటుంబ నిర్వహణ మాత్రమేకాక సామాజిక భాద్యతను కలిసి నిర్వర్తించేవారు. ఎవరి ధర్మాన్ని వారు నిర్వర్తిస్తూ, ఎవరి భాద్యత వారు నెరవేర్చి నంతకాలం ఎవరికీ సమస్యలుందవు. కానీ ఎవరి బాధ్యతను వారు నిర్వర్తించనపుడు, మరి కొన్ని అనివార్య పరిస్థితులలోను భార్యా భర్తలు విడివిడిగా ఉండేటప్పుడు స్త్రీని ఆకుటుంబాన్ని ఆర్థిక సమస్యలు వెంటాడుతాయి. సంపాదనా పరుడైన భర్త యొక్క అదుపు ఆజ్ఞలలో, ఆస్తి పాస్తులపై ఎటువంటి హక్కులు అధికారాలులేని స్త్రీ ఆర్థికంగా ఆధారపడి అనేక విపరీతాలకు దారితీసింది. సమాజంలో స్త్రీ యొక్క శక్తికి మేధస్సుకి విలువ లేకుండా పోయింది. ఇంటిపనులకు పరిమితమైన స్త్రీని అంటే బార్యని పురుషుడు తన యొక్క ఆస్తిగా భావించడం మొదలు పెట్టి బానిసగా చిత్రీకరించాడు. ఇవన్నీ ఒక ఒత్తైతే పురుషుని యొక్క బాధ్యతారాహిత్యానికి భర్త అకాల మరణానికి కానీ గురి అయినపుడు సమాజంలో స్త్రీకి ఆర్థిక భద్రత లేకుండా పోయింది. అటువంటి పరిస్థితులలోనే ఆనాడు హిందూ వివాహచట్టం 1955లోనే మనోవర్తి గురించి విపులంగా వివరిస్తూ స్త్రీ చట్ట బద్ధమైన హక్కుని కలిగించడం జరిగింది. మనోవర్తి స్త్రీకి హక్కుగా కల్పించకముందు స్త్రీ భర్త లేదా ఇతర కుటుంబ సభ్యులు దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుండవలసి వచ్చేది. ఎందుకంటే ఆమెకు పుట్టింట్లో పుట్టుకతో పురుషునితోపాటు ఆస్తి హక్కులేదు. పెళ్ళైన తరువాత పురుషుని ఆధీనంలో ఉందవలసిన స్థితి. 1955సం॥లో మనోవర్తి గురించి చర్చించి చట్ట బద్ధమైన హక్కుని కల్పించినప్పటికీ 1956వ సం॥లో The Hindu Adopting and Maintanance Act చేయడం జరిగింది. అంటే 1956 నుండి అమలులోకి వచ్చిన ఈ చట్టం ద్వారా పిల్లల సంరక్షణ మనోవర్తి గురించి చట్ట బద్ధమైన హక్కు కల్పించబడింది. అంతకు ముందు స్త్రీకి మనోవర్తి లేదా భరణంగా కొంత మొత్తాన్ని చెల్లించడం పురుషుని భాద్యతగా హిందూ వివాహచట్టంద్వారా చట్ట బద్ధమైనప్పటికీ 1956 లో వచ్చిన హిందూ దత్తత మరియు మనోవర్తి చట్టం ద్వారా అనేక విధాలుగా స్త్రీలకు ఉపశమనం కలిగించినట్లైంది. నేటికీ ఇదే చట్టం చిన్న చిన్న కాలనుగుణమైన మార్పులు చేర్పులతో అమలులో ఉంది. అంతేకాదు ఇటీవలికాలంలో సమాజంలో మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా "The Maintanance and welfare of Parents and senior Citizens Act, 2007" అమల్లోకి వచ్చింది. అంటే తమను తాము పోషించుకోలేని వృద్ధులైన తల్లిదండ్రులను కూడా కొడుకు పోషించవలసిన బాధ్యతని ఈ చట్టం స్పష్టం చేస్తోంది. 2007వ సంవత్సరానికి పూర్వం తల్లిదండ్రులు ఐ.పి.సి. సెక్షన్ 125 ప్రకారం మాత్రమే భార్యా పిల్లలతోపాటుగా వారి కుమారుని నుండి మనోవర్తిని పొందే హక్కు ఉండేది.

Maintanance మనోవర్తి అంటే :- భార్యగానీ, మైనర్ పిల్లలుగానీ, వృద్ధులైన తల్లిదండ్రులుగానీ తమను తాము పోషించుకోవడానికి తగిన శక్తి యుక్తులు లేనపుడు, ఆర్థిక వనరులు లేనపుడు భర్త/తండ్రి/కుమారుని పై దావా వేసి మనోవర్తిని/ఆర్థిక మొత్తాన్ని చెల్లించమని న్యాయసహాయం అర్థించవచ్చును.

1955 హిందూ వివాహచట్టం ప్రకారం విడాకుల ద్వారా భార్యా భర్తలు విడిపోయినపుడు భర్త కొంత మొత్తాన్ని జీవిత భత్యం (దీన్నే Permanent Allmoney, and Maintanance వ్యవహరిస్తారు) భార్యకు చెల్లించవలసి ఉంటుంది. భార్య యొక్క భవిష్యత్ అవసరాలను కూడా లెక్కించి సెక్షన్ 25ద్వారా ఇవ్వాల్సి ఉంటుంది. లేదా నెల నెలా జీతంలోంచి కూడా భార్యకు మనోవర్తి చెల్లించవచ్చును. అయితే ఆ భార్య మళ్లిపెళ్ళి చేసుకోకుండా ఉంటే జీవిత పర్యంతము చెల్లించాలి. ఒకవేళ విడాకులు పొందిన మహిళ మళ్ళీ పెళ్ళి చేసుకుంటే మనోవర్థి 2వ వివాహం తరువాత చెల్లించనక్కరలేదు. సెక్షన్ 26 ప్రకారం మైనర్ పిల్లలు తల్లి వద్దనే ఉంచుకోవడాన్ని మైనర్ కస్టడీ కోరుతూ ఆ పిల్లల పోషణ, చదువులకు అయ్యే ఖర్చుని కూడా భార్య మనోవర్తితోపాటు చెల్లించాల్సింది భర్తని కోరవచ్చును. అంతకు ముందు స్త్రీకి దత్తత స్వీకరించే హక్కు ఉండేది కాదు. కానీ ఈ చట్టం ద్వారా దత్తత ద్వారా స్వీకరించ

**1955 హిందూ వివాహచట్టం ప్రకారం విడాకుల ద్వారా భార్యా భర్తలు విడిపోయినపుడు భర్త కొంత మొత్తాన్ని జీవిత భత్యం (దీన్నే Permanent Allmoney, and Maintanance వ్యవహరిస్తారు) భార్యకు చెల్లించవలసి ఉంటుంది. భార్య యొక్క భవిష్యత్ అవసరాలను కూడా లెక్కించి సెక్షన్ 25ద్వారా ఇవ్వాల్సి ఉంటుంది. లేదా నెల నెలా జీతంలోంచి కూడా భార్యకు మనోవర్తి చెల్లించవచ్చును. అయితే ఆ భార్య మళ్లిపెళ్ళి చేసుకోకుండా ఉంటే జీవిత పర్యంతము చెల్లించాలి. ఒకవేళ విడాకులు పొందిన మహిళ మళ్ళీ పెళ్ళి చేసుకుంటే మనోవర్థి 2వ వివాహం తరువాత చెల్లించనక్కరలేదు.**

బడిన పిల్లలకు మనోవర్తిని పొందే హక్కుని కల్పించడం జరగింది. అయితే ఒకసారి దత్తత స్వీకరించిన తరువాత ఆ తల్లి దండ్రులు లేదా ఆ పిల్లలు వారి జీవితకాలం ఆ దత్తతకి చట్ట బద్ధులై వుండాలని ఈ చట్టం స్పష్టం చేసింది.

హిందూ స్త్రీ భర్త మరణించినపుడు కూడా అతని ఆస్థిలో వాటాని ఇతర కుటుంబసభ్యులనుండీ కోరే హక్కుని కూడా చట్టం ద్వారా పొందవచ్చును. నాడు 1955లో ఏర్పడిన ఈ చట్టం నేడు అనేక మంది స్త్రీలు పురుషులతో సమానంగా ఆస్తి హక్కుని పొందడానికి మార్గం సుగమమం చేసింది. జీవితమంతా కుటుంబ అవసరాల కోసం అహోరాత్రులు శ్రమిస్తూ తెరవెనుక తమ శక్తిని ధారపోస్తున్న స్త్రీలు కుటుంబ ఆస్థి పాస్తులపై ఏ మాత్రం హక్కు లేకుండా పురుషులపై ఆధారపడవలసిన ఆగత్యం లేదనే ఆలోచనకు నాంది నాటిచట్టం. పురుషుడు -స్త్రీ సమానం అంటూ కుమారునితోపాటు కుమార్తెకూ ఆస్తి హక్కులు కల్పించవలసిన ఆవశ్యకత గుర్తించవలసిన బాధ్యతని ఈ చట్టం ద్వారా సమాజం గ్రహించింది. ఆస్తిపై పెత్తనం చేసే పురుష కుటుంబ సభ్యుల ఆగడాలకు ఈచట్టం కళ్ళెం వేసింది. నేటి స్త్రీ ఆర్థిక స్వేచ్ఛకి అది దారి చూపింది.



# స్పందన

ఎడిటర్ గారికి,

ఎప్రిల్-జూన్ పత్రిక అన్ని విషయాలు కవర్ చేస్తూ చాలా బాగుంది. మీడియా శీర్షికలో"గత వైభవం కాదు, నేటి నిజం మాట్లాడండి" ప్రస్తుత పరిస్థితికి అద్దం పడుతున్నట్లుగా వుంది. "కందుకూరి సాంఘికశుద్ధి ఉద్యమం" గురించి చదివాక చాలా విషయాలు తెలిసాయి. కందుకూరి ఇన్ని సామాజిక అంశాలపై కృషి చేసారా ! అనిపించింది. తెలియని విషయాలు చాలా తెలిసాయి. మహిళా సాధికారత వ్యాసం చాలా బాగుంది. పేరు ప్రఖ్యాతులు గడించిన ముస్లిం సోదరీ మణులు" బాగుంది. పిల్లలతో తల్లిదండ్రులు మెలగాల్సిన విధానం గురించి కూడా మానవిలో వస్తే బావుంటుంది.

**- కె. శాంతకుమారి**

ఎడిటర్ గారికి,

చైతన్య మానవి రోజురోజుకు కొత్త శీర్షికలతో అనేక అంశాలు కవర్ చేస్తూ వస్తోంది. చాలా ఉపయోగకరంగా వుంది. ఏప్రిల్-జూన్ పత్రికలో వచ్చిన 3 కథలు చాలా బాగున్నవి. చట్టాలు, ఆరోగ్యం గురించి కవర్ చెయ్యడం వల్ల అనేక విషయాలు తెలుస్తున్నాయి.

**- కె. రత్నకుమారి**

ఎడిటర్ గారికి,

7వ తరగతి చదువుకున్న పి. హేమమాలిని వ్రాసిన "మహిళా-బాలకార్మికత" గురించి వ్రాసిన కవితలు చాలా బాగున్నవి. పి. సత్యతవతిగారు వ్రాసిన " ఆవిడ కథ" ఆలోచింపచేసేదిగా వుంది. డా॥మృణాళిని రాసిన "జ్యేష్ఠ మాత" కథ కూడా బాగుంది. "మహిళాచైతన్యంపై మాట్లాడుకుందాం రండి ! యు. వాసుకి వ్రాసిన వ్యాసం ఒకటికి రెండుసార్లు చదవాలన్పించింది. "ఎండతో ఎముకల ఆరోగ్యం" చాలా బాగుంది. పైసా ఖర్చు లేకుండా ఎండలో డి. విటమిన్ ఎలా పొందవచ్చో వివరించిన విధానం చక్కగా వుంది. చట్టాలు శీర్షికన "హిందూ వితంతుపునర్వివాహచట్టం" 1856, వ్యాసం ద్వారా ఎన్నో తెలియని విషయాలు తెలుసుకోగలిగాము.

**- పి. రమాదేవి**

ఎడిటర్ గారికి,

ఏప్రిల్ -జూన్ పత్రిక చాలా బాగుంది. మెదడుకు కావలసిన పోషకాహారం అందించేలా ఉంది.

మహిళలపై హింసకు సంభందించి, ప్రభాత్ పట్నాయక్ రాసిన వ్యాసం చాలా బాగుంది. సమస్య మూలాలు పరిష్కార మార్గాలు అర్థమయినవి.

భారతీసాగర్ వ్రాసిన జాతీయ కుటుంబ సర్వే రిపోర్ట్ చాలా బాగుంది. మహిళ-మనిషి -మృగం కథ హృదయానికి హత్తుకుంది. మొత్తం మీద చైతన్య మానవి అన్ని విషయాలలోను, అన్ని కోణాల్లో కవర్ అవుతూ తీసుకురావడం చైతన్యమానవికే చెందుతుంది.

**- రాజ్యలక్ష్మి**

ఎడిటర్ గారికి,

ఏప్రిల్ -జూన్ పత్రికలో వచ్చిన 'ఆవిడ" కథ ఈరోజు చాలా మంది ఎదుర్కొంటున్న సమస్యను కళ్ళకు కట్టినట్లుగా చూపుతూ మానవికే హైలైట్‌గా ఉంది.

**- పద్మ**

ఆరోగ్యం

# హెర్నియా అంటే ఏమిటి ?

- డా॥ రమాదేవి

గజ్జల్లోకాని, ఉదరంలో కాని కండరాలు బలహీనపడినపుడు కడుపులోని కొవ్వు, ప్రేగులు వాటిగుండా బయటికి రావటానికి ప్రయత్నిస్తాయి. అప్పుడు బయటికి కనపడే ఉబ్బును హెర్నియా అంటాము. కారు లేదా బైక్ టైర్ పంచర్ అయినప్పుడు లేదా దెబ్బతిన్నప్పుడు ట్యూబ్ ఆ ప్రాంతంలో ఉబికి వచ్చినట్లుగా వుంటుంది. హెర్నియాలో ఇలాగే జరుగుతుంది. ఏ వయస్సు వారికైనా వచ్చే అవకాశం వుంది. ఈ వ్యాధి వున్నవారికి ఆ ప్రాంతంలోని అవయవం లేదా కణజాలం ఉబ్బినట్టు కనిపిస్తుంది. మొదట్లో నొప్పివున్నట్టు అనిపించకపోయినా తర్వాత సమస్య మరింత జటిలమవుతుంది. కాబట్టి ఇలావుంటే డాక్టర్ని సంప్రదించాలి.

హెర్నియాలో రకాలు :-

1). గజ్జల్లో వచ్చే హెర్నియా (Inguinal hernia)

2) తొడ లోపలి భాగంలో వచ్చే హెర్నియా (Femoral hernia)

3) ఉదర పైభాగంలో వచ్చే హెర్నియా (epigastric hernia, umbilical hernia, paraumbilicalhernia)

4) శస్త్ర చికిత్స తరువాత, కొంతకాలానికి శస్త్రచికిత్స జరిగిన చోట ఏర్పడే హెర్నియా (Post operative incisional hernia)

సాధారణంగా ఇది బొడ్డుదగ్గర లేదా పొత్తికడుపు దిగువన మర్మాయువాల ప్రాంతంలో వస్తుంది. ఆపరేషన్ జరిగిన ప్రాంతంలో కూడా రావచ్చు. చర్మం క్రింద వాపులా కన్పిస్తుంది. దగ్గినపుడు, బరువులు ఎత్తేటప్పుడు. మలమూత్ర విసర్జన సమయాల్లో ఆవాపు మరింత స్పష్టంగా తెలుస్తుంది. మొదట్లో ఎలాంటి బాధ లేకున్నా,నొప్పి కొద్దిగానే వున్నప్పటికీ రానురాను సమస్య తీవ్రమౌతుంది.

స్త్రీలలో దీనిని సాధారణంగా గుర్తించరు. ఎందుకంటే నొప్పిలాంటి సమస్యలను వేరే స్త్రీలవ్యాధులుగా పొరపడటం జరుగుతుంది. డాక్టర్ల దగ్గరికి వెళ్ళినపుడు ఈ సమస్యలను చెప్పరు. దానితో నొప్పి తగ్గటం కోసం అవసరమైన వైద్యాలు చేయుటం జరుగుతుంది.

**హెర్నియా ఎందుకు వస్తుంది ?**

పొత్తికడుపు గజ్జలు లాంటి చోట సహజంగానే బలహీన ప్రాంతాలను కలిగివుంటుంది. స్త్రీలలో సిజేరియన్, టుబెక్టమీ, గర్భసంచి ఆపరేషన్ లాంటివి జరిగినప్పుడు ఆ ప్రాంతంలో కండరాలు బలహీనమవుతాయి. ఇంకా కొంత మందికి పుట్టుకతోనే ఈ బలహీన ప్రాంతాలు వుంటాయి. ఊబకాయం, బరువుల్ని ఎత్తడం, దగ్గు, మల మూత్రవిసర్జన సమస్యలు ఈ బలహీన ప్రాంతాలను మరింత బలహీనం చేస్తాయి. ఫలితంగా హెర్నియా ఏర్పడుతుంది. పిల్లల్లో కనిపించే హెర్నియాలలో అధికశాతం పుట్టుకతో వచ్చేవే.

**హెర్నియాతో ఎలాంటి సమస్యలు రావచ్చు?**

నిరంతరాయంగా పొత్తి కడుపులో నొప్పి, తీపు, సూదులతో పొడిచినట్లు నొప్పి వుండవచ్చు. హెర్నియా దానంత అదే తగ్గదు. ఒకోసారి నొప్పి లాంటివి లేకుండా వుండవచ్చు. కాని సమస్య తీవ్రమైతే ఆపరేషన్ మినహా వేరే మార్గం లేదు.

**హెర్నియాను నయం చేయడం ఎలా ?**

"ఊబకాయం తగ్గించుకోవటం, దగ్గులాంటి వాటిని వెంటనే నయం చేసుకోవటం, మలబద్ధకం, మూత్ర విసర్జనలో కష్టం వుంటే డాక్టరు సలహాతో వైద్యం చేయించుకోవాలి. బరువుల్ని ఎత్తకూడదు.

**హెర్నియా ఆపరేషన్ :-** మూడు, నాలుగు అంగుళాల గాటుపెట్టి సర్జరీ చేస్తారు. అవసరమైతే (ఆపరేషన్ తర్వాత వచ్చే హెర్నియా) మెష్ లాంటిది కూడా చేస్తారు. సాధారణంగా 5రోజుల్లో ఇంటికి వెళ్ళవచ్చు. లాప్రోస్కోప్ ద్వారా కూడా ఇది చేయవచ్చు. పేషెంట్ మరుసటిరోజు ఇంటికి వెళ్ళవచ్చు.

**ఆపరేషన్‌తో దుష్ఫలితాలు వుంటాయా ?**

హెర్నియా ఆపరేషన్ ఇతర సాధారణ ఆపరేషన్ లాంటిదే. దీనిలో వాటిల్లే సమస్యలు చాల తక్కువ. కాబట్టి ఆందోళన చెందాల్సిన అవసరం లేదు.



# ఉద్యమాల బాటలో

## మద్యనియంత్రణ పాలసీ రూపొందించాలి




రాష్ట్ర ప్రభుత్వం మద్యం ఆదాయాన్ని ఒక వనరుగా భావించటం వలన విచ్చలవిడి మద్యం అమ్మకాలు పెరిగాయి. మద్యం వ్యసనం పెరగటంతో కుటుంబాల ఆర్థిక పరిస్థితి దిగజారింది. అంతేకాదు. అనారోగ్యంతో ఆర్థాయుష్షుతో చిన్న వయస్సులోనే భర్తలను కోల్పోయి కుటుంబ భారంతో మహిళలు జీవచ్ఛవాల్లా మారుతున్నారు. తాగుడు మైకంతో ఉచ్ఛనీచాలు మరిచి ప్రవర్తిస్తున్నారు. ఇంటా బయటా మహిళలు, బాలికలపై హింస పెరిగింది. అత్యాచారాలు పెరిగాయి. కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నమవుతోంది. మద్యం వలన ప్రభుత్వం అందించే సంక్షేమ పథకాల ఫలితాలు నిరుపయోగమవుతున్నాయి. రాష్ట్రంలో పెరుగుతున్న మద్యం అమ్మకాలు, విచ్చలవిడిగా ఉన్న అనధికార బెల్టుషాపులు, లైసెన్స్ షాపుల వద్ద లూజు అమ్మకాలు మహిళల్లో తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు.. బెల్టుషాపులు రద్దు చేస్తామని సి.ఎం. ప్రకటన కాగితాలకే పరిమితమైంది. 2013-14 సంవత్సరానికి సంబంధించి ఎక్సైజ్ పాలసీని యధాతథంగా అమలు జరపాలని, ప్రస్తుతం ఉన్న బార్ల సంఖ్యను పెంచాలని, వైన్ షాపులవద్ద సిట్టింగ్ రూమ్‌లకు అవకాశాలు యివ్వాలని ప్రభుత్వం యోచిస్తుంది. హైదరాబాద్‌లోని రాష్ట్ర ఎక్సైజ్ కార్యాలయం వద్ద మహిళా, యువజన, విద్యార్థి సంఘాల ఆధ్వర్యంలో మద్య నియంత్రణ దిశగా ఎక్సైజ్ పాలసీని మార్చాలని, బెల్టు షాపులు రద్దు చేయాలని కోరుతూ ధర్నా జరిగింది. దీనితోపాటు రాష్ట్రవ్యాప్తంగా అన్ని జిల్లాలోనూ నిరసన కార్యక్రమాలు జరిగాయి.




## ఉద్యమ విజయం




కృష్ణాజిల్లా వీరులపాడు మండలంలో నరసన్నపాలెం గ్రామం. గ్రామంలో మద్యం లైసెన్స్ షాపు లేదుగానీ చిన్న గ్రామంలో 7బెల్టు షాపులున్నాయి. ఇటీవల డిగ్రీ స్టూడెంట్ తాగి యాక్సిడెంట్ అయి చనిపోవడంతో గ్రామంలో వున్న యువతీ యువకులు, పొదుపు సంఘాలు బెల్టుషాపులకు వ్యతిరేకంగా ఉద్యమం చేపట్టారు. అన్ని రాజకీయపార్టీలను కల్సి మద్య రహిత గ్రామంగా ప్రకటించాలని కోరారు. 35 మందితో కమిటీ ఏర్పడి మద్యం అమ్మితే 10వేలు, తాగితే 1000/- లు ఫైన్ అని తీర్మానించారు. ఆరు నెలలనుండి ఆగ్రామంలో తాగుడు బంద్ అయింది. నరసన్నపాలెంలో జరిగిన ఉద్యమానికి ఐద్వా పూర్తి మద్దతు తెలిపింది. ఊరేగింపులు, సభలు మెడికల్ క్యాంపు నిర్వహించింది. ఈ ఉద్యమం ప్రక్క గ్రామాలకు వ్యాపించింది. ఐద్వా నందిగామ డివిజన్‌కమిటీ అధ్వర్యంలో ప్రజానాట్యమండలి కళా రుపాలతోబెల్టుషాపులకు వ్యతిరేకంగా వీరులపాడు మండలం 10 గ్రామాలలో జీపు జాతా నిర్వహించింది. విచ్చలవిడి మద్యం అమ్మకాల వలన మద్యం సేవించే వారి సంఖ్యపెరిగింది. కుటుంబ భారం మహిళలే నిర్వహించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ప్రతి ఇంటిలో ఒక్కో గాధ. జుజ్జూరు, అల్లూరు గ్రామాలలో జాతాకి స్పందించి లైసెన్స్‌షాపు, బెల్టుషాపులకు వ్యతిరేకంగా మహిళలు ఉద్యమించారు. అల్లూరు గ్రామంలో లైసెన్స్‌షాప్, బెల్టుషాపులకు వ్యతిరేకంగా మహిళలు ఉద్యమించారు. అల్లూరులో లైసెన్స్‌షాపు ఎత్తివేసేవరకు పోరాటం జరిగింది. షాపులో వున్న మద్యం సీసాలను పగులకొట్టి మహిళలు తమ ఆగ్రహాన్ని వ్యక్తం చేశారు. కలెక్టర్, ఎక్సైజ్ అధికారులను ఐద్వా నాయకత్వంతో కల్సి మావూర్లో మద్యం షాపు వద్దని వినతి పత్రం ఇచ్చారు. షాపు యజమాని లైసెన్స్‌షాపులో వున్న సరుకును అక్కడి నుండి తరలించే వరకు పోరాటం చేసి విజయం సాధించారు. ఈ జాతాలో రాష్ట్ర, జిల్లా నాయకత్వం పాల్గొంది.

### ఇంటి పనివారి సమస్యలు పరిష్కరించాలని కోరుతూ

రాష్ట్ర వ్యాప్తంగా ఇళ్లలో పాచిపనులు చేసే కార్మికులు అనేక సమస్యలతో కొట్టు మిట్టాడుతున్నారు. అవమానాలు, వేధింపులు, చేసే పనికి సరియైన వేతనాలు లేవు. ఇ.ఎస్.ఐ., ప్రావిడెంట్ ఫండ్, సౌకర్యం కూడా లేదు. ప్రభుత్వమే ఇంటిపనివారికి గుర్తింపు కార్డులు ఇవ్వాలని




ఏళ్ళ తరబడి పోరాటం చేస్తున్నారు. అయినా ప్రభుత్వ ఆలసత్వం కొనసాగుతుంది.

పని భద్రత లేని ఇంటిపని వారికి, ప్రభుత్వ సంక్షేమ పథకాలలో మొదటి ప్రాధాన్యత కల్పించాలని, ఇళ్ళ స్థలాలు కేటాయించాలని స్నేహ ఇంటి పనివారు సంక్షేమ సంఘం ఆధ్వర్యంలో హైదరాబాదు, మహబూబ్‌నగర్, ప్రకాశం, విజయవాడ, కర్నూలు తదితర పట్టణాలలో లేబర్ కమీషనర్ ఆఫీస్ ముందు ధర్నాలు జరిగాయి.


విజయవాడ

**అధ్వాన్న స్థితిలో ప్రభుత్వ పాఠశాలలు, సంక్షేమ హాస్టళ్ళు**

విద్యాసంవత్సరం ప్రారంభం కావడంతో ఐద్వా రాష్ట్ర వ్యాప్తంగా జూన్ నెలలో ప్రభుత్వ బాలికల పాఠశాలలు, సంక్షేమ హాస్టళ్లలో ఉన్న వసతుల గురించి సర్వే చేయడమైనది. బాలికలు ఎదుర్కొంటున్న ఎన్నోసమస్యలు వెలుగులోకి వచ్చాయి. అనేక సూల్స్‌లో పాఠ్యపుస్తకాలు స్కూల్ డ్రస్సులు ఇంకా అందలేదు టీచర్ల కొరత ప్రతి ప్రభుత్వ


హైదరాబాద్

పాఠశాలలో ప్రస్ఫుటంగా కనిపించింది. స్వీపర్లు లేకపోవడంతో పిల్లలే తమ క్లాసురూమ్‌లను ఊడ్చుకుంటున్నారు.

సంక్షేమ హాస్టళ్ళు సమస్యలతో పేరుకు పోయినవి. సరియైన భద్రత సౌకర్యాలు లేకపోవడంతోపాటు, బాత్‌రూమ్‌లు, టాయ్‌లెట్స్ చాలా అపరిశుభ్రంగా ఉన్నవి. భోజనం చాలా నాసిరకంగా వుంది. 3నెలల కొకసారి ఇచ్చే సబ్బులు,నూనె, నాప్‌కిన్స్. తదితర వస్తువులు సరిపోయినంత ఇవ్వక పోవడంతో విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు.

ప్రభుత్వం వెంటనే ప్రభుత్వ స్కూల్స్ మరియు సంక్షేమ హాస్టళ్ళలో విద్యార్ధినులు ఎదుర్కొంటున్న సమస్యలు పరిష్కారించాలని అందుకు తగిన బడ్జెట్ కేటాయింపులు పెంచాలని ఐద్వా కోరుతుంది.

**సంఘీభావ నిధి**


రంగారెడ్డి

తీవ్రమైన వరదలతో అతలాకుతలమైన ఉత్తరాఖాండ్ బాధితులకు ఆదుకోవడానికి ఐద్వా కేంద్రకమిటీ సంఘీబావనిధి వసూలుకు పిలుపు నిచ్చింది. కృష్ణ, హైదరాబాదు, విశాఖ, గుంటూరు, గోదావరిఖని,ఖమ్మం తదితర జిల్లాలనుండి రూ. 46,0249 లను వసూలు చేసి ఐద్వా కేంద్ర కమిటీకి అందచేసారు. ఐద్వా అన్ని రాష్ట్రశాఖలనుండి నిధులు సేకరించి పంపారు.

**బాలికలకు భద్రత కరువు :-** దేశంలో, రాష్ట్రంలో మహిళలపై, బాలికలపై రోజురోజుకూ అత్యాచారాలు, హింస పెరిగిపోతున్నది. రాజస్థాన్‌లోని భరత్‌పూర్ జిల్లాలో, తండ్రి ఐదుగురు కుమార్తెలపై కొన్నేళ్ళుగా అత్యాచారం జరవడం నభ్యనమాజం సిగ్గుతో తలదించుకోవాల్సిన అంశం. ఇదిలావుండగా చత్తీస్‌ఘడ్‌లో, హాస్టల్‌లోకి చొరబడిన 7మంది దుర్మార్గులు బాలికలందరినీ తాళ్ళతో కట్టేసి 4గురు బాలికలను అపహరించుకుపోయి అడవిలో సామూహిక అత్యాచారానికి పాల్పడ్డారు. కర్నూల్‌లో యువతీపై ఆటో డ్రైవర్ అత్యాచారానికి పాల్పడ్డాడు. ఇటువంటి ఘటనలు రోజు రోజుకూ పెరుగుతున్నా, కేంద్రం, ఆయా రాష్ట్రప్రభుత్వాలు నిమ్మకు నీరెత్తినట్లుగా వ్యవహరిస్తున్నాయి. వెంటనే దోషులను అరెస్టు చేసి కఠినంగా శిక్షించాలని, బాలికలకు భద్రత కల్పించాలని కోరుతూ, ఐద్వా హైదరాబాదు సెంట్రల్ కమిటీ ఆధ్వర్యంలో ప్రభుత్వ దిష్టిబొమ్మను దహనం చేసారు.

**రేషన్ కార్డుల కోసం**

వరంగల్లు ఐద్వా జిల్లా కమిటీ ఆధ్వర్యంలో అర్హులైన వారందరికి



వరంగల్

రేషన్ కార్డులివ్వాలని, సరుకులు ఇవ్వాలని కోరుతూ వరంగల్లు జిల్లా కలెక్టరేట్ ఎదుట ధర్నా నిర్వహించారు. తదనంతరం కలెక్టర్ ఎం.ఆర్,ఓ,కు ఆదేశాలిచ్చారు. తొలగించిన రేషన్‌కార్డుదారులందరికి, మళ్ళీ రేషన్ సరుకులు ఇచ్చారు.

**మహిళలు-హింస పై సెమినార్**

మహిళలపై హింస-పర్యవసానాలు -పరిష్కారాలు అనే అంశంపై విజయవాడ నగర కమిటీ అధ్వర్యంలో సెమినార్ జరిగింది. సెమినార్‌లో హైకోర్టు జడ్జి శ్రీచంద్రకుమార్, జిల్లా ప్రధాన న్యాయమూర్తి చక్రధరరావు, మహిళా సెషన్స్ కోర్టు జడ్జి నిర్మల, సీనియర్ అడ్వకేట్ సుంకర రాజేంద్రప్రసాద్ ప్రసంగించారు. సెమినార్‌కి 300 మంది హాజరయ్యారు.

**కెప్టెన్ లక్ష్మి సెహగల్ ప్రథమ వర్ధంతి నేత్ర దాన శిబిరం**

కెప్టెన్ లక్ష్మి సెహగల్ ప్రథమ వర్ధంతి సందర్భంగా ఐద్వా ఆలిండియా కమిటీ పిలుపు మేరకు హైదరాబాద్ నగర కమిటీ, విశాఖ సిటీ కమిటి, గుంటూరులలో నేత్రదాన ఆమోద కార్యక్రమం జరిగింది. మిగిలిన అన్ని జిల్లాల్లో వర్ధంతి సభలు జరిగాయి.
కార్యక్రమంలో ఐద్వా కార్యకర్తలు, శ్రేయోభిలాషులు పెద్ద ఎత్తున పాల్గొని నేత్రదానం చేసేందుకు ఆమోదం తెలుపుతూ పత్రాలను నింపడం మరియు ప్రతిజ్ఞ చేయడం జరిగింది. ఈ కార్యక్రమాన్ని ప్రారంభిస్తూ డా॥ శ్యామలాంబ గారు (చిన్న పిల్లల వైద్యులు) కెప్టెన్ లక్ష్మి సెహగల్ స్ఫూర్తితో ఈ కార్యక్రమం నిర్వహించడం ఆహ్వానించదగ్గ విషయమని అన్నారు. తెలంగాణా సాయుధ పోరాట యోధురాలు ఐద్వా నాయకురాలైన మల్లు స్వరాజ్యం మాట్లాడుతూ ఆనాడు సుభాష్ చంద్ర బోస్ సైన్యంలో ఝాన్సీ లక్ష్మిబాయ్ రెజిమెంట్‌కు నాయకత్వం వహించి పోరాటం చేసి తన జీవిత చరమాంకం వరకు ప్రజలతో మమేకమై ఐద్వా పోషకురాలిగా ఉన్నారని, ఆమె మరణానంతరం దేహాన్ని వైద్యశాలకు ఇచ్చారని ఆమె వారసులుగా మనమంతా నేత్రదానం చేయడం ఎంతో సమంజసమైన కార్యక్రమమని కొనియాడారు.

సరోజనిదేవి కంటి ఆసుపత్రి వైద్యులు డా॥ రవీంద్ర గౌడ్ హాజరైన వారికి అవగాహన కల్పించి మనదేశంలో కంటి చూపు లేని వారు కోట్లలో ఉన్నారని, వారిలో కొందరికైనా ఈ లోకాన్ని చేసే అవకాశం ఇచ్చేందుకు నేత్రదానం చేయవలసిన అవసరం ఎంతో ఉందని తెలియజేశారు.

**ఇఫ్తార్ :-** రంజాన్ పండుగ సందర్భంగా కూకట్‌పల్లి డివిజన్‌లోని దిల్‌కుష్ నగర్‌లో ఐద్వా ఆధ్వర్యంలో ఇఫ్తార్ విందు ఏర్పాటు చేశారు. ముస్లిమ్ మహిళలు పెద్ద ఎత్తున పాల్గొన్నారు. స్థానిక కార్పొరేటర్లతోపాటు ప్రజా సంఘాల నాయకులు పెద్ద ఎత్తున పాల్గొన్నారు.


రంగారెడ్డి

**నగదు బదిలీ పథకంపై**

గ్యాస్‌కు నగదు బదిలీ వద్దు అని అమలాపురం ఎంఆర్ఓ ఆఫీసు ముందు ఐద్వా ఆధ్వర్యంలో ధర్నా జరిగింది. గ్యాస్‌కు నగదు బదిలీ వర్తింపచెయ్యడం ద్వారా ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారని, కొద్ది మందికి మాత్రమే బ్యాంకులో నగదు జమ అయ్యిందని, గతం కంటే రేటు పెరిగిందని మహిళలు ఆందోళన చెందుతున్నారని ఐద్వా నిర్వహించిన సర్వేలో తేలింది. సర్వేలో వచ్చిన సమస్యల ఎంఆర్ఓ గారికి మెమోరాండం ఇవ్వడమైనది.



హైదరాబాద్



తూర్పు గోదావరి




# "Teacher is a potter"

## Moulds the Child in a perfect shape / proper shape



## Features:

- Edu. Comp. Smart Classes for all classes
- Special emphasis on spoken and written communication skills
- Well trained and Qualified teachers
- Intensive practice in English to improve communication skills.
  Excellent infra structure with latest edu. Comp. Smart Classes to accelerate mental growth ability, aptitude, caliber, self creative confidence.
- Edu.Comp. Smart Classes to inculcate knowledge with experience.
- Excellent library / laboratory with Edu.Comp. Smart Classes to be practical in life.
- Excellent residential facility.
- Emphasis on nutrious diet.
- Playway methods.
- Montessori with Spoken / Written skills.

To Run the Smart Classes, We are entering into a contract with Edu.Comp. Solutions Ltd., a very big institute in India, which has international Network in Educational Hardware and Software.




## Other Activities :

- Field trips and Educational Tours
- Celebration on Festivals.
- Annual Day Celeberation.
- Sports event, Colour day.
- Seminars, Puppet Shows.
- Knowledge Centre.








Our main aim is education for all




Katipally Ravinder Reddy Education Society's

# RAVI

Montessori Techno School

Public School

High School Recog.by Govt. of. AP.

for more details contact : 8801896263, 9247090421

Godavari Vidya Bhavan, Subhash Nagar, Nizamabad

*With Best Wishes from* : Katipally Ravinder Reddy College of Education, Nizamabad.

R.No. APTEL/2006-20000



# జలసేద్యం




- భవిష్య సంతతికి కావలసిన జలసిరికై ఉద్యమ బాటలో
- వరంగల్ నగరపాలక సంస్థ చేపట్టిన

## "జలసేద్యం"

కార్యక్రమములో పాల్గొందాం

- ప్రతి ఇంటిలో ఇంకుడు గుంత నిర్మిద్దాం
- భవిష్యత్తులో నీటి కష్టాలు అధిగమిద్దాం
- మన సంతతికి నీటి కొరత తొలగిద్దాం
- పది శాతం ఆస్తి పన్ను మినహాయింపు పొందుదాం

గమనిక :- ఇంకుడు గుంత లేని ఇండ్లకు 25 శాతం అపరాధ రుసుము విధించబడును.





కిషన్, ఐ.ఏ.ఎస్.
కలెక్టర్
వరంగల్ జిల్లా



వివేక్ యాదవ్,
కమిషనర్
వరంగల్ జిల్లా

ఇంకుడు గుంత

కమిషనర్,
వరంగల్ నగరపాలక సంస్థ

Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Block No.24, HIG, Phase-II, 1-8-1, Baghlingampally, Hyderabad -500 044. Printed at Prajasakti Daily Printing Press, M.H.Bhavan, Plot No.21/1, Azamabad Industrial Area, Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020. Ph: 27665420. Editor : T.Jyothi



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A140 |
| పుస్తకం పేరు | అంతరిక్ష విజ్ఞానం |
| తారీఖు | 21/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |